భారతదేశంలోని ప్రతి భాషలోను ప్రఖ్యాతి చెందిన కొన్ని ఉత్తమ రచనలు ఇతర భారతీయ భాషల్లోకి అనువదింపజేసి, తద్వారా, ఆయా వాతావరణం, జీవిత విధానం, ఆచారాలు, అలవాట్లు, ఇతర ప్రాంతీయులకి ఎరుకపరచటమే ఈ గ్రంథమాల యొక్క ముఖ్యోద్దేశము. ఈ ఉద్దేశానికి అనుగుణంగా, సామాన్యంగా ఈ నాటికి చెందిన సమకాలిక రచనల నుంచి ఉత్తమ గ్రంథాలను ఎన్నుకొనడం జరుగుతుంది.

మన దేశంలో ఎన్నో భాషలున్నాయి. కాని ఇరుగు పొరుగు భాషల్లో గోచరించే భావ సంపదను గురించి కానీ, ఆలోచనా ప్రవాహాన్ని గురించి కానీ, సాంఘిక సంచలనాన్ని గురించి కానీ మనకి తెలిసినది చాలా తక్కువ. ఇది చాలా విచారకరమైన విషయం. యూరప్‌లాటి భూభాగాల్లో వేరు వేరు భాషలు మాట్లాడేవారు. వేరు వేరు దేశాలు ఉన్నప్పటికీ వారికి మనకంటె పరస్పర పరిచయం ఎక్కువ.

అనేక భాషలుగల మన దేశంలో, ఏక జీవితము చేకూరి, వివేకవంతులైన ప్రజానీకంలో పరస్పర పరిచయం ఏర్పడేందుకు ఈ గ్రంథమాల తోడ్పడాలని మా ప్రయత్నం. ఇదే మా ఆశయం.

# స్వీయచరిత్ర సంగ్రహము : కందుకూరి వీరేశలింగము

సంక్షిప్తము :

కొడవటిగంటి కుటుంబరావు



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా
న్యూ ఢిల్లీ

# పీఠిక

కట్టమంచి రామలింగారెడ్డి లాంటి మహా మనిషి ఆయనను "ఆధునిక కాలంలో అగ్రగణ్యుడైన ఆంధ్రుడు"గా భావించారు. "ప్రముఖ భారతీయులలో ఒకడు; లోతైన వివేచనా, అంతులేని సాహసమూ, అపారమైన శక్తిగలవాడు. అసత్యాన్ని చెండాడి, ప్రగతి మార్గాలకోసం పోరాడాడు," అని రాజాజీ ఆయనను గురించి అన్నారు. వీరేశలింగం వ్యక్తిత్వమూ, ఆయన సాగించిన సంఘర్షణలూ, సాధించిన విజయాలూ, నిరాక్షేపణీయమైన ఆయన ప్రజా సేవా, దేశసేవా ఈ సంగ్రహ స్వీయ చరిత్రలో వ్యక్తమవుతున్నది.

శ్రీ నార్ల వీరేశలింగంగారిని గురించి లోగడ రచించిన ప్రశస్తమైన పుస్తకం (సాహిత్య అకాడమీ ప్రచురణ) చదివినవారికి నార్లవారి ఉద్ఘాటనలకు ఈ గ్రంథంలో ఆధారాలు పుష్కలంగా లభించగలవు.

ఈ గ్రంథం చివరలో వీరేశలింగం గారు, ఆంధ్రుల జీవితంలోనూ, సామాజిక దృక్పథంలోనూ మూడు, నాలుగు దశాబ్దాల మీదట కలిగిన మార్పులను వర్ణించారు. కాని ఆ మార్పులకు తాను ఎంతగా దోహదం చేసినదీ ఆయన చెప్పుకోలేదు. రామలింగా రెడ్డిగారు చెప్పినట్టు, "వీరేశలింగం ప్రముఖ నవశక నిర్మాతలలో ఒకడు కావడం వల్లనే దానిని ప్రతిబింబించ గలిగినాడు. ఆయన దాని ముద్దుబిడ్డ కనుకనే స్రష్టకూడా కాగలిగినాడు. ఏమంటే, కాల ప్రభావాన్ని జీర్ణించుకున్నవారే స్రష్టలు కాగలరు."

నిజానికి వీరేశలింగం, కుళ్లిపోయిన సమాజం మీదా, కుళ్లు సంస్కారం మీదా ధ్వజమెత్తటానికి పూర్వం ఆ సంఘానికి, సంస్కృతికీ చెందిన కుళ్లులోనే జీవించాడు. ఆయన వాయువేగంతో జన సామాన్యాన్ని తోసుకుని ముందుకు వెళ్లి, వారి పీడనలకు గురి అయి, చిట్టచివరకు వివిధ జీవిత రంగాలలో పురోగమనానికి మార్గాలేవో నిరూపించగలిగాడు. సాహిత్య రంగంలో సహితం ఆయన తన కృషిని కొన్ని శతాబ్దాల క్రితం ఉండిన ప్రక్రియలతో ప్రారంభించి కాలక్రమాన ఆధునిక తెలుగు సాహిత్యానికి

అగ్రగామిగా నిలబడ్డాడు. ఆయన ఇతరులను ఒకవంక సంస్కరిస్తూనే మరొకవంక తనను తాను సంస్కరించుకున్నాడు.

శ్రీ నార్ల అన్నట్లు వీరేశలింగం "ఆదర్శ దృక్పథంగల కార్యవాది". ఆయన తనకు ఎదురైన ప్రతి సాంఘిక దురన్యాయాన్నీ ఎదుర్కోవటమే గాక, దీక్షగా అలాంటి లోపాలను కనిపెట్టుకుని వెతకటమేగాక, తన అనుచరుల వర్తన నిర్దుష్టంగా ఉండాలని పట్టుబట్టి, వారి స్ఖాలిత్యాలను తీవ్రంగా విమర్శించేవాడు. ఈ విషయంలో ఆయనకూ, గాంధీజీకి కొంత పోలిక ఉన్నది.

వెనుకకు తిరిగి చూసుకుంటే, ఇంత గొప్పవాడికి రాజకీయ పరిజ్ఞానం లేకపోవడం ఒక కళంకమేమో ననిపిస్తుంది. కాని ఆయన కాలంలో రాజకీయాలు చాలావరకు దౌర్జన్య వాదంతోనో, నినాదాలతోనో కూడి ఉండేవి. నైతిక, ఆధ్యాత్మిక దృక్పథంతో కూడిన గాంధీయ రాజకీయాలు దేశంలో ఇంకా అవతరించలేదు. దేశాభ్యున్నతి అస్తవ్యస్తంగా జరగరాదని వీరేశలింగం చెప్పిన మాట వాస్తవం. ఈనాడు మన దేశంలో స్వాతంత్ర్య సమస్య పరిష్కారమైనప్పటికీ, వీరేశలింగం ప్రతిఘటించిన సంఘపీడలన్నీ - మూఢ విశ్వాసాలూ, మతహంకారామూ, కులతత్వమూ, మత విభేదాలూ, అధికారుల అవినీతీ, కలవారు లేనివారిని పీడించటమూ, వాస్తవ సామాజిక పురోభివృద్ధిపట్ల అలక్ష్యమూ, సంస్కృతీ శూన్యమై ప్రజలకు మేలు చేయలేని చౌకబారు సాహిత్యమూ మొదలైనవి — ఇంకా మన జాతిని పీడిస్తూనే ఉన్నవి.

వీరేశలింగాన్నీ, ఆయన ఉద్యమాలనూ పక్కకు నెట్టినది జాతీయోద్యమం కావచ్చు. ఏమంటే, ఆంధ్రులు రెండవ ప్రపంచ యుద్ధం అనంతరం దాకా వీరేశలింగాన్ని మరిచిపోయారు. దీక్షగా వీరేశలింగాన్ని స్మరించటం ప్రారంభించిన వారు ఆంధ్రదేశంలోని అభ్యుదయ రచయితలు. ఇప్పుడిప్పుడు ఆయన గొంతుకు తిరిగి బలం చేకూరుతున్నది. దేశం ముందుకు రావాలంటే ఆయన దృక్పథాలు మళ్లీ అమలులోకి రావాలి.

అసంఖ్యాకమైన వీరేశలింగం రచనలలో ఆయన స్వీయ చరిత్రకు ఒక విశిష్ట స్థానం ఉన్నది. ఈ గ్రంథమే లేకపోతే, సంఘ సముద్ధరణ కొరకు ఆయన చేసిన కృషి స్థానిక స్మరణలోనే ఉండిపోయేది. అందుకనే ఈ గ్రంథాన్ని "ఒక విధంగా ఆంధ్రుల సాంఘిక చరిత్ర" అన్నారు.

స్వీయచరిత్ర ప్రథమభాగం 1910 డిసెంబరులోనూ, ద్వితీయ భాగం 1915 ఏప్రిల్‌లోనూ వెలువడ్డవి. తదుపరి వీరేశలింగంగారు నాలుగు సంవత్సరాలపాటు, 1919 మే 27 దాకా, జీవించారు. ఆఖరుక్షణందాకా ఆయన కృషిసాగుతునే వచ్చింది. ఉదాహరణకు, గిడుగు రామమూర్తి పంతులుగారు ప్రారంభించిన వ్యావహారిక భాషావాదాన్ని వీరేశలింగం గారు పూరిగా బలపరచి, వర్తమాన ఆంధ్రభాషా ప్రవర్త సమాజానికి మొదటి అధ్యక్షుడయినారు. నిజానికి ఆయన ఆంధ్రలోని అనేక సామాజిక, సాంస్కృతిక ఉద్యమాలకు "మొదటి" వాడు. అందుకే ఆయనను గురించి కె. ఈశ్వరదత్తు అన్నారు: "ఆంధ్రలో జీవితప్రవాహాన్ని వీరేశలింగం కొత్త దారి పట్టించాడు. ఈ కృషిలో ఆయనకు మార్గదర్శకులు లేరు. ఆయనతో పోల్చదగిన అనుయాయులూ లేరు."

కొడవటిగంటి కుటుంబరావు

# విషయసూచిక

## ప్రథమ భాగము

### 1. బాల్య దశ

భరత ఖండమునందలి పురాతనములయిన పట్టణములలో నొక్కటియయి, గోదావరీ తీరమందు ప్రసిద్ధికెక్కియున్న రాజమహేంద్రవరమునందలి యస్మత్పితామహార్జితమైన స్వగృహమునందు 1848, ఏప్రిల్ 16 న సూర్యోదయానంతరము మూఁడు గడియలకు నేను జనన మొందితిని.

మా యిల్లు రాజమహేంద్రవరములో నున్న పెద్ద యిండ్లలో నొకటి. పూర్వార్జితమైన యంత విశాలభవనమును గలిగియుండుటయే కొంతవరకు మా పూర్వులున్నత స్థితిలో నున్నవారని తెలుపవచ్చును. ఆ గృహమును కట్టించిన మా తాతగారు కొంతకాలము సంస్థానాధిపతుల యొద్ద దివానుగా యుండిరి. మా పూర్వులు సహితము సంస్థానాధిపతులును, దేశపాండ్యాలును నయియుండిరి. స్వయోగ్యత లేకయే పూర్వుల గొప్పతనమునుబట్టి తమకు గౌరవము కలుగవలెననెడు భావము కలవాఁడను గాక పోవుటచే వారి యుత్కృష్టతను వర్ణించుటకు ప్రయత్నింపను. మా తాతగారగు వీరేశలింగముగారు మిగుల ధర్మాత్ములనియు, భూదానాదులు చేసి కీర్తిబడసిన వారనియు చెప్పుటమాత్ర మిప్పటి కథాంశమునకు చాలియుండును.

నా వివాహము మొదలైన శుభకార్యములకు ముందెల్లను నా పెదతండ్రిగారు నా జన్మపత్రమును జ్యోతిష్కులకెల్ల జూపుచు, ముహూర్తములు పెట్టించుచు వచ్చినను, జ్యోతిశ్శాస్త్రములో నమ్మకము నాకు చిరకాలము క్రిందనే చెడినందున జన్మపత్రమును చూచుటకై నాకు నేనెన్నఁడు ప్రయత్నము చేయలేదు. ఆరంభములో జ్యోతిశ్శాస్త్రమునందత్యంత విశ్వాసము కలవాఁడనే యైనను, జన్మపత్రికలో దీర్ఘాయుష్మంతులని చెప్పబడిన వారనేకులల్పాయుష్కులగుచుండుటయు, మహాధనాఢ్యులని చెప్పబడినవారు దరిద్రులగుచుండుటయు, సంతానవంతులగుదురన్న వారు అనేకులు సంతాన హీనులగుచుండుటయు, చిరకాలము సుహాసినులగుదురన్న కాంతలు బాలవితంతువులగుచుండుటయు, సుముహూర్తములు పెట్టుకొని చేసిన కార్యములు పెక్కు భగ్నములగుచుండుటయు చూచుచు వచ్చిన కొలదిని నాకీ జ్యోతిష విషయమున అంతకంతకు నమ్మకము తగ్గి, లోకాను

భవ మధికమయిన తరువాత పూర్ణముగ నశించెను. జ్యోతిశ్శాస్త్ర విశ్వాసములేని పశ్చిమ ఖండవాసుల వివాహములకంటె, జ్యోతిశ్శాస్త్ర మర్యాద నతిక్రమింపక చేయబడు మన వివాహములే విషయమున నధిక సుఖప్రదములుగా నున్నవి ?

అస్మత్ప్రపితామహుని వరకు మా పూర్వులు లింగధారులయి, వీర శైవులయియుండిరి. నా ముత్తాత గారైన చంద్రమౌళిగారికి స్మార్తులలోని కన్య నిచ్చుట తటస్థమయినది. ఆ దంపతులకుదయించిన మత్పితామహులగు వీరేశలింగముగారు, వైష్ణవ మతాభిమానులైన మేనమామల ప్రోత్సాహము చేతనో, మరి యేహేతువుచేతనో లింగధారణము మాని, సంస్కారములకు దారి తీసిరి. వారి పేరిట వాడనగు నాకును బాల్యమునుండియు సంస్కార వాసన యించుక సోకినది.

మా తాతగారి జన్మభూమి ఏలూరు. అక్కడనే వారికి పూర్వార్జితము లయిన భూములును, గృహములును నుండెను. మా యింటి పేరునుబట్టి మా పూర్వులాదియందు నెల్లూరు మండలములోని కందుకూరు నివాసులయి నట్టును, మహమ్మదీయుల కాలములో ఉద్యోగ ధర్మమును బట్టి ఏలూరు నకు వచ్చినట్టును దెలియవచ్చుచున్నది.

ఆ కాలమున కాలువల యాధారము లేనందున మాన్యక్షేత్రములు వానలనుకూలముగా కురియని సంవత్సర మెండవలసినవిగా నుండెను. అందుచేత భూముల యాదాయమును నమ్ముకొనుట కవకాశములేక మా తాతగారు రాజాశ్రయమును బొంది, రాజమహేంద్రవరమునకు వచ్చి, విశేష ధనార్జము చేసి రాజభవనమున దగినంత మహా సౌధమును గట్టి, యచ్చటనే స్థిరనివాస మేర్పరచుకొనిరి.

మరణకాలము నందాయనకు జననియైన అక్కమ్మగారును, భార్య అయిన కామమ్మగారును, జ్యేష్ఠపుత్రుడు వేంకట రత్నము గారును, ద్వితీయ పుత్రుడు సుబ్బారాయుడుగారును నుండిరి. నేను ద్వితీయ పుత్రుని పుత్రుడను.

చిన్నతనములోనే మా తండ్రిగారికి మేనత్త కొమారితనిచ్చి వివాహము చేసిరి. మా తాతగారి చెల్లెలు స్త్రీ శిశువును గని కాలము చేసినందున, పున్నమ్మ యనెడు ఆ చిన్నదానిని ముత్తవయగు అక్కమ్మ

గారును, మేనమామయగు మా తాతగారును పెంచి పెద్దదానిని చేసి, మా తండ్రిగారికే యిచ్చి పెండ్లి చేసిరి. ఈ దంపతులే నా జననీ జనకులు.

ఆ కాలమునందు ఎల్లవారికి దయ్యముల యందలి విశ్వాసమత్యధికము. ఎవ్వరికే వ్యాధి వచ్చినను ముందుగా భూతవైద్యుని యింటికో, సోదె చెప్పువాని యింటికో పరుగెత్తుచుండిరి. మా తల్లి కిట్టి పిచ్చి నమ్మకమమితముయినందున, నామె తన్నేదో దయ్యమావహించి పీడించుచున్నదని భ్రాంతినొంది, శుష్కించి బాధపడుచుండెనట. మా తాతగారెందరెందరనో భూత వైద్యులను, మంత్ర శాస్త్రవేత్తలను రప్పించి చికిత్స చేయించినను, మారణ హోమము లెన్ని చేయించినను ఆమె కృశించుచునే యుండెను. ఇటువంటి దుర్బల యువతి గర్భమున జనించిన వాడనగుటచే శిశుదశలో సహితము నేను దుర్బలుడనుగానే యుంటినట. దేహ దౌర్బల్యమునకు తోడు పురిటిలోనే దగ్గొకటి పట్టుకొని యిప్పటివరకును నన్ను విడువక బాధించుచున్నది. ఇట్లుండగా ఆరు నెలల ప్రాయమప్పుడు నాకు స్ఫోటకము వచ్చినది. అప్పుడెల్ల వారును నా జీవితము దెస నిరాశ చేసికొనిరట. కన్నులు మూతపడగా నొకదినమెల్ల, కాలు చేయి సహితమాడింపక, నిర్జీవ ప్రతిమ వలె నుంటినట. ఇటువంటి పనికిమాలిన దుర్బలమానవుని చేత గూడ కొంత పని చేయింపవచ్చునని చూపుటకు కాబోలును పరమేశ్వరుడు నన్ను భూమిమీద నిలువ ననుగ్రహించెను.

నాకు నాలుగేండ్ల ప్రాయమప్పుడు మా తండ్రిగారు కాకినాడలో పరమపదించుట సంభవించినది. నాకు నా తండ్రిగారి కంటె పెద తండ్రిగారి వద్దనే చనువెక్కువ. అందుచేత నా కప్పుడు పితృవియోగ దుఃఖము మనసున నాటలేదు. మా తండ్రిగారి యుత్తర క్రియలయిన తరువాత మేమందరమును కాకినాడ విడచి రాజమహేంద్రవరము చేరితిమి.

అక్షరాభ్యాసమైన తరువాత నేను మొట్టమొదట మా యింటికిన్నూరు (200) గజముల దూరములో నున్న గోపాలస్వామి ఆలయములో నుండిన బడికి పంపబడితిని. ఈ బడిలో నేను అక్షరములును, గుణింతమును, ఎక్కములును నేర్చుకొని, పుస్తకమును పట్టియుంటిని. తదనంతరము మా యింటికి సమీపముననున్న సోమరాజుగారి బడికి మావారు నన్ను పంపిరి. ఈయన తెలుగునందు కొంత పాండిత్యముగలవాడయి, పిల్లల చేత పురాణముగూడ చదివించి యర్థము చెప్పుచు వచ్చెను. నాచేత అక్ష

సహితముగా బాలరామాయణమును, అమరనిఘంటువును చదివించిరి. అటు తరువాత వాచకమును, వ్రాతయుగాక, రుక్మిణీ కల్యాణమును, సుమతీ శతకమును, కృష్ణశతకమును, ఆంధ్ర నామ సంగ్రహమును రోకటి పాటుగా వల్లెవేయించిరి.

ఇంతటితో తెలుగు చదువు పూర్తియైనదని, మావారు నన్ను బడి మానిపించి, రాజకీయోద్యోగమునకు కావలిసిన పనిని నేర్చుకొనుటకై (apprenticeship) తాలూకా కచేరీలో నున్న మా బంధువులగు పోతరాజు రఘురామయ్యగారి వద్ద నన్నొప్పగించిరి. నేను ప్రతిదినము మా వీథి చివరనున్న తాలూకా కచేరీకి పోయి, ఆయన చెప్పిన పని చేయుచుంటిని. ఈ విధముగా సంవత్సరమో, రెండు సంవత్సరములో వ్యర్థమైనవి. ఆ కాలమున పరీక్షలు లేనందున దొరతనము వారి కొలువునపేక్షించువారు రాజకీయ కార్యస్థానములకు పోయి, పని నేర్చుకొనుచు, అధికారుల ననుసరించి తిరుగుచుండువారు. రాజ్య నిర్వహణ భారమును తూర్పిండియా సంఘము వారినుంచి తప్పించి శ్రీ మహారాజ్ఞిగారే (విక్టోరియా) స్వయముగా వహించిన తరువాత దేశ భాషలలోనూ, ఇంగ్లీషు భాషలోనూ సామాన్య పరీక్షలును, విశేష పరీక్షలును కొన్ని ఏర్పరుపబడినవి.

1860 వ సంవత్సరమున మావారు నన్ను దొరతనము వారి మండల పాఠశాలకు ఇంగ్లీషు నేర్చుకొనుటకయి పంపిరి. బ్రాహ్మణాచారాను సారముగ ఏడవ యేటనే నాకుపనయనము జరిగినది. అది మొదలుకొని త్రికాలముల యందును సంధ్యావందనము చేయుచు, గాయిత్రి నెంతో శ్రద్ధతో జపించుచుంటిని. అప్పుడప్పుడు సాయంకాలముల గోదావరికి బోయి అస్తమించు సూర్యున కర్ఘ్య ప్రదానముచేసి సంధ్యవార్చి, ప్రదోష కాలమున మార్కండేయస్వామి ఆలయమునకును, వేణుగోపాలస్వామి ఆలయమునకును బోయి వచ్చుచుందును. ఏకాదశినాటి రాత్రి ప్రొద్దు పోయినదాక మేలుకొనుటయే గాక, ఒక సంవత్సరము శివరాత్రినాడు జాగారము సహితము చేసితిని.

ఇంట రఘువంశములో నయిదు సర్గలు చదివియుండుట చేతను, పురాణముల యర్థము వినుచు వచ్చుట చేతను, కొంచెమర్థజ్ఞానము కల వాడనయి, మా యింటనున్న ప్రాత తాటాకుల పుస్తకములను తీసి

చదువ నారంభించితిని. ఋషులవలె తపస్సు చేసి మహిమలు సంపాదింప వలెనని పలుమారు నాకు బుద్ధి పుట్టుచుండును. నే నింగ్లీషు ఆరంభించుటకు ముందే నాకు ఛాందస వృత్తి బలియ నారంభించినది. నేను భక్తుడనగు చున్నాడనని నా తల్లి మొదలైనవారు నన్ను ప్రోత్సాహపరుచుచు వచ్చిరి.

ఆ కాలమునందు నాకు దేహబల మెంత తక్కువగా నుండెనో బుద్ధి బలమంత ఎక్కువగా నుండెనని చెప్పవచ్చును. నాకా పిన్న వయసున గల గ్రహణ ధారణాశక్తుల సాధారణమైనవి. అయినను వానివలన కొంతవరకు నష్టమే కలిగినదని చెప్పవచ్చును.

# 2. విద్యార్థి దశ

రెండవ అర్థ సంవత్సరమునందే నేను పాఠశాలలో ప్రవేశించినాను. సంవత్సరాంతమగునప్పటికి తోడి బాలురందరిని మించి మా తరగతిలో మొదటి బహుమానమును పొందితిని. అప్పటినుండి కడవరకును నేను పాఠశాలలో బహుమతి పొందని తరగతి లేదు. రెండవ తరగతిలో చదువు నప్పటికే నాకు తెలుగు పుస్తకముల యందభిలాష హెచ్చినది. పాఠశాలకు పోయిన కాలము తప్ప మిగిలిన కాలమంతయు మా యింటగల తాటాకు పుస్తకములనే చదువుచుండసాగితిని. నా తల్లియు, ముత్తవ తల్లియు నన్ను మందలించి, కార్యము గానక, మా యింటి సమీపముననే వాసము చేయు మా యుపాధ్యాయుని యొద్దకు బోయి, నేనింట ఇంగ్లీషు పుస్తకములే ముట్టలేదనియు, నన్ను దండింపవలయు ననియు వేడుకొనిరి. నేను నా తరగతిలో ప్రతి పాఠమునందు మొదటివాడనుగానో, రెండవ వాడను గానో యుందునని చెప్పి ఆయన వారిని పంపివేసెను.

ఏకసంథా, ద్విసంథా గ్రాహులకుండు బుద్ధి విశేషము కొంత కల వాడనగుట చేత, నేనింటి నుండి పాఠశాలకు బోవుచు దారిలో పాఠమును చూచినంత మాత్రముననే తప్పులు లేక అప్పగింప శక్తుడనగు చుంటిని. నా ప్రతిభా విశేషమే నాకశ్రద్ధను, సోమరితనమును నేర్పి కొంతవరకు నన్ను చెరిచినది. చదివిన చదువు దృఢముగా మనస్సునకు పట్టక కొన్ని దినము లకు మరల మొదటికి వచ్చుచుండువాడను. సోమరిగానుండు సూక్ష్మబుద్ధి కంటె, నిరంతరము పాటుపడుచు, అనలసుడుగా నుండు మంద బుద్ధియే లోకమునకును, తనకును మేలు చేయగల వాడగును.

ఈ కాలములో నాకు పురాణములు చదువు పిచ్చి ముదరజొచ్చెను. నే నెప్పుడు తపస్సునకు పూనుదునా, ఎప్పుడు మహిమలను పొందుదునా అని తహ తహ పడుచుందును. మూఢులయిన నా యీడు బాలురలో నేనేమో తెలిసిన వాడనయినట్టు పరిగణింపబడుచుంటిని. నా భ్రమలో పడినవారు నా సహపాఠులు నా కంటె వయసున పెద్దవారు. తపో మహిమ యొక్క ప్రాశస్త్యమును వారికి బోధించి, హిమవత్పర్వతము మీద

తపస్సు చేయునట్లు పథక మేర్పరచి, వారిని ముగ్గురిని ప్రయాణము చేసితిని. ప్రయాణమెప్పుడని వారే నన్ను త్వరపెట్ట మొదలుపెట్టిరి. దూరదేశ యాత్రకు సాహసము చేయలేక జాగుసేయ సాగితిని. ఒక నాటి సాయంకాలము వారిలో నిరువురు నా యొద్దకు వచ్చి, రేపే ప్రయాణమని చెప్పిరి. నేను రాజాలనంటిని. వారు నాతో మరల మాటాడక, ఉత్తరాభి ముఖులై వెడలిరి. సాయంకాలము వేళకు వారింటికి రాకపోగా బంధువులు వెదకనారంభించి, మూడవ అతనిని పిఠాపురము వద్ద పట్టుకొని ఇంటికి తెచ్చిరి. విజయనగరము వరకును పోయిన తరువాత రెండవ అతడు మొదటి యతనితో తగవులాడి, మురుగులమ్ముకొని ఇంటికి తిరిగి వచ్చెను. మొదటి యాతడు వెండి మొలత్రాడమ్ముకొని జగన్నాథము వరకు బోయి, యాత్ర చేసికొని మరలి వచ్చెను.

నా తల్లియు, పెదతండ్రిగారును కలిసి ఆలోచించి, మా పట్టణము నకు రెండు మైళ్ల దూరములో నున్న కాతేరు అను గ్రామమందున్న అద్దంకి వారి పడుచును నాకు వివాహము చేయుటకయి ఏర్పాటు చేసిరి. వరుడు వధువును, వధువు వరుని చూచి తమ యిష్టము వచ్చిన వారి నేర్పరచు కొను స్వయంవరణ భాగ్యము హిందూదేశములోని బ్రాహ్మణులకు స్వప్నా వస్థయందును లేదు. ఒకవేళ ముందేమైన కలుగవచ్చునేమో. మా వారెల్లరు ఆచారమునకు దాసులు. ఆచార పిశాచమావేశించినచో వారికి దయయు, ధర్మమును, సత్యమును, సత్కర్మమును, సర్వమును పరిత్యాజ్యములు.

పూర్వు లాదియందు అతి బాల్య వివాహమన్న పేరే ఎరిగియుండరు. అస్వాభావికమైన యీ అతి బాల్య వివాహపీడ ఆచార పిశాచావేశ బలముచే వచ్చినదే గాని విధి విహితమయినది కాదు. మా వారు వివాహ నిశ్చయము చేయునప్పటికి పండ్రెండేండ్ల వాడనైన నాకు వివాహోద్దేశమే తిన్నగా తెలియదు. నా కంటెను నాలుగేండ్లు చిన్నదయిన నా భార్యకు మొదలె తెలిసియుండదు. నాకు పదమూడవయేటను, నా సహధర్మచారిణికి తొమ్మిదవ యేటను బొమ్మల పెండ్లివలె మా వివాహ మహోత్సవము నడచినది. నా పెండ్లిలో మావారే వ్యయములను తగ్గించినను భోగము మేళమునకగు వ్యర్థ వ్యయమును మాత్రము మానినవారు కారు. వేశ్యలు లేకున్న వివాహమునకు శోభయే లేదట! గౌరవమునకు భంగము కలుగునట! నలుగురిలో తలవంపులట!

నా భార్యకు జననీ జనకులు పెట్టిన పేరు బాపమ్మ. అయినను వివాహమైన తరువాత మా తల్లి ఆ పేరు మార్చి రాజ్యలక్ష్మి అని తన తల్లి పేరు పెట్టినది.

నా పెండ్లి అయిన తరువాత నా పెదతండ్రిగారి భార్యకును, నా తల్లికిని తగవులాట లారంభమయినవి. ఇద్దరాడువారు ఒకచోట చేరినచో శుష్క కలహములు పొడచూపక మానవు. ఇప్పటి మన దేశములో కనబడుచున్న కలహ ప్రియత్వమునకు ప్రధాన కారణము స్వప్రయోజన పరత్వము చేత దూరాలోచన మట్టుబడిన వారు తమ రమణీమణులను విద్యాగంధ విహీనురాండ్రనుగా చేయుటవలన వారి నాశ్రయించియున్న మౌఢ్యభూతావేశ దోషమేగాని, సహజ కోమలమైన స్త్రీ స్వభావము కాదు.

ఈ గృహ విచ్ఛిద్రములకు నా తల్లిదే ఎక్కువ తప్పిదమని చెప్పవచ్చును. శాంత స్వభావము లేనిదయి, మత్సరమే ప్రధానముగా, నా తల్లి, ఇతరులు తన్నొక మాట అన్నతోడనే తాను పది మాటలని కలహము బెంచుచు స్వతంత్ర ప్రకృతిని చూపునదిగా నుండెను. అయినను దయార్ద్ర హృదయమును, పరోపకార చింతయు, సత్యశీలతయు, ధైర్యశాలిత్వమును, ఆమెకలంకారములుగా నుండెను. ఆమె గుణములలో కొన్ని నాకును పట్టుబడినవి. ప్రకృతిచేత నేనును కోపస్వభావుడనే. ఒరులు చెడుపని చేసినప్పుడు నాకు కోపమాగదు. నే నప్పుడు పరుష భాషణములు సహితము పలుకుదును. నేనెన్నియో సార్లు మానవలెనని ప్రయత్నించినను నన్నీ యవగుణము నేటికిని విడిచి పెట్టకున్నది.

కుటుంబ కలహమును మాన్పి నెమ్మదిని కలిగించుటకు చరాస్థిర రూపమైన ద్రవ్యమును విభజించి నన్ను వేరు పెట్టుటకంటె ఉపాయాంతర మేదియు ఆయనకు (నా పెద తండ్రికి) గోచరము కాలేదు. ఆయన 1862 ఆగష్టు నెలలో నా భార్య మేనమామను, మరియొక బంధువును మాత్రము పిలిపించి, భాగముల పట్టికను వ్రాసి నా సగపాలు నా కిచ్చివేసెను. నా పాలికి వచ్చిన గృహములోనే నా జనని నాకు వేరుగ వంట చేసి పెట్టనారంభించెను. నా పెదతండ్రిగారు మాకు సర్వ విధముల సాయము చేయుచునే యుండిరి. కన్న ప్రేమకంటె పెంచిన ప్రేమ ఎక్కువ గదా! రెంటి కుటుంబ కలహములంతరించి, మనశ్శాంతియు, నైసర్గిక ప్రేమాను బంధ దృఢత్వమును మరల వర్ధిల్లజొచ్చినవి. అవిభక్త

కుటుంబములలో అంతఃకలహము లుద్భవిల్లి, సుఖభంగము కలిగినప్పుడు, కుటుంబ స్నేహమును మరల నెలకొల్పుటకు వేరు పఠనయే ఉత్తమ సాధనము.

ఈ కాలమునందు నేను చేసిన అకార్య మొకటి కలదు. అది నా మనస్సు నెంతో కాలము బాధించుచుండెను. ఆంధ్ర కావ్యములలో వసు చరిత్రము ఉత్తమమైనదని పలువురు చెప్పుచువచ్చిరి. మా యింట నున్న తాటాకు పుస్తకములలో అది కానరాలేదు. ఏమి చేయుటకును తోచని వాడనయి, ఒకనాడు సాహసము చేసి, వసుచరిత్రము కొనిపెట్టుమని నా తల్లిని దీనముగా వేడితిని. అది నా పాఠ్య పుస్తకము కాదని యెరిగి ఆమె నా కోరికను నిరాకరించెను. అంతటితో నిరాశ చెందక, ఎలాగున నైనాను వసుచరిత్రము కొనవలెనని నిశ్చయించుకొంటిని. ఆ పుస్తకము వెల నాలుగు రూపాయల ఎనిమిదణాలు. నా చేత ఎనిమిదణాల కంటె ఎక్కువగా లేవు. నా యొద్ద నున్న ఎనిమిదణాలును పుస్తక విక్రేత చేత పెట్టి, ప్రతి మాసమును ఎనిమిదణాలిచ్చు పద్ధతి మీద పుస్తకమును చదువ వలెనని నా కొక దురాలోచన తోచినది. నెల నెలకు ఎనిమిదణాల చొప్పున ఇచ్చుటకు సహితము నా కప్పుడు శక్తిలేదు. కాబట్టి ప్రతిదినమును భోజనముచేసి పాఠశాలకు పోవుచున్నట్టు నటించుచు, ఎక్కడనో కూరు చుండి సాయంకాలమింటికి వచ్చుటకును, పాఠశాల జీతము నిమిత్త మిచ్చెడి ఎనిమిదణాలు పుస్తకము నిమిత్తము వ్యయ పెట్టుటకును నిశ్చయించితిని. పుస్తక పఠనాభిలాష నన్ను అవివేకిని చేయగా, నేను వెంటనే పుస్తక విక్రేత కడకేగి నా వాంఛను తెలిపితిని. నా అతి లాలసత్వమును కనికరించి, పుస్తకము వెల తీరువరకును తన విక్రయశాలలోనే నేను కూరుచుండి దానిని చదువుకొనుచుండునట్లు ఆయాపణకుడు (పుస్తక విక్రేత) అంగీక రించెను. వంచనము చిరకాలము దాగి యుండదు. నేను పాఠశాలకు పోకుండుట రెండవ నెలలోనే నా తల్లికి తెలిసినది. అప్పుడామె నన్ను మందలించి, అడిగిన తోడనే సత్యము చెప్పినందుకును, జీతమును కొని పోయి మధురాహారములకు గాక పుస్తకమునకు వ్యయ పెట్టినందుకును కొంత సంతోషించి, మిగత సొమ్మిచ్చి, నన్ను మరల పాఠశాలకంపెను.

ఈ పని జరిగిన కొద్ది కాలమునకే నాకు వ్యాధి ఆరంభమయినది. వ్యాధి అంతకంతకు వృద్ధినొంద సాగినది. శైశవమునుండి ఉండిన దగ్గు

నకు తోడుగా అజీర్ణ అతిసార రోగములు నన్నాశ్రయించినవి. ఇంగ్లీషు వైద్యులును, తెలుగు వైద్యులును బహు మాసములు నాకనేక ఔషధము లిచ్చిరి గాని, రోగ మించుకయు నివారణ కాలేదు. రక్త మాంసములు హరించిపోయి శల్యావశిష్టుడనైతిని. ఒకరి తరువాత నొకరుగా వైద్యు లందరు నన్ను చేయివిడిచిరి. ఈ ప్రకారముగా 1863 సంవత్సరాంతము నుండి 1864 సంవత్సరాంతమువరకు నేను మరణ జీవితముల మధ్య నూగులాడుచుంటిని. ఘనవైద్యులు నన్ను విడిచిపెట్టిన తరువాత, ఒక వైద్య శిఖామణి నాకు కూరగాయ వైద్యము చేయుచు వచ్చెను. తుద కాయన వైద్యము చేతనే స్వాస్థ్యము కలిగినది.

1865 వేసవికాలపు సెలవులైన తరువాత పాఠశాల యందాపరకు విడిచిపెట్టిన మూడవ తరగతిలోనే నేను మరల ప్రవేశించితిని. ఆరు మాసములే ఆ తరగతిలో చదివినను సంవత్సరాంతమందు జరిగిన పరీక్షలో నేనే మొదటివాడనైతిని. అందుచేత పయి సంవత్సరమంతయు నాకు జీతము లేకుండ విద్య చెప్పునట్లేర్పాటు చేసిరి. ఆ సంవత్సరము మొదలు కొని పాఠశాలలో చదువుకొన్నంత కాలమును నేను చదువు నిమిత్తము జీతమియ్యవలసిన యావశ్యకమే లేకపోయెను.

నేను నాల్గవ తరగతిలో చదువుచున్న కాలములో ఒకనాడు మధ్యాహ్న కాలమున మా మండల న్యాయాధిపతియైన హెన్రీ మారీసు దొరగారు పాఠశాలను చూచుటకయి వచ్చి, పాఠశాలలోని బాలురలోనెల్ల సత్ప్రవర్తనము గలవారి పేరు వ్రాయవలసినదని విద్యార్థుల కందరికిని కాగితపు ముక్కల నిప్పించిరి. ఇతరులతో నాలోచించుటకు వారి కప్పు డవకాశము లేదు. అందుచేత బాలురందరును ఎవరికితోచిన పేరులు వారు వ్రాసియియ్యగా, ఆ కాగితపు ముక్కలన్నిటిని చదివినప్పుడు అధిక సంఖ్య గల బాలురు నా పేరు వ్రాసినట్లేర్పడెను. సద్వర్తనము కొరకై ఒక బహుమానము నియ్యదలచుకొని దొరగారిట్లు పేరులు వ్రాయించిరి. ఆ బహుమానము నాకే వచ్చినదని చెప్పనక్కర యుండదు. ఆ దొరగారు ఐదు రూపాయల పుస్తకములు నన్ను కోరుకోమన్నప్పుడు, పై తరగతికి కావలసిన పుస్తకములను, నిఘంటువు నొకదానిని కోరుకొంటిని. ఆ నిఘంటువు పై దొరగారు స్వహస్తముతో వ్రాసిన వ్రాతను చూచుకొన్నప్పు డెల్లను నాకు సంతోషము కలుగుచుండును. నాకు బహుమానములుగా

వచ్చిన యితర పుస్తకములన్నియు పోగొట్టుకొన్నను సద్వర్తనము నిమిత్త మయి బహుమానముగా నియ్యబడిన ఆ నిఘంటువు నిప్పటికి పదిలముగా భద్రపరచియున్నాను.

విద్యార్థులు నాయందిట్లు సదభిప్రాయము గలవారై యుండినను, ఆ కాలమునందు నే నసత్యము నెన్నడు పలుకలేదని చెప్పజాలను. అప్పుడు నేనాడిన ఒక యసత్యమును గూర్చి వ్రాయక విడుచుట న్యాయము కాదు.

ఆ కాలమునందు ఇరువది రూపాయలకు మించిన దొరతనమువారి ఉద్యోగమున కర్హులుగ చేసెడిది సామాన్య పరీక్ష ఒకటి యుండెను. అది ఇంగ్లీషును, తెలుగును, రెండు వేరు వేరు శాఖలుగ నుండెను. ఈ పరీక్ష యందుగాని, సర్వకళాశాల ప్రవేశ పరీక్షయందు గాని కృతార్థులైనగాని ఎవ్వరును విశేష పరీక్షలకు పోగూడదు. సామాన్య పరీక్షా ప్రశ్న పత్రములను చూచినప్పుడవి సులభములుగా కనబడినందున నాకా పరీక్షకు పోవలెనని యత్యంత కుతూహలము గలిగెను. పదునెనిమిది సంవత్సర ములు దాటిన వారుగాని ఆ పరీక్షకు పోగూడదు. నా కప్పటికి పదునెనిమిది నిండలేదు. అయినను శీఘ్రముగా పరీక్షాసిద్ధుడను కావలెనన్న బాల్య చాపల్యము చేత నా వయస్సు పందొమ్మిది సంవత్సరములని కాబోలు ప్రార్థనా పత్రమున (Application) వ్రాసి పంపితిని. ఆ సంవత్సరమే నేను ఉభయభాషలలోనూ పరీక్షాసిద్ధుడనయి, ఉత్తర సర్కారులలో రెండవ వాడనై నిలచితిని. ఆ కాలమునందు బుద్ధిపూర్వకముగా నాడిన యసత్య మిది యొక్కటియే అని నా నమ్మకము.

నాల్గవ తరగతిలోను సంవత్సరాంత పరీక్షయందు నే నే మొదటి వాడనయితిని. పరమ సంఖ్య (maximum marks) 480 లో నాకు వచ్చినది 420. అప్పటి పాఠశాలా పరీక్షకులైన బవర్సు దొరగారు నా తెలివి కద్భుత పడి, నన్ను ప్రత్యేకముగా తమ గదిలోనికి పిలిపించి చేరువను కూర్చుండ బెట్టుకొని, ప్రవేశ పరీక్షయం దేరిన తరువాత చెన్నపురికిపోయి, పట్ట పరీక్ష వరకును చదువవలసినదని హితబోధ చేసిరి.

1867 సం. నందు అయిదవ తరగతిలో, అనగా ప్రవేశ పరీక్ష తరగతి యందు, నాకు చదువు సాగలేదు. మా పెదతండ్రిగారు రోగపడి, కొన్ని మాసములు వ్యాధి బాధితులయి యుండి, లోకాంతరగతులయిరి. ఆయవ వ్యాధి వలన కలిగిన మనోవ్యాధి చేతను నేను పాఠశాలకు సరిగా

పోవుటయు, పాఠములు చదువుటయు తటస్థింపలేదు. పాఠశాల విడిచి పనిలో ప్రవేశింపుమని మా బంధువులనేకులు నన్ను ప్రేరేపించి, నా తల్లి చేతను చెప్పించిరి. నాకు చదువు మానుటయందెంతమాత్రము ఇష్టములేక పోయినను, నా తల్లి యొక్కయు, బంధువుల యొక్కయు ప్రేరణమువలన పనిలో ప్రవేశించుట కొడబడి, మండల న్యాయాధిపతి యగు మారీసు దొర గారిని పని నిమిత్తమయి పోయి చూచితిని. సామాన్య పరీక్షయం దేరియున్న వాడనగుటచేత రాజకీయోద్యోగమునకు యోగ్యుడనయియే యుంటిని. మారీసు దొరగారు నాకు బహుమానమిచ్చినప్పటి నుండియు నా విద్యా క్షేమములను గూర్చి అడిగి నన్నాదరించుచుండెడివారు. నేను పోయి దర్శనము చేసినప్పుడు దొరగారు నా పెదతండ్రి మృతికి విచారించి, నన్నూరడించి, ఆ ఏర్పాటులో కడపటిదానిని నాకిచ్చెదనని వాగ్దానము చేసిరి. అప్పుడు మండల న్యాయ సభలో సిరాస్తాదారుగా నుండిన నారాయణప్పగారు మా శాఖవాడును, మా కుటుంబమునకు పరమాప్తుడును నయి యుండెను. ఇట్లుండ, రెండు, మూడు దినములకాపని పరీక్షాసిద్ధుడు కాని మరియొకని కియ్యబడినట్లు తెలిసినది. ఇది ఎట్లయ్యెనని విచారించగా, సిరస్తాదారుగారు నూరు రూపాయలు పారితోషికము స్వీకరించి ఆ పని అతనికి వేయించినట్లు తెలియవచ్చినది. రూపాయల గాలిసోకినప్పుడు వాని ముందర బంధుత్వమును, మిత్రత్వమును, సమస్తమును నెగిరిపోవలసినదే గదా!

ఆ పని నాకు కాకుండుట ఈశ్వరుడు నా మంచికే చేసెననవచ్చును. ఆ పనిలోనే యుండుట తటస్థించెనేని, శ్లేష్మములో పడిన యీగవలె రేయిం బవళ్లు బంధపనిలో మునిగి కొట్టుకొనుచు, నేనెట్టి దురవస్థలో పడి యుందునో!

అట్లాశాభంగము కలుగుటవలన పొడమి, ముందెప్పుడును న్యాయ సభలో లేఖకోద్యోగమునందు ప్రవేశింపకుండునట్లు శపథముచేసికొని, మరల పాఠశాలకు పోవనారంభించితిని. ఇట్లుండగా మరియొక విచిత్రకథ సంభవించి నా విద్యకు వేరు విఘ్నము నాపాదించెను.

అప్పుడు ప్రధానోపాధ్యాయుడైన వైయాపురి మొదల్యారిగా రింగ్లీషు భాషయందు విశేష సాహిత్యములేని వారగుటచేత పరీక్షకు నిర్ణీతమైన ఇంగ్లీషు పద్యకావ్యమును చక్కగా బోధించుటకు సమర్థులుగాక యుండిరి.

అందుచేత విద్యార్థుల లాభము నిమిత్తమాయనను అక్కడనుంచి పంపివేసి, సమర్థుడైన మరి యొకరిని ఆయన స్థానమునకు రప్పించుట కర్తవ్యమని నాకు నిశ్చితాభిప్రాయము కలిగినది. నా సహపాఠులైన ఇతర బాలురు నాతో నేకీభవించిరి. తోడనే విద్యావిచారణాధికారిగారికి పంపు నిమిత్త మింగ్లీషులో నొక సంఘ విజ్ఞాపనము వ్రాసి, దానిపైని మా తరగతిలోని వారిచేత వ్రాళ్లు చేయించి, తక్కిన తరగతిలోని వారిచేత వ్రాళ్లు వ్రాయించు టకై నా బాల్య సఖుడును, మా క్రింది తరగతిలో చదువుకొనుచున్న వాడును అయిన కనపర్తి లక్ష్మయ్య గారి చేతికిచ్చి ఒక భానువారమునాడు పంపితిని.

ఏలాగుననో ఈ విజ్ఞాపన పత్ర వార్త మా ప్రధానోపాధ్యాయునికి తెలిసి, దానిని తెచ్చి తనకిమ్మని మా తరగతిలోనే చదువుచుండిన మొండ్రేటి రామచంద్రుడను నాతనిని ప్రేరేచి ఒడబరిచెను. అతడు తామందు వ్రాలు చేసి తెచ్చునట్లు నటించి, విజ్ఞాపన పత్రమును తన ఇంటిలోనికి తీసికొనిపోయి, దొడ్డివారిన తిన్నగా నడచి దానిని మా ప్రధానోపాధ్యాయున కిచ్చెను.

ఆ మరునాడు ప్రధానోపాధ్యాయుడు నాల్గవ తరగతిలోనికి పోయి నా మిత్రుని గొడ్డును బాదినట్టు బాదెను. అది చూచి నా మనసునకు సహించ రాని నిర్వేదము కలిగెను. అప్పుడు నా మనస్సెట్లు పరితపించెనో వివరించు టకు భాష చాలదు. ప్రధానోపాధ్యాయుడట్లు నా మిత్రుని కొట్టి, మా తరగతి లోనికి వచ్చి, కోప మాపుకొనలేక నన్ను, "బుద్ధిహీనుడా!" అని తిట్టెను. చివాలున లేచి నే తరగతిని విడిచి అవలికి పోయితిని. నా వెంబడి నే నా తరగతిలోని బాలురందరును వెలుపలికి వచ్చి, నాతో కలసి ఇండ్లకు పోయిరి.

న్యాయ విషయమున నాకాగ్రహము కలిగినప్పుడు నా యుద్రేకము నకును, పట్టుదలకును పరిమితి యుండదు. అప్పుడు నేను గురువనియు, బంధువనియు, స్నేహితుడనియు, బలయుతుడనియు చూడక, పూనిన కార్యమునందు దీక్షవహించి కడవరకును పనిచేయుదును. ఆ ప్రధానోపా ధ్యాయుని పంపివేయువరకును పని చేయవలయునని నిశ్చయించుకొంటిని. మా పాఠశాలలోని సహోపాధ్యాయులు కొందరు మమ్ము ప్రోత్సాహ పరచిరి. మేము కట్టుకట్టి, మరునాటి నుండియు పాఠశాలకు పోవమానితిమి.

ప్రధానోపాధ్యాయుడు మరల బాలురను పాఠశాలకు రప్పించుటకు బహు ప్రయత్నములు చేసెను. చేసిన ప్రయత్నములన్నియు భగ్నములయ్యెను.

మేము మరునాడే సంఘ విజ్ఞాపన పత్రములను మరల సిద్ధముచేసి, వానిమీద అధిక సంఖ్యాకులచేత వ్రాళ్లు చేయించి, ఒక ప్రతిని విద్యా విచారణకర్తకు చెన్నపురికిని, ఇంకొక ప్రతిని పాఠశాల పరీక్షకునకు విశాఖపట్టణమునకును పంపితిమి. ఆ దినముననే విద్యా విచారణ కర్తయగు కర్నల్ వార్డానల్డు దొరగారికిని, పాఠశాలా పరీక్షకులగు గ్రిగ్గు దొరగారికిని తంత్రీ వార్తలను పంపితిమి. గ్రిగ్గుదొరగారు కొన్ని దినములలో రాజమహేంద్రవరమునకు వచ్చి, మమ్మందరను పిలిపించి విచారణచేసి, వైయాపురి మొదల్యారి గారిని వేరొక చోటికి పంపి వేయవలసినదని పయికి వ్రాసిరి. విద్యా విచారణాధికారి వైయాపురి మొదల్యారిగారిని నరసాపురమునకు పంపి, చెంగల్వ కుప్పుస్వామి శాస్త్రుల వారిని రాజమహేంద్రవర మండల పాఠశాలకు ప్రధానోపాధ్యాయునిగా బంపిరి. అటు తరువాత మేమందరమును మరల పాఠశాలకు పోయి చేరితిమి.

ఈ కాలముననే నేను కవిత్వము చెప్పుట కారంభించితిని. అప్పటి వరకు విగ్రహారాధకుడనైయే యుంటిని. ఉపవాసములును, వ్రతములును భగవత్ప్రీతి కరములనియే నమ్మకముండెను. కవిత్వము చెప్పుట కారంభింపగానే మొట్టమొదట వేణుగోపాల స్వామి మీద నొకటియు, మార్కండేయ స్వామి మీద నొకటియు రెండు కంద పద్య శతకములు చెప్పితిని. ఈ శతకములు బాగుగలేవని ఒక మూల పారవేయుటచేత నశించిపోయినవి.

నే నప్పుడు వేదాంతమునం దెక్కువ అభిరుచిగల వాడను. మంత్ర ప్రభావము నందును పరమ విశ్వాసము గలవాడనై, వేలకొలది గాయిత్రీ జపము చేయుటయే గాక, ఆంజనేయ మంత్రమును, రామ మంత్రమును ఉపదేశము పొంది, బహు వారములు పునశ్చరణ చేసితిని. మంత్ర మహిమ వలన దయ్యములు పోవునని నమ్మి, వాటిని ప్రత్యక్షముగ చూడవలెనన్న అభిలాషతో దయ్యములు పట్టిన వన్నవారి ఇండ్లనెల్లకు పోవుచు, భూత వైద్యులు చేయు మంత్ర తంత్రములనెల్ల చూచుచు, మంత్రవేత్తల నాశ్రయించు చుండెడివాడను, ఒక భూతమునైన చూపుడని భూత వైద్యుల నెందరిని వేడినను, నా కొక్కరును చూపినవారు కారు.

ఒక భూత వైద్యుడు మాత్రము నాకు దయ్యమును చూపెదనని

చెప్పి, ఒక రాత్రి నన్ను తోడి వెలుపలి కొక మర్రిచెట్టు వద్దకు కొనిపోయి "చూసినచో నీవు జడిసికొందువు," అని తప్పించుకొనఁ జూచెను. "నేను జడిసికోను. నాయందనుగ్రహించి తప్పక చూపుము," అని వేడితిని. "నీవు భయపడక పోయినను, ప్రభుత్వము వారివలన నాకు చిక్కు వచ్చును" అని చెప్పి నాకాశాభంగము కలిగించి అతడు వెడలిపోయెను.

దయ్యములు శ్మశానవాటికల యందర్ధరాత్రమున సంచారము చేయు నని ఎల్లవారును చెప్పుటచే, వానిని చూడవలెనన్న యుత్కంఠతో అనేక పర్యాయములు నిశా సమయమున ఎవ్వరితోను చెప్పక శ్మశానమున కొంటిగాపోయి, పిశాచభయ మెంతమాత్రమును లేక విఫల మనోరధుడనై తిరిగి వచ్చుచుండు వాడను.

ఈ కాలమునందే నా పూర్వ విశ్వాసములు కొన్ని మారుట కారం భించెను. ఎవరి యొద్దనుండియో కేశవ చంద్ర సేనుల వారి ఉపన్యాసములు కొన్ని పుచ్చుకొని చదివితిని. ఆ యుపన్యాసములు చదువుట వలననే నావరకు సత్యములని నమ్మిన కొన్ని విషయములను గూర్చి సందేహము కలిగెను. ఆ సమయమునందు ఆత్మూరి లక్ష్మీనరసింహముగారు బందరు (మచిలీపట్టణం) నుండి మా పాఠశాలకు ద్వితీయోపాధ్యాయులుగా వచ్చిరి. వారు బ్రహ్మసమాజ మతసిద్ధాంతము లప్పుడప్పుడు బోధించుచుండెడివారు. ఆయన ప్రోత్సాహము వలన ఉపయుక్తములగు విషయములు చర్చించుట కయి విద్యార్థులలో నొక సమాజము నేర్పరచుకొంటిమి. మేమయి దారుగురము లక్ష్మీనరసింహము గారి యింటి వద్దగాని మా యింటి వద్దగాని సమావేశ మగుచుంటిమి. ఆ కాలమునందు నలుగురొకచోట కూడి సభ చేయుటయే తప్పిదముగా నుండెను. మేము వీథిలో పోవునప్పుడు మమ్ము వేలితో చూపి, "మీటింగు వాళ్లు వీళ్లేనరో" అని మూఢులు చెప్పుకొనుచు వచ్చిరి.

ఆ యేడును సంవత్సరాంత పరీక్షలో నాకు బహుమానము వచ్చెను. నేనా సంవత్సరము సర్వకళాశాలా ప్రవేశ పరీక్షకు పోయితిని గాని కృతార్థుడను కాలేదు.

1869 వ సంవత్సరమునందు నన్ను మరల రోగ మాశ్రయింప, దగ్గును, దౌర్బల్యమును హెచ్చయ్యెను. నేనప్పుడు మంచమెక్కలేదు గాని, ఇంటనే యుండుచు, దేహము కొంచెము స్వస్థపడినప్పుడు పద్యములు

చెప్పుచు నుంటిని. చిన్నప్పటినుండియు నా యూహ లెప్పుడును శక్యాశక్య విచారము లేక ఉన్నత పదమునకయి పారుచుండెడివి. కావ్యములను చదువునపుడు మహాకవినయి ఉత్తమ కావ్యములను రచింపవలెనని కోరు చుంటిని. అచ్చతెనుగు కావ్యముల నొకరిద్దరే రచించిరని, నిరోష్ఠ్య కావ్యము నొక్క కవియే రచించెనని, నిర్వచన కావ్యము నొక్క కవియే రచించెనని తెలిసికొంటిని. ఈ మూడు లక్షణములు నొక్కకావ్యమునందే మార్చి అసాధ్యమైన క్రొత్త త్రోవను త్రొక్కవలెనని నాకు సంకల్పము జనియించెను. సాధారణముగా నాకు సంకల్పము ఉదయించుటకును కార్యారంభమున కుద్యమించుటకును చిరకాల మంతరముండదు. లోకాను భవ శూన్యుడను, పాండిత్య విరహితుడను నగు నేనెక్కడ, మహా కావ్య రచన ఎక్కడని శంకింపక, సాహసముచేసి, 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధ' మనుపేర నల చరిత్రమును చేయబూని, నాపూనిన ప్రతిజ్ఞ నెట్లో నిర్వహించి కృతకృత్యుడను కాగలిగితిని. ఈ కాలమునందే "రసిక మనోరంజనము" అని మిశ్ర ప్రబంధమును గూడ చేయ నారంభించితిని.

ఆ కాలమున చిత్రపు కామరాజుగారు మండల న్యాయ సభలో, దొర తనము వారి న్యాయవాది. ఆయన ఇంగ్లీషు రానివారగుటచేత, మండల కరగ్రాహితోను, తదితర గూణాధి కారులతోను, ఇంగ్లీషున ఉత్తర ప్రత్యుత్తరములు వ్రాయుటకు, నెల కిరువది రూపాయలు జీతమిచ్చెద ననియు, ప్రాతఃకాలమున మూడు గంటలు తన ఇంటివద్ద పనిచేయ వలసినదనియు నన్ను కోరెను. ఆయన వేశ్య నుంచుకొనుట గౌరవాపహ మని భావించెడు పూర్వ నాగరిక కోటిలోనివాడు. నేను వేశ్యా విషయమున భిన్నాభిప్రాయము చెందిన నవనాగరిక బృందములోని వాడను. నేనాయన యింట పనిచేయుచున్న కాలములో ఆయన ఉంచుకొన్న వేశ్య వచ్చి సరసన కూర్చుండి ఆయనతో సరస సల్లాపము లాడుచు వచ్చెను. అది సరిపడక, మొదటి నెల జీతము పుచ్చుకోగానే నే పని మానివేసితిని.

అటు తరువాత, రాజమహేంద్రవర మండల పాఠశాలకు ప్రధానో పాధ్యాయులైన బారో దొరగారివద్దను, కారాగృహముల పై అధికారి అయిన

కెప్టెన్ హాల్లెట్టు దొరగారి వద్దను తెలుగు చెప్పుటకు కుదిరితిని. వారిరువురి వలన నాకు 35 రూపాయలు వచ్చెడివి.

1869 సం॥ న నేను పరీక్షకు పోలేదు. 1870 సం. నందు బారో దొరవారు ప్రకటించుచుండిన Godavari Educationist అను మాస పత్రికను నేను తెనుగున వ్రాయుచుంటిని. నేను పాఠశాలలో చదువకయే 1870 న సర్వ కళాశాలా ప్రవేశ పరీక్షకు పోయి కృతార్థుడనయితిని.

# 3. 1870 మొదలు 1880 వరకు

ప్రవేశ పరీక్ష యందు కృతార్థుడనైన కొన్ని నెలలలోనే 1871 ఏప్రిల్‌లో కాబోలును నేను రాజమహేంద్రవరము నందలి దొరతనమువారి మండల పాఠశాలలో నెలకు 25 రూపాయల జీతము మీద సహోపాధ్యాయుడనుగా నియమింపబడితిని. అల్పకాలికమైన ఆ పనిలోనున్న కాలములో నేను కొన్ని తరగతులకు ఇంగ్లీషు, లెక్కలు, హిందూదేశ చరిత్రమును చెప్పుచుండెడివాడను. ఆ కాలమునందు సహితము నాయడల బాలురకు భయభక్తులును, సహోపాధ్యాయులకు గౌరవమునుండెను. ఏలూరి లక్ష్మీనరసింహముగారు, దరిసేటి శేషగిరిరావు పంతులుగారు, వేపా కృష్ణమూర్తి పంతులుగారు మొదలైనవారు నాలుగవ తరగతిలో నావద్ద చదువుకొనుచుండెడివారు. కృష్ణమూర్తిగారి అన్నగారైన వేపా రామమూర్తి పంతులుగారాకాలములో మా పాఠశాలలో ద్వితీయోపాధ్యాయులుగా నుండిరి. ఒకనాడు కృష్ణమూర్తి పంతులుగారు కొంచెమవిధేయతను గనుపరపగా తక్షణమే ఆయనను బల్లపై నిలువబెట్టితిని. నాలుగైదు నిమిషములైన తరువాత నాతోడి యుపాధ్యాయుడొకడు వచ్చి, రహస్యమని చెప్పి, నన్నావలికి గొనిపోయి, "ఆ చిన్నవాడు రామమూర్తి పంతులుగారి తమ్ముడు," అని చెప్పెను. "అవును, నే నెరుగుదును" అని చెప్పి, నా తరగతిలోనికి వచ్చితిని. సాయంకాల మైదు గంటలకు పాఠశాల విడిచి పెట్టగానే రామమూర్తి పంతులుగారు నా యొద్దకు వచ్చి, మోమాట పడక స్వకృత్యమును నిర్వహించినందులకు నన్నభినందించి, తమ కృతజ్ఞతను తెలిపిరి. కృష్ణమూర్తి పంతులుగారును నా పైన ఆదరమునే కలిగియుండిరనుటకు 1876 సం. న చెన్నపురి ప్రెసిడెన్సీ కాలేజీలో చదువు కొనుచు, తమంత వ్రాసిన లేఖలో, "నా జీవిత కాలములో మిమ్మెప్పుడు గౌరవింపకుండ జాలను" అను అర్థము వచ్చునట్లు వ్రాసిరి.

సేవక వృత్తి లేక స్వతంత్రుడనుగా నుండవచ్చునన్న యాశతో నాకు న్యాయవాదియై పనిచేయవలెనని కోరిక యుండెడిది. మండల పాఠశాలలో నా సహోపాధ్యాయుడును, బాల్యములో నా సహాధ్యాయియు, మా

బంధువును అగు చల్లపల్లి బాపయ్య పంతులుగారు నాకు పరమమిత్రుడుగా నుండెను. ఉపాధ్యాయులముగా నున్న కాలములోనే మే మిరువురము కలిసి చదువనారంభించి, 1871 శ్రావణ మాసములో క్రిమినల్ హైయర్ గ్రేడ్ పరీక్షకు పోయితిమి. మేము లబ్ధవిజయులమైనట్టు 1872 సం. న రాజకీయ వ్యవహార పత్రికయందు ప్రకటింపబడినది.

ఈ కాలమునకు నాకు భూతావేశమునందు, జ్యోతిశ్శాస్త్రములోని ముహూర్త, జాతకములందు, శకునములు మొదలైనవాని యందును విశ్వాసము పూర్ణముగా చెడినది. నా అవిశ్వాసమును లోకమునకు చూపుటకు అవకాశము శీఘ్రముగానే కలిగినది. మా దొడ్డిలో నున్న అరటి చెట్టొకటి, కొననుండి వేయక చెట్టు మధ్యనుండి చీల్చుకొని పువ్వు పైకి వచ్చి, గెలవేసినది. అది అరిష్ట సూచక మనియు, వెంటనే చెట్టు కొట్టి వేయవలసినదనియు ఇరుగు పొరుగుల వారు, బంధువులు బహు విధముల చెప్పిరి. వారి మాటలు చెవిని బెట్టక ఆ చెట్టట్టే యుంచితిని. కాయలెదిగి కూరకు అక్కరకు వచ్చిన తరువాత కాయలు కోసి, దూట నిమిత్తము చెట్టు కొట్టివేయించితిని. ఆ సమయమునందే మా యింటి దూలము తొత్రలో తేనె పట్టు పట్టెను. అట్లు పట్టుట అశుభ సూచకమనియు, దానిని తీసి వేయించి దోష పరిహారార్థము బ్రాహ్మణులచేత శాంతి కర్మ చేయింప వలెననియు ఎల్లవారును చెప్పి, కార్యము లేదని యూరకుండిరి.

1872 జ్యేష్ఠ మాసములో కోరంగియను గ్రామమందు గల ఇంగ్లీషు పాఠశాలలో నెలకు 30 రూపాయల జీతముగల ప్రధానోపాధ్యాయత్వము లభించినది. మంచి దినము చూసి పొమ్మని యితరులును, మా వారును నన్ను బలాత్కారము చేసిరి. వారిని లక్ష్యము చేయక అమావాస్యనాడు బైలుదేరిపోయి పనిలో ప్రవేశించితిని. నేనక్కడనున్న కాలములో, విశేష పరీక్షలలో ఒకటియగు 2 వ తరగతి భాషాంతరీకరణ పరీక్ష (Translation, Lower Grade) ఇంగ్లీషు, తెలుగు భాషలయందు పోయి కృతార్థుడనైతిని.

నా తల్లికి పిశాచ భ్రమ యుండెనని చెప్పియుంటిని. కోరంగిలో నున్న కాలములో సహితము నా మాతకట్టి భ్రమము కలుగుచునే వచ్చెను. అక్కడివారు, గొప్ప భూత వైద్యుడని ఒక యోగిని కొనివచ్చిరి. ఆ బ్రాహ్మణ యోగి మిక్కిలి కండ పుష్టి గలవాడు, గడ్డమును గోళ్లను

పెంచినవాడు, కాలికి కర్రపావాలు తొడిగి, చేత బెత్తమును పట్టి కాషాయ వస్త్రములు గట్టి, నొసలు పెద్ద కుంకుమ బొట్టు పెట్టి, మహా భయంకరముగా నుండెడివాడు. గంజాయి త్రాగెడువాడు. నాకు మంత్రములందు గాని, దయ్యములందు గాని నమ్మకము లేకపోయినను, అతని మా యింట నుంచుకొని భోజనము పెట్టెదనని, నా తల్లి దేహము స్వస్థపడిన తరువాత మంచి బహుమానము చేసెదనని చెప్పితిని. అతడందునకొప్పుకొని మా యింట ప్రవేశించెను. ప్రవేశించినది మొదలుకొని అతడు పెక్కు మిషలమీద నా వద్దనుండి ధనము లాగజూచెను. నా తల్లి శరీరము స్వస్థపడిన పిమ్మటగాని నేనేమియు నియ్యనిరాకరించితిని. అప్పుడతడు కన్ను ఎర్రచేసి నా వంక క్రూరదృష్టితో చూచి కారులు ప్రేల నారంభించెను. నేనును పట్టరాని కోపము గలవాడనయి, మా పాఠశాల భటునిచేత మెడపట్టించి ఆ యోగీశ్వరుని వీథిలోనికి గెంటించితిని. అతడు వేరొక చోటికిపోయి, ఒక యింట నొక గదిపుచ్చుకొని, అలికి ముగ్గుబెట్టి, అందేదో యంత్రము వేసి, ప్రయోగము చేసి నన్ను చంపెదనని పలుకుచు, ఏదో మంత్ర జపము చేయ నారంభించెను. నా మిత్రులు భయపడి, అతని పాదములమీద బడి క్షమార్పణము చేయవలసినదని నాకు హితము చెప్పిరి. నేను వారి మాటలను వినక పంపివేసితిని. ఆ యోగి రాత్రివరకును భోజనము లేక, చీకటిలో "హ్రీం" "హ్రాం" అని కేకలు వేయుచుండెను. ఆహారము లేకపోవుటచేతనో, నిద్రమత్తు చేతనో, గంజాయి మైకము చేతనో, మరి ఏ హేతువు చేతనో తూలి క్రింద బడిపోయి తన్నెవరో త్రోచినట్లు భ్రమించి జడిసికొనెను. అతనికి వెంటనే భయజ్వరము వచ్చెను. మరునాటి ప్రాతఃకాలమున తన్ను చూడవచ్చిన వారితో నెల్లను నేను శరభ సాళ్వమును తన మీద ప్రయోగము చేసితిననియు, ఆ దేవత వచ్చి తన్ను క్రింద పడవేసెననియు, తన్ను శీఘ్రముగానే చంపుననియు ఆ యోగి చెప్ప సాగెను. నేను రెండు దినములు పేక్షించి యూరకుంటినిగాని, అతడంతకంతకు బలహీనుడయి సంధిలో నన్నే పలవరించుచుండినట్లు విని, జాలి నొంది, ఆతని యొద్దకు బోయి, నేనేమియు చేయలేదని నమ్మబలికి, అతనిని మాయింటికి కొనితెచ్చితిని. క్రమ క్రమముగా అతడు యథాస్థితికి వచ్చుటకు నెల దినములు పట్టినది.

1874 ఆషాఢ మాసమున నేను కోరంగిలోని పనిని విడిచి, రాజ

మహేంద్రవరమునకు నాలుగుమైళ్ల దూరములో నున్న ధవళేశ్వరమునందు ఆంగ్లోదేశాభాషా పాఠశాలలో నెలకు రు. 44 జీతము గల ప్రధానోపాధ్యాయత్వమునందు ప్రవేశించితిని. ఇక్కడనున్న కాలములో కొక్కొండ వేంకటరత్నము పంతులవారు స్త్రీల విద్యకు ప్రతికూలముగా "ఆంధ్రభాషా సంజీవని" లో వ్రాయుచుండగా, నేను వారి వాదమును ఖండించుచు, స్త్రీల విద్యకనుకూలముగా "పురుషార్థ ప్రదాయిని" కి వ్రాయుచుంటిని.

1875 సం. న నేను సంక్షేపలేఖన (Precis Writing) పరీక్షయందు ఇంగ్లీషున కృతార్థుడనైతిని. ఈ పరీక్ష నిమిత్తము నేను రాజమహేంద్రవరమునకు పోయి యుండినప్పుడే నా కచ్చటి రాజకీయ శాస్త్ర పాఠశాలాధ్యక్షులగు మెట్కాపు దొరగారితోడి ప్రథమ పరిచయము కలిగినది. సంక్షేపలేఖన పరీక్ష యందు కృతార్థుడనగుటచేత నేను (Sub-magistrate) పదమునకు అర్హుడనైతిని. వ్యావహారకోన్నత పద పరీక్ష (Civil Higher Grade) యందు కృతార్థుడనైన యెడల, మొదటి తరగతి న్యాయవాదిత్వమునకు, Sub-judge పదమునకు కూడ అర్హుడనయుందును. నా మిత్రులైన న్యాయవాదులు కొందరు, తమ పనిలో నిజమైన స్వతంత్రత లేదనియు, అందు న్యాయముగా ప్రవర్తించి ధనార్జనము చేయుట అసాధ్యమనియు చెప్పినందున రోత పుట్టి మానుకొంటిని.

నా యూహలను లోకమునకు వెల్లడించుటకు స్వకీయమైన పత్రిక ఒకటి యుండుట యుక్తమని భావించి, 1874 ఆశ్వయుజ మాసమునుండి 'వివేక వర్ధని' అను నామముతో నాలుగు పెద్ద పుటలు గల ఒక చిన్న మాస పత్రికను తెలుగున ప్రకటింప నారంభించితిని. ఈ పత్రికా ప్రకటనమునందు నా యుద్దేశములు భాషాభివృద్ధియు, దేశాభివృద్ధియు ముఖ్యముగా రెండు. భాషాభివృద్ధి మార్గము తెలుగులో మృదువైన సులభశైలిని సలక్షణమైన వచనరచన చేయుట. దేశాభివృద్ధి మార్గము జనులకు గల దురాచార దుర్వర్తనముల బాపియు, వృద్ధి పద్ధతులను జూపియు, వారి నధిక నీతిమంతులనుగా జేసి, దేశమున్నతస్థితికి దెచ్చుటకయి, విద్యావిషయమునను, వ్యవహార విషయమునకు, కులాచార విషయమునకు, నీతి విషయమునకు, మత విషయమునను నానా ముఖముల కృషి చేయవలయుననియే కాని, ఒక్క రాజ్యాంగ విషయములయందే పనిచేయుట నా యుద్దేశ్యము కాదు. మానవ దేహములోని కరచరణాది సమస్త అవయవములును యథా

ప్రమాణముగా పెరుగుటయే వృద్ధికాని, ఒక్క తలయో, కాలో అత్యధిక ముగా పెరుగుట వృద్ధికాక, రోగమయినట్టే, దేశ విషయములో కూడ జనులు నీతిమత కులాచారాదులయిన సమస్తాంగముల యందును సమాన ముగా నభ్యున్నతి నొందుటయే వృద్ధి.

ఆ కాలమునందు రాజకీయోద్యోగులలో లంచములు పుచ్చుకొనుట సర్వసాధారణము. లంచము తప్పుగాక ఉద్యోగ ధర్మమనియె ఎల్లవారి నమ్మకము. రాజకీయోద్యోగులలో ఈ యక్రమమును మాన్పబూనుట మా పత్రికోద్దేశములలో నొకటి. లంచము లిచ్చెడు జనులలోనూ, పుచ్చుకొనెడి అధికారులలోను నీతి గౌరవము వర్ధిల్లక లంచములడగవు. కాబట్టి జను లలో నీతి మానములను వృద్ధిచేయుట ఇంకొక యుద్దేశము. వేశ్యా గమనాదులు దురాచారములని భావింపకుండునంతవరకు నీతి యెట్లు వర్ధిల్ల గలుగును? కాబట్టి కులాచారములను చక్కబరచుట మరి యొక యుద్దేశము. తులసీ రుద్రాక్షమాలాది భాగ్య చిహ్నములకంటె సత్ప్ర వర్తనము మతమున కధికావశ్యకమని జనులలో విశ్వాసము కుదురు వరకును మతము దురాచార నివారకము కానేరదు. కాబట్టి పరిశుద్ధ మత సిద్ధాంతములను బోధించుట వేరొక ఉద్దేశము. ఇట్టి సదుద్దేశములతో మా 'వివేకవర్ధని' వెలువడినది.

లంచములు తగవన్న రాజకీయోద్యోగులకు కోపము: వేశ్యాసంగమము తగదన్న శృంగారనాయకులకు కోపము: పూర్వాచారము మార్చుకోవలె నన్న పామర జనులకు కోపము: నీతి మాలిన బాహ్య వేషములు మత విరుద్ధములన్న ఆచార్య పురుషులకు కోపము; పత్రికోద్దేశము నిర్వహింప వలసినచో ఇన్ని కోపములను సరకు చేయకుండవలెను.

స్త్రీ విద్యను గూర్చి పత్రికా ముఖమున మాటల పోరాటము జరుగు చుండగా దాని వాసన ధవళేశ్వరమునకు సోకి ఆ వాదమును ఫలోన్ముఖ మునకు తెచ్చినది. అక్కడి ప్రముఖులకనేకులకు బాలికలకు విద్య ఆవశ్యక మన్న నిశ్చయము కలిగెను. ప్రముఖులంచరు చందాలు వేసికొని, 1874 సెప్టెంబరులో బాలికా పాఠశాలను స్థాపించిరి. ఆ పాఠశాల తరువాత స్థానిక సంఘమువారి సంరక్షణకు పాత్రమయి, ఇప్పటికిని అవిచ్ఛి న్నముగా జరుగుచున్నది. పురుషులలో సహితము విద్య అత్యల్పముగా నున్న ఆ కాలములో ఒక చిన్న గ్రామములోనివారు చందాలు వేసికొని

పాఠశాలను స్థాపించిరనుట వింతగాను తోచవచ్చును. సత్కృత్య ప్రభావము తలచినప్పుడసాధ్యమేదియు లేదు.

అధికార ధూర్వహులయిన వారి దుష్ప్రవర్తనములను వెల్లడి చేయుచు వచ్చుటచేత నాకు విరోధులంతకంతకు నెక్కువ కాజొచ్చిరి. ఆ కాలమునందు వేశ్యా ప్రియుల సంఖ్య మేరమీరి యుండెను. న్యాయాధిపత్యము మొదలగు మహోన్నత పదవులయందున్న వారందరు వేశ్యాదర పరాయణులయి యుండిరి. ఆ అధికారుల ఇండ్లకు స్వకార్యార్థము పోయినప్పుడు వేశ్యల నుంచుకొన్నవారి కెక్కువ గౌరవము, ఉంచుకోని వారికి తక్కువ గౌరవము. న్యాయ సభలలో సహితము వారకాంత వల్లభులైన న్యాయవాదుల వాదములందాదరము, కేవల కుల కాంతావల్లభులైన న్యాయవాదుల వాదమునందనాదరము! అందుచేత ప్రభు సన్మానముచే ధనార్జనము చేయ నపేక్షించిన న్యాయవాదులు అనేకులు వేశ్యలను చేరదీయవలసిన వారయిరి. మా రాజమహేంద్రవరములో నున్న వేశ్యలు చాలకపోగా, రామచంద్రపురము మొదలైన గ్రామములనుండి క్రొత్త వేశ్యలు రప్పింపబడిరి.

ఆ కాలమునందు రాజమహేంద్రవరములో పాఠశాల అనగా వేశ్యల చదువుకోస మనియే అర్థము. శుద్ధ శ్రోత్రియులు సహితము అధికారుల మెప్పునకయి యీ వేశ్యల పాఠశాలలకు నెలకయిదులు, పదులు రూపాయలు చందా లిచ్చుచుండిరి. బోగము మేళములు నాయుడిగారి మేళము, పంతులుగారి మేళము, శాస్త్రిగారి మేళము అని పిలువబడుచుండెను. ఎవరి ఇంటనైన శుభకార్యము వచ్చిన పక్షమున ఈ ప్రముఖులు తమ తమ మేళములను పెట్టవలసినదని సందేశములు బంపుచుండిరి. ఇట్టి బలవంతులకప్రియముగా ఈ దుర్వ్యాపారమును గూర్చి పలుమారు వ్రాయవలసి వచ్చినది. కొన్ని సమయములయందు ప్రముఖులు దురాగ్రహావేశపరులయి, పత్రికను కొనవలదని చందాదారులకు చెప్పియు, దూషణోక్తులు పలికియు, నన్నేమో చేసెదమనియు చేయించెదమనియు బెదరించియు నన్ను నా పూనికనుండి మరపింపజూచిరి. కాని వారి కోరికలు సఫలములయినవి కావు. వేశ్యల పాఠశాల లన్నియు అల్పకాలములోనే తీసివేయబడినవి. పొరుగూళ్ళనుండి వచ్చిన వేశ్యలు మరల స్వగ్రామములకు పోవలసిన వారయిరి.

ఇట్లు దుర్బలునిచే నడపబడినదయ్యు ధర్మమే కడపట జయమొందినను, వేశ్యావలంబులకు నా పయిని కలిగిన కోపమంత శీఘ్రముగా పోలేదు. అప్పుడు నాకు ఎవరి కోపమును గణనచేయ నక్కరలేని స్వతంత్ర స్థితి యందుండవలెనన్న చింత దృఢముగా కలిగెను. ఉపాధ్యాయత్వమును సహితము విడిచి, పత్రికను నిర్వహించుచు గ్రంథకర్తను కావలెనన్న బుద్ధి నాకప్పుడుదయించెను.

పత్రికాధిపత్యమున స్వతంత్ర జీవనము చేయదగినంత ధనాగమము కలుగునని నా కెప్పుడును నమ్మకము లేదు. నా గ్రంథములను పత్రికా విలేఖరులు మొదలయిన వారు శ్లాఘించుటచేతను, నేను రచించిన పుస్తకములను బహు పాఠశాలలలో పాఠ్యపుస్తకములనుగా పెట్టుటచేతను, గ్రంథకర్తృత్వము వలన స్వతంత్ర జీవనోపాయము కలుగునన్న ధైర్యము కలిగినది. నా వ్యాకరణము వలన రెండు మూడు మాసములలో ఇన్నూరు [200] రూపాయలు వచ్చినవి. నా 'నీతిచంద్రిక విగ్రహ తంత్రము' ల వలన వేయి రూపాయలు వచ్చినవి.

పత్రికా ప్రకటనమునకును, గ్రంథ ముద్రణమునకును వలయు ముద్రా యంత్రమును నెలకొల్పవలెనన్న అభిలాష నాకు విశేషముగా నుండెను. ధవళేశ్వరములో నుండగా, మున్నూట యేబది [350] రూపాయల చొప్పున ఆరు భాగములు వేసికొని ముద్రా యంత్రమును రాజమహేంద్రవరమున ప్రతిష్ఠింపవలెనని ప్రయత్నించితిమి. భాగస్థు లేర్పడిన తరువాత వేసవికాలపు సెలవులలో నేనొకసారి చెన్నపట్టణమునకు పోయితిని. బహుజనపల్లి సీతారామాచార్యులవారు మొదలైన పండితులు నన్ను మిక్కిలి ఆదరించిరి. పచ్చప్పగారి శాస్త్ర పాఠశాలలో తెలుగు పండితుడుగానున్న కార్మంచి సుబ్బరాయలు నాయుడుగారు, నాకు చెన్నపురిలో కావలసినవన్నియు కొని పంపుచుండుటకు వాగ్దానము చేసిరి. నేను ధవళేశ్వరములోని ఉపాధ్యాయత్వమును మానుకొని, 1876 సంవత్స రారంభమున స్వస్థలమగు రాజమహేంద్రవరమున ప్రవేశించితిని.

అక్షరములు రాగానే ఏప్రిల్ నెలమధ్యనుండి పని మొదలు పెట్టి, మా ఇంటనే నెలకొల్పబడిన ముద్రా యంత్రమునందే 'వివేకవర్ధని' ముద్రింపనారంభించితిమి. మేమనుకొన్నట్టుగా ముద్రా యంత్రమునకు లాభము రాలేదు. వచ్చిన ఆదాయమును, వివేకవర్ధనికి వచ్చిన చందాల

మొత్తమును కలిపినను పనివాంద్ర జీతములకే చాలియు చాలక యుండెను. నరసాపురములో నా మిత్రులగు మీర్ షుజాయుతల్లీఖాన్ సాహెబుగారు 'విద్యన్మనోహారిణి' అను తెలుగు మాస పత్రికను ప్రకటింప నారంభించిరి. వివేకవర్ధనినొక సంవత్సరము నడిపిన తరువాత 'విద్యన్మనోహారిణి' ని దానితో కలిపివేసి, వివేక వర్ధనియు ఇంగ్లీషు కూడ (చేర్చి) ఇంగ్లీషు భాగమాయనయు, తెలుగు భాగమును నేను వ్రాయుచుండుటకు ఏర్పాటు చేసికొంటిమి.

1876 జూలయినుండి వివేకవర్ధనిని పక్ష పత్రికచేసి, 'హాస్యసంజీవని' అను పేర హాస్యరస ప్రధానమైన ఒక మాస పత్రికను కూడ వివేక వర్ధని కనుబంధముగా ప్రచురింపనారంభించితిని. కొక్కొండ వేంకట రత్నము పంతులుగారు పూర్వాచార స్థాపన దీక్షాదక్షులలోనెల్ల నగ్ర గ్రగణ్యులై, వివేకవర్ధనిని పరిహసించుటకై 'హాస్యవర్ధని' అను పత్రికను తమ 'ఆంధ్రభాషా సంజీవని' కనుబంధముగా 1875 అంతమున వెలువ రించిరి. 'హాస్యవర్ధని'తో ప్రతిఘటించి పోరాడుటకయి ఉదయించిన పత్రికయే 'హాస్య సంజీవని'.

నా 'బ్రాహ్మ వివాహము' ఈ పత్రికయందే ప్రథమమున వెలువడ నారంభించెను. అట్టి వ్రాత కదియే తెలుగు భాష మొదలగుట చేత, ఆ దినములయందు ఎక్కడ చూచినను మూకలు కట్టి జనులు హాస్య సంజీవని ముఖ్యముగా అందులో 'బ్రాహ్మ వివాహము'ను, చదివి ఆనందించుచు వచ్చిరి. నేనొకసారి బందరు పురమునకు పోయినప్పుడు ఒక బ్రాహ్మణ బాలిక బ్రాహ్మ వివాహమును మొదటినుండి తుదివరకు ఉప్పగించి నా కాశ్చర్యము కలిగించినది. తన రెండవ ఏట 'హాస్యవర్ధని' అదృశ్యము కాగా, మా హస్య సంజీవనియు పుస్తక రూపమున అదృశ్యమై, వివేక వర్ధనిలో అంతర్భాగమై దురాచార దుర్నీతి భంజనమునందెంతో పని చేసినది.

1876 వ నవంబరు మొదటి తేదీన రాజమహేంద్రవరము నందలి రాజ కీయ శాస్త్ర పాఠశాలలో నెలకు 25 రూపాయలు జీతముగల ఆంధ్ర ద్వితీ యోపాధ్యాయ పదమునందు కుదురవలసిన వాడనైతిని. మొదట నాకా పనిని దయచేసెదమని మెట్కాఫు దొరగారు వర్తమానము పంపినప్పుడు నిరాకరించితిని. నా బంధువులును, మిత్రులును నన్ను చివాట్లుపెట్టి, ఆ పని

కొప్పుకొమ్మని బలవంత పెట్టిరి. నిరాకరించిన నేనే మరలపోయి ఆ పనిని నా కీయవలసినదని ప్రార్థించితిని.

ఒక్క పాఠశాలలో నుండుట చేత నేనును, బసవరాజు గవర్రాజు గారును, బుర్రా రామలింగశాస్త్రిగారును, ఏలూరి లక్ష్మీనరసింహముగారును అత్యంత మైత్రిగలవారమయి, పత్రికలో వ్రాయు విషయములను గూర్చియు, మాన్పవలసిన దురాచారములను గూర్చియు ఆలోచించు కొనుచుండెడివారము. ఈ నలుగురిలోను నేను నాయకుడను. మిగిలిన ముగ్గురును విద్యార్థులుగానూ, నేను ఉపాధ్యాయుడుగాను ఉంటిమి. పత్రికలో మేము వ్రాసిన దానివలన మనసు నొచ్చినవారందరు మమ్ము దుష్ట చతుష్టయమని పిలుచుచు వచ్చిరి.

మా వివేకవర్ధని చేసిన పనులలో రెండు మూడు ముఖ్యాంశము లను మాత్రము ఉదహరించెదను.

వివాహాది శుభకార్యముల యందాహూతులయిన పెద్ద మనుష్యులంద రును బోగము మేళమునకు రూపాయకు తక్కువకాకుండ ఒసగు వసూళ్లు చేయు ఆచారము ఆ కాలమునందు మా ప్రాంతములో సర్వసాధారణమై యుండెను. తాంబూలములకు వచ్చినవారు వేశ్య కొసగుటకై వేయకుండుట ఎంతో అవమానకరముగా నుండెను. కొందరు శక్తులుగాక ఏవో సాకులు పెట్టి మిత్రబంధు బృందముల శుభకార్యములకు పోక తప్పించుకోగలిగినను, అధికార పిశాచావేశమత్తులయిన వారి ఇండ్లకు తప్పక పోయి, వేశ్యలకు కట్నములు సమర్పించవలసిన వారుగా నుండిరి. పిలిచినప్పుడధికారుల ఇండ్లకు పోని సన్నగాండ్రకు గ్రామములో కాపురము చేయుటయే దుర్ఘట ముగా నుండెను. మా పట్టణమునందే ఒక దండ విధాయి యుండెను. అతడేవో మిషలు కల్పించి నెలకు రెండు సారులైన బోగము మేళములు పెట్టి, ఊరనున్న వారినందర నాహ్వానించెడివాడు. ఆ సభలకెవ్వరైన పోక యుండిరా, మరునాడు వారి ఇంటిముందు పెంట యున్నదనియో, మురికి నీరు వీథిలోనికి వచ్చినదనియో ఆ మందభాగ్యులు సభలకీడ్వబడి, కొన్నాళ్లు పని చెడి తిరిగిన మీదట ఒక్క రూపాయకు బదులుగా నాలుగు రూపాయలు ధన దండన మిచ్చుకోవలసిన వారగుచుండిరి. ఇటువంటి అధికారులు కొందరు తమ ఇంట వచ్చెడి వసూళ్లలో సగము మాత్రమే వేశ్యలకిచ్చుటకు ఏర్పాటు చేసికొని, నెలకిన్నూరో, మున్నూరో గడించుచుండిరి. ఈ

దురాచారమును నివారించుటకయి సభలు చేయించి, మా వివేకవర్ధని ఎంతో పని చేసినది.

ఆ సభలలో కడపటి దానిని గూర్చి 1878 జనవరి పత్రికలో ప్రకటింప బడిన పర్యవసానము : "వివాహాదులయందు తాంబూలములకు వచ్చువారు వసూళ్లు వేయు దురాచారము మాన్పించుట ముఖ్యకర్తవ్యము. సభకు వచ్చిన పెద్ద మనుష్యులందరును తామికముందు వసూళ్లు వేయమనియు, ఎవ్వరైనా వేసినయెడల వారిని తమ యిండ్లకు తాంబూలమునకు పిలువగూడదనియు, వారి ఇండ్లను తాంబూలమునకు వెళ్లకూడదనియు నిబంధనలను వ్రాసికొని, దాని క్రింద తమ చేవ్రాళ్లను చేసి ఈ పత్రికాధిపతినే కార్యదర్శిగా నియమించిరి."

కొన్ని దినములలోనే మా యూరనొక గృహస్థుని యింట ఉపనయన మహోత్సవము నడచినది. మా సమాఖ్యలో సంతకము చేసిన వారొకరు ఆ ఉత్సవమునకు పోయి, బోగము మేళమునకు వసూలు చదివించిరి. మా కట్టుపాటును మీరిన అతనికి నా ప్రకటన పత్రిక వలన కలుగవలసిన సత్ఫలితము తోడనే కలిగినది. అతడు భయపడి, తాను ఒడంబడికను బుద్ధిపూర్వకముగా అతిక్రమింపలేదనియు, నిబంధనలెప్పటినుండి వ్యవహారములోనికి వచ్చునో కాల నిర్ణయమేర్పడియుండక పోవుటచేత, ఏర్పాటు జరిగినదినమునుండి వసూళ్లు మానుకొనవలెనను కొంటిననియు చెప్పి, క్షమింప వేడుకొనెను. ఇట్లే జరుగునన్న భయముచేత ఒడంబడికలో వ్రాలుచేసిన వారెవ్వరును తరువాత నొసగులియ్యలేదు. పలువురు వసూళ్లు మాని లాభము నొందుచున్నందున క్రమముగా మాలో చేరనివారు సహితము వేశ్యలకు వస్తువులొసగుట మానివేసిరి.

వాలేస్ దొరగారు మరిడల న్యాయాధిపతిగా నుండిరి. ఆరంభదశలో ఒకరిద్దరు ప్రాడ్వివాకులు తమ్మాశ్రయించిన వారికి న్యాయవాది పట్టాలిమ్మని వ్రాసిరి. కాని పరీక్షాసిద్ధులు కారన్న కారణము చేత మా మండల న్యాయాధిపతి పట్టాలివ్వలేదు. అంతట నొక క్రొత్త సిరస్తాదారు వచ్చెను. ఈయన కాలములో న్యాయవాది పట్టాలెల్లవారికి కొల్లలుగా నీయబడ జొచ్చెను. కొన్ని మాసములలో దాదాపు ఎనుబది మందికి పట్టాలు లభించెను. వీరిలో ఒక్కొరును పరీక్ష నిచ్చినవారు కారు. పెక్కండ్ర కింగ్లీషు వాసనయైనను లేదు. ఈ యక్రమమును సహింపక మా వివేకవర్ధని,

పరీక్షా సిద్ధులు కానివారికి పట్టాలనిచ్చుట అన్యాయమని ఘోషింప నారంభించెను. దాని మొరను విని 1878 సం. అంతమున ఉన్నత న్యాయ సభ వారు ఇట్లు పట్టాలేల ఇయ్యబడినవో తెలుపవలసినదని మా మండల న్యాయాధిపతిగారి నడిగిరి.

న్యాయవాది పట్టాల విషయమున కొన్ని ముఖ్యాంశములను తెలుపుటకయి 1879 జనవరి 23 మధ్యాహ్నము 3 గంటలకు తమ న్యాయ సభకు రావలసినదని మా మండల న్యాయాధిపతిగారు నాకాజ్ఞాపత్రము పంపిరి. నేను చెప్పవలసిన విషయమేమో నాకు తెలియలేదు. నాకాజ్ఞాపత్రిక వచ్చిన సంగతి యూరనంతటను ప్రకటనము కాగా నన్ను చూచుటకు ఇద్దరు మిత్రులు మా యింటికి వచ్చిరి. మేము ముగ్గురము కలసి చిర్రావూరి యజ్ఞన్నశాస్త్రి న్యాయవాదిగారి ఇంటికి పోయితిమి. ఆజ్ఞాపత్రికను చూపి ఆయన విస్మయ పడెనేకాని తగిన ఆలోచన చెప్పలేకపోయెను. న్యాయాధిపతు లెల్లరకు న్యాయాధిపతియైన ఈశ్వరుని యందే భారమువైచి నేనా రాత్రి నిర్విచారముగా నిద్రపోయి, మరునాడు పాఠశాలకు పోయి పనిచేసి రెండు గంటలైన తరువాత సెలవు పుచ్చుకొని, తిన్నగా న్యాయసభకు నడచిపోయితిని.

సరిగా 3 గంటలకు దొరగారు సభకు వచ్చిరి. ఆయన నాకు కుర్చీ యిచ్చి కూర్చుండబెట్టి వివేకవర్ధనీ పత్రికను తీసి నా చేతికిచ్చి, న్యాయవాది పట్టాలను గూర్చిన వ్యాసమును చూపి, "ఇది నీరే వ్రాసితిరా?" అని అడిగెను. ఉన్నత న్యాయసభవారి ముద్రతో నున్న ఆ పత్రికను చూడగానే అంతయు నాకవగతమయ్యెను.

వెంటనే కర్తవ్య మాలోచించి, "మీ ప్రశ్నకుత్తరము చెప్పుటకు ముందు నాకీ ఆజ్ఞాపత్రిక ఏ రాజశాసనానుసారముగా పంపబడినదో ఎరుగ కోరెదను," అని బదులు చెప్పితిని.

న్యాయాధిపతి ఏమియు తోచనివానివలె నించుక ఆలోచించి, "ఈ పత్రికను మీరే ప్రకటించెదరా?" అని మరియొక ప్రశ్న వేసెను.

"మీ ప్రశ్నలకుత్తరము చెప్పుటకు పూర్వము నేను బదులు చెప్పుటకు బద్ధుడనో కానో తెలియగోరెదను," అని నేను మరల పలికితిని.

"మీరు బద్ధులైయున్నారని చెప్పజాలము. మీకిష్టమైనచో చెప్ప వచ్చును," అని న్యాయాధిపతిగారనిరి.

"నేను బద్ధుడను కానిపక్షమున బదులు చెప్పుటకు నాకిష్టము లేదు," అని నేను తెలియబలికితిని.

ఈ ప్రశ్నోత్తరములన్నియు వ్రాసికొని, "ఇక మిమ్మట్టే యుంచుట నాకిష్టము లేదు," అని దొరవారనిరి.

"సంతోషము," అని చెప్పి నేనీవలకు వెడలి వచ్చితిని. నా ధైర్యమునకు సంతోషించి, నాకు అమిత్రుడుగా నుండిన ఒక న్యాయవాది నాతో వెలుపలికి వచ్చి, నన్నాలింగనము చేసికొని మిత్రభావమును చూపెను. నేను మరలి ఇంటికి పోవుచుండగా, నేనాదినము కారాగృహమునకు పంపబడుదునని నమ్మి, వింత చూచుటకయి గుంపులు గుంపులుగా న్యాయస్థానమునకు పోవుచున్న మూఢ జనులు దారిపొడుగునను నాకెదురుపడి, నావంక నివ్వెరగంది చూడజొచ్చిరి.

ఉన్నత న్యాయసభవారును, దొరతనమువారును, ఇచ్చిన పట్టాల నెల్ల మరల ఊడదీసికోవలసినదని మా మండల న్యాయాధిపతిగారికి ఉత్తరవు చేసిరి.

ఆ కాలమునందు లంచములు పుచ్చుకొనివాడు అప్రయోజకుడనియు, బుద్ధిహీనుడనియు పరిగణింపబడుచుండెను. రహస్యమన్నది లేక బంటు మొదలుకొని మంత్రివరకును రాజపురుషులందరును ఉత్కోచ స్వీకరణము చేయుచుండిరి. 1878 ఆరంభమున పోలూరి శ్రీరాములుగారను నాతడు కొంతకాలము రాజమహేంద్రవరమునకు ప్రాడ్వివాకుడు (డిస్ట్రిక్టు మునసబు) గా వచ్చెను. ఆయన చెల్లెలిని, మా మండల న్యాయసభలో దొరతనమువారి న్యాయవాదిగా నుండిన చిత్రపు కామరాజుగారి కుమారునికిచ్చి వివాహము చేసినందున వారిరువురు ఆప్తబంధువులు, పరమమిత్రులు అయియుండిరి. క్రొత్తగా ప్రాడ్వివాక పదమునకు వచ్చిన ఆ ఘనుడు లంచములు మరగియున్న వాడగుటచేత, ఇప్పుడెక్కువ అవకాశము కలుగగా, వాది, ప్రతివాది, దరిద్రుడు, ధనికుడు, న్యాయము, అన్యాయము అని చూడక, సర్వభక్షకుడైన అగ్నిహోత్రునివలె ద్రవ్యభక్షణము చేయబూనగా, మహాబలుడైన చిత్రపు కామరాజుగారాయనకు తోడయి నిలచిరి. ఈ న్యాయ విక్రయమునకయి పరిభాష యొకటి క్రొత్తగా నేర్పడవలసి వచ్చెను. ఈ పారిభాషిక వ్యవహార శాసనమును బట్టి న్యాయవాదులకు యుక్తులు చెప్పి వాదించవలసిన శ్రమము తప్పిపోయి, పని

సులభమయ్యెను. వాది పక్షమున వచ్చిన న్యాయవాది, "ఏలినవారు 100 వ ప్రకరణమును చిత్తగించి న్యాయము దయచేయింపవలెను," అని వేడగా ప్రతివాది పక్షమున వచ్చిన న్యాయవాది, "ఆ ప్రకరణము పనికి రాదు. ఏలినవారు 150 ప్రకరణము చిత్తగించి న్యాయము దయచేయించ వలెను," అని మనవి చేసికొనును. అపయి నొకరి తరువాత నొకరు 160, 170, 180, 190, 200 అని న్యాయవాదులునూ తమ న్యాయశాసనము యొక్క ప్రకరణముల నుదహరించుచుండగా కడపటి నొక సంఖ్య కడ పాట నాటికి నిలిచిపోవును. పెద్ద ప్రకరణమును చూపి ఎక్కువ పాట పాడిన న్యాయవాది ఆ రాత్రి న్యాయపరిపాలకుని ఇంటికిపోయి ఆ ప్రకర ణార్థమును దీపము వెలుతురున కన్నులకు కట్టినట్టుగా విశదముగా చూపిన, మరునాడా పక్షమున మునసబుగారు న్యాయసభలో తీర్పు విని పించుచుందురు. నూరవ ప్రకరణమనగా నూరు రూపాయలనియు, నూట యేబదవ ప్రకరణమనగా 150 రూపాయలనియు ఆ నూతన శాసనము యొక్క పరిభాష.

మా మునసబుగారు అత్యాశచేత వరుస తప్పించి పెద్ద మొత్తములు గల వ్యాజ్యములను ముందుగా విమర్శించి తీర్పు నారంభించిరి: అంతేకాక, ఏకకాలమందే రెండు మూడు వ్యాజ్యముల విచారణచేయుచు, తా మొక వ్యవహారములో సాక్షుల విచారణ చేయుచు, ఇంకొక వ్యవహారములో సాక్షుల విచారణ గుమాస్తాల కప్పగించుచుండిరి. ఒక్కసారిగా ఇన్ని వ్యాజ్యముల గ్రంథములను, సాక్షి వాఙ్మూలములను చదివి తీర్పులు వ్రాయుట ఒకరికి దుర్భరముగాన, తాము స్వయముగా కొన్ని తీర్పులు వ్రాయుచు, మరికొన్నిటిని తమ చుట్టమైన చిత్రపు కామరాజుగారి చేత చిత్తు తీర్పులు వ్రాయించి, తాము వాటికి శుద్ధ ప్రతులు వ్రాసికొనుచు యధే చ్ఛగా విహరింపజొచ్చిరి.

ఈ అధికారి యొక్క దుర్ణయము తుద ముట్టింపవలెనని మా వివేక వర్థని సాక్ష్యాన్వేషణ ప్రయత్నములో నుండెను. బాధనొందిన ప్రజలును, వారి పక్షమున పనిజేయు న్యాయవాదులును మొరపెట్టుకొన నారం భించిరి. కాని వారిలో నొక్కడును తాము లంచము లిచ్చినట్టుగాని, మునసబు పుచ్చుకొనుచున్నట్టుగాని బహిరంగముగా సాక్ష్యమిచ్చుటకు సిద్ధపడలేదు.

నేనొకనాడు ప్రాడ్వివాక న్యాయ స్థానమునకు బోయి ప్రచ్ఛన్న ముగా నొక మూల కూరుచుండి, ఆ ఘనుని వర్తనమంతయు సావకాశ ముగా చూచి వచ్చితిని. నేను వచ్చితినని వినియు, వివేకవర్ధనిలో తన మీద వ్రాయబడిన దానిని చదివియు మొదట నతడించుక సంచలించెను గాని, లంచముల యందారితేరిన ధైర్యశాలి యగుటచేత ఎప్పటివలెనే వ్యవహారము నడుప సాగెను. మండల న్యాయసభలోని అప్పటి రాజసేవకులలో బయనే పూడి వెంకట జోగయ్య గారొక్కరు మాత్రము నాకు మిత్రులయి నా పక్ష మవలంబించిరి. ఆయన వలననే నా కప్పుడు న్యాయస్థానమున జరుగు కొన్ని కుతంత్రములు తెలియుచుండెను.

ఆ కాలములో ఈశ్వరుడు మాకొక్క ఆధారము గనబరిచెను. చిత్రపు కామరాజుగారు మునసబుగారి నిమిత్తము వ్రాసిన చిత్తు తీర్పు కాగితములను శుద్ధ ప్రతులు వ్రాసిన తరువాత చించివేసి, ఆ ముక్కలను తమ యింటి కెదురుగా నుండు పెంటకుప్పలలో పారవేయుచుండిరి. వారి ఎదురింటిలో నున్న న్యాయవాది వచ్చి, వారేవో కాగితపు ముక్కలు పారవేయుచున్నా రని చెప్పెను. అవి పనికిరావచ్చునని తలచి, వీథులు తుడుచు వానికేమైన నిచ్చి ఆ ముక్కలెత్తించుకొని రావలసినదని నేనా న్యాయవాదితో చెప్పితిని. అతడు రెండు బుట్టలలో ముక్కలను మా యింటికి చేర్చెను. ఆ ముక్కలను ఒకదానితో నొకటి చేర్చి ప్రయాసపడి అతికింపజొచ్చితిని. వానిలో కొన్ని పనికిరానివయి పోయెను. ముక్కలు తెచ్చిన న్యాయవాది అతికించిన వానిలో రెండు కాగితములు చేరి సంపూర్ణముగా ఒక తీర్పయ్యెను. పడిన ప్రయాసము వ్యర్థమయిపోలేదని నాకు అపరిమిత సంతోషము కలిగినది.

ఆ వ్యాజ్యమును కోలుపోయిన మహమ్మదీయుని పిలిపించి మాటాడగా, కామరాజుగారు లంచమిమ్మని అడిగినప్పుడు బీదవాడగుటచే తానియ్యలేక పోయితిననియు, ప్రతివాది యొద్ద లంచము పుచ్చుకొని మునసబు వాని పక్షమున తీర్పు చేసెననియు చెప్పెను. ఆ సంగతులనే తెలుపుచు మహమ్మదీయుని సమ్మతితో మండల న్యాయాధిపతి పేర విన్నపము వ్రాయించి, చిత్తుతీర్పు యొక్క సగభాగము అందుతో చేర్చి కుట్టించి మండల న్యాయసభలో పెట్టించితిమి. ఈ విన్నపము సంగతి తెలియగానే మహాతాంత్రికుడైన కామారాజుగారు మహమ్మదీయుని రహస్యముగా

రప్పించి, వ్యాజ్యము మొత్తమునకు ద్విగుణముగా ధనమిచ్చి, వాని యొద్ద నున్న తీర్పు ముక్కల నపహరించెను.

ఆ విన్నపములో పేర్కొనబడిన సాక్షులలో మిర్తిపాటి రామయ్యగా రొకరు. మహమ్మదీయుడు చిత్రపు కామరాజుగారి వద్ద సొమ్ము పుచ్చుకొని తిరిగిపోయి, ముక్కలిచ్చి వేసెననియు, కామరాజుగారు మునసబు గారికి లంచములు కుదుర్చుచున్నట్టును, తీర్పులు వ్రాసి యిచ్చుచున్నట్టును రుజువు చేయుటకు తన వద్ద ఆధారములున్నవనియు, మహమ్మదీయుని తీర్పు యొక్క సగము ముక్క తన వద్ద నున్నదనియు మిర్తిపాటి రామయ్యగారిచేత మండల న్యాయసభలో విన్నపము పెట్టించితిమి.

ఇంతలో కామరాజుగారు మహమ్మదీయుని చేత, తన విన్నపములోని సంగతులేవియు తానెరుగననియు, ఒక న్యాయవాది దామరాజు నాగరాజు మోసము చేసి తన చేత అందులో సంతకము చేయించెననియు, తన విన్నపమును విమర్శించ నక్కరలేదనియు మరియొక విన్నపము పెట్టించెను. మిర్తిపాటి రామయ్యగారిచ్చిన విన్నపముపైని మా మండల న్యాయాధిపతిగారు మహమ్మదీయుని తీర్పు యొక్క సగము ముక్కను పుచ్చుకొని, తక్కిన ఆధారములను ప్రదర్శింప వలసినదని ఉత్తరు విచ్చిరి.

ఈ లోపల మరి మూడు నాలుగు తీర్పుల ముక్కలను కూడ మేము అతికి పూర్తి చేసితిమి. నా వద్ద నింకను తన వ్రాతతో నున్న ముక్కలున్నవని కనిపెట్టి వానిని ఇచ్చివేసిన 5,000 రూపాయల నిచ్చెదమని చిత్రపు కామరాజుగారు నాకు సందేశ మంపిరి. నేను తిరస్కార భావముతో నిరాకరించితిని.

ఇప్పటికి అయిదు తీర్పుల ముక్కలను మేము పూర్ణముగా అతికింప గలిగితిమి. ఒక్క తీర్పును మాత్రము నా యొద్ద నుంచుకొని, తక్కిన నాలుగింటిని కాగితపు సంచిలో పెట్టి, లక్క ముద్రవేసి, మిర్తిపాటి రామయ్యగారిని మండల న్యాయసభకు తీసికొనిపోయి, ఆ సంచిని విమర్శ దినము వరకును న్యాయాధిపతి సొంత పెట్టెలోనే ఉంచుకొనునట్టు విన్నపము వ్రాయించి, దొరగారికి ప్రదర్శింపించితిని.

ఇంకను బుట్టెడు ముక్కలు నా యొద్ద మిగిలి యుండినవి. వానిలో ఏవైనా సరిగా అతుకునేమో చూచుటకు ఆ బుట్టను నేను దామరాజు నాగరాజుగారి యొద్ద నుంచితిని. మరునాడు ఉదయమున, మునసబుగారును,

కామరాజుగారును, నాగరాజుగారి ఇంటికేదో పనిమీద రెండవ తరగతి న్యాయవాదిని పంపినట్టు నాకు తెలిసెను. నేను వెంటనే నాగరాజుగారి ఇంటికి పోయి, ఆ ముక్కల బుట్టను తీసికొని వచ్చి, నా పెట్టెలో పెటి తాళము వేసితిని. ముక్కల నిచ్చినచో తనకేనూరు [500] రూపాయల నిచ్చెదనని సందేశము పంపిరనియు, తాను నిరాకరించితిననియు నాగ రాజుగారు తరువాత చెప్పిరి.

రెండు మూడు దినములలో నాకు మొదట ముక్కలను తెచ్చి యిచ్చిన న్యాయవాది, తనకాదినము పనిలేదనియు, తీర్పుల నతికించెదననియు చెప్పెను. నేనామాట నమ్మి ముక్కల బుట్ట నిచ్చివేసితిని. కామరాజు గారేదో మాయోపాయము పన్ని ముక్కల బుట్ట నపహరించిరని నాటి సాయంకాలమే పట్టణములో ప్రవాదము కలిగెను. కామరాజుగారు ధన మిచ్చియు, స్త్రీలను సంధించియు, వివిధోపాయముల కార్యము సాధించు కొను సామర్థ్యము గలవారు. నేనా న్యాయవాది కడకు పోయి అడుగగా, ఆ బుట్టలో పనికివచ్చు ముక్కలేవియు లేనందున రాల్చివేసితినని చెప్పెను. అంతటితో అన్ని ముక్కలు పోయినవని ఎల్లవారును తలచిరే గాని నా యొద్ద నింకొక తీర్పు మిగిలియున్నదని నా మిత్రులు సహిత మెరుగరు.

మిర్తిపాటి రామయ్యగారి విన్నపముపైని మండల న్యాయాధిపతిగారు విమర్శకు జూన్ 26 వ తేదీ నిర్ణయించిరి. విమర్శదినము రాక మునుపే ఏలాగుననో కాని మండల న్యాయాధిపతిగారి పెట్టెలోని తీర్పు ముక్కలు సిరస్తాదారుగారి చేతిలోనికి వెళ్లినవి. తెల్లవారి విచారణయనగా, 25 వ తేదీ రాత్రి న్యాయ సభా భవనము యొక్క గోదావరి వైపుననున్న తలుపొకటి తెరువబడి, సిరస్తాదారుని యొక్కయు, ఒక లేఖకుని యొక్కయు వ్రాత పెట్టెలు పగులగొట్టబడి, కాగితములు చిందరవందరగా చిమ్మివేయ బడినవి. సొమ్ముపెట్టె సమీపముననే యున్నను దాని నెవ్వరును ముట్టు కోనేలేదు. కామరాజుగారి వ్యవహారముతో సంబంధించిన కాగితములకు దొంగలు ఎత్తుకొని పోయిరని పట్టణములో గొప్ప ప్రవాదము పుట్టినది.

నాడు విచారణ దినమగుటచేత సాక్షులును, పౌరులును పగలు పది గంటలు కాకమునుపే సభా భవనమునకు పోయియుండిరి. సాక్షినయి యుండుటచేత నేనును మిత్రులతోడ ముందుగానే పోయియుంటిని. అప్పటికి సభా భవనములో నొక వింత నడుచుచున్నది. సిరస్తాదారుగారును,

క్రిమినల్ రికార్డు కీపరుగారును ఒక గదిలో తలుపులు వేసుకొని కూర్చుండి రహస్యముగా ఏదో చేయుచుండిరి. నేనును నా మిత్రులును తాళము చెవి సందులోనుండి లోపల చూచితిమి. సిరస్తాదారుగారును, బొల్లా ప్రగడ వెంకన్నగారును కాగితపు ముక్కల నొక సంచిలో వేయుచుండిరి. ముద్ర వేయుటకు గాబోలు లక్క కణిక వెంకన్నగారి చేతిలో నుండెను.

న్యాయాధిపతిగారు పీఠము నలంకరింపగానే మిర్తిపాటి రామయ్యగారు తనచేత అర్పింపబడిన ముక్కలు మార్పబడు చున్నవనియు, వెంటనే తన ముక్కలను తనకు చూపవలసినదనియు న్యాయాధిపతిగారి ముందర మొర పెట్టుకొనెను. కొంచెముసేపటికి సిరస్తాదారు వచ్చి, అతికించిన ముక్కలను కొన్నిటిని తెచ్చి న్యాయాధిపతిగారి బల్లమీద పెట్టెను. శోధించి చూచి, అవి తాను కాగితపు సంచిలో పెట్టినవి కావనియు, సిరస్తాదారు ముక్కలను మార్చుచుండగా చూసిన సాక్షులున్నారయు మిర్తిపాటి రామయ్యగారు బహు విధముల న్యాయాధిపతిని ప్రార్థించెను. ముక్కలు పోయినందుకు తాము చేయవలసిన పని లేదని న్యాయాధిపతిగారు సెల విచ్చిరి. అంతేగాక, మా మండల న్యాయాధిపతిగారు మిర్తిపాటి రామయ్య గారిని పిలిచి, "నీవు అపకారము నొందిన వాది ప్రతివాదులలో చేరిన వాడవు గావు. కావున నీ విన్నపము విమర్శింపవలను పడదు" అని చెప్పి పంపివేసిరి. మండల న్యాయసభలోని న్యాయ విచారణ నాటికీ విధముగా ముగిసినది. కాని వ్యవహార మింతటితో పోలేదు.

రాజమహేంద్ర పుర ఆరక్షకుడు (Police Inspector) ఈ అన్యాయ మును విని, నన్ను డిస్ట్రిక్టు పోలీసు సూపరింటెండెంటు కడకు కొనిపోయి మాట్లాడెను. ఆయన జరిగినదంతయు విని, న్యాయసభలో జరిగిన చౌర్యము విషయము విచారణ జరుపుటకు సెలవియ్యవలసినదని మండల న్యాయాధి పతికి వ్రాసెను. అట్టి విచారణ ఆవశ్యకము లేదనియు, వస్తువులేవియు పోలేదనియు అతడు బదులు వ్రాసెను. అందు పైని డి. పో. సూపరిం టెండెంటు జరిగిన సంగతి యంతయు నా చేత వ్రాయించి పుచ్చుకొని, తాను వెంటనే కాకినాడకు పోయి, మండల దండవిధాయితో నడచిన కథ అంతయు విన్నవించి సిరస్తాదారుని, క్రిమినల్ రికార్డుకీపరును పట్టు కొనుటకయి వారంట్లు కొనివచ్చెను. మరునాడు రోజారియో దొరగారును సిరస్తాదారు, బొల్లాప్రగడ వెంకన్న క్రిమినల్ రికార్డుకీపరుగారును న్యాయ

స్థానమునకు పోవు నిమిత్తము బట్టలు కట్టుకొనుచున్న సమయములో ఆరక్షకభటులు పోయి వారిరువురును పట్టుకొని ఆరక్షకస్థానమునకు (పోలీసు స్టేషనుకు) కొనిపోయి, కొట్లలో పెట్టిరి. ఈ సంగతి తెలియగానే ఊరంతయు అల్లకల్లోల మయ్యెను.

ప్రతిపక్షులు పరిగెత్తుకొనిపోయి ఈ వైపరీత్యమును మండల న్యాయాధిపతిగారితో మనవి చేసిరి. ఆయన సిరస్తాదారుని వెంటనే విడిచి పెట్టవలసినదని ఆరక్షకాధ్యక్షుని పేర లేఖ వ్రాసెను. కాని ఆరక్షకాశాఖవారు దానిని మన్నింపక ఆ సాయంకాలమే వారిరువురిని పడవ ఎక్కించి, కాకినాడ మండల దండవిధాయి యొద్దకు తీసుకొనిపోయిరి. మండల దండ విధాయిగారు ప్రథమ విచారణ చేసి, మా వలన సాక్ష్యములను గైకొని, రాజమహేంద్రవరమునకు వచ్చి చౌర్యము జరిగిన స్థలము చూసి, మండల న్యాయాధిపతిగారి వాఙ్మూలము గైకొని, బొల్లాప్రగడ వెంకన్నగారిని విడిచిపెట్టి, సిరస్తాదారుని అంతిమ విచారణ నిమిత్తము మండల దండాధికారి కార్యస్థానమునకు పంపిరి. మా మండల దండాధికారియు, న్యాయాధిపతియునయిన వాలేసు దొరగారు ఈ వ్యవహారములో సాక్షి అయియుండినందున చెన్నపురి ఉన్నత న్యాయ సభవారు విచారణ నిమిత్తమా వ్యవహారమును కృష్ణామండల దండాధికారి కార్యస్థానమునకు పంపిరి.

అక్టోబరు నెలలో విచారణ జరిగెను. కృష్ణా మండల దండాధికారి గారగు కెల్సాలు దొరగారు, సరి అయిన ముక్కలు మండల న్యాయసభలో అర్పింపబడినందుకు లేశమైనను సందేహము లేదనియు, సిరస్తాదారే వానిని అపహరించినట్టు సాక్ష్యము లేనందున అతడు నిర్దోషి అనియు వ్రాసి, రోజారియో దొరగారిని విడుదల చేసిరి.

ఈ లోపల మా వివేకవర్ధనిలో వ్రాయబడిన అంశమును చూచి చెన్నపురి దొరతనము వారు ఉన్నత న్యాయసభవారికి వ్రాయగా, వారు విమర్శచేసి పర్యవసానము తెలుపవలసినదిగా మా మండల న్యాయాధిపతికి ఉత్తరువిచ్చిరి. అప్పుడు మండల న్యాయధిపతిగారు మేలుకొని, నన్నును మరికొందరిని పిలిపించి విమర్శ కారంభించిరి. మా ప్రతిపక్షులైన చిత్రపు కామరాజుగారు మొదలగువారు, ఈ విచారణలో నేను తప్పక కారాగృహమునకు పంపబడుదునని గట్టి నమ్మకము కలిగియుండిరి.

నాయొద్ద నుండిన తీర్పు ముక్కలన్నియు భగ్నములైపోయినవి. వాని నన్యాక్రాంతము చేసిన సిరస్తాదారుగారు నిర్దోషులుగా నెన్నబడి విముక్తులైరి. మండల న్యాయాధిపతిగారు నాపైని సదభిప్రాయము లేనివారుగా నుండిరి. నిమిత్తములన్నియు పైకి నాకు ప్రతికూలములుగా కనబడినవి. నా యొద్ద ఇంకొక తీర్పు ముక్క మిగిలియున్నదని నా మిత్రులకు గాని, అమిత్రులకుగాని తెలియదు. నేనా తీర్పు కాగితమును చొక్కా సంచిలో వేసుకొనియే న్యాయసభకు పోయితిని.

విచారణ ఆరంభమగుటకు ముందుగా నేనొక కాగితముమీద, నా వద్ద కామరాజుగారి వ్రాతతో యున్న చిత్తు తీర్పొకటియున్నదనియు, ఆ వ్యాజ్యపు గ్రంథమును వెంటనే తెప్పించెడి పక్షమున దాని సంఖ్యను తెలిపెదననియు వ్రాసి, న్యాయాధిపతిగారి కిచ్చితిని. సంఖ్య చెప్పవలసినదని వ్రాసి ఆయన ఆ కాగితమును నా చేతికిచ్చెను. దాని అడుగున సంఖ్యను వ్రాసి మరల నేను దొరగారికిచ్చితిని. ఆయన తక్షణమే ఒక లేఖ వ్రాసి, భటుని పిలిచి, "పరుగెత్తుకొని పోయి నీవిది ప్రాడ్వివాక సభలో నిచ్చి, వారిచ్చినది కొని ర"మ్మని అజ్ఞాపించెను. నాకును దొరగారికిని నడచిన ఉత్తర ప్రత్యుత్తరము లేవో ఎవరికిని తెలియలేదు.

పోయిన భటుడు అరగంటలోపల ఆ వ్యాజ్య గ్రంథమును కొని తెచ్చి దొరవారి కిచ్చెను. అప్పుడు నా జేబులోని కాగితము తీసి దొరగారిచేతి కిచ్చితిని. దొరతనము వారి న్యాయవాది యగుటచే కామరాజుగారి వ్రాత అందరికి తెలిసినదిగా నుండెను. నేనిచ్చిన కాగితములో హంసపాదులు, తుడుపులు అనేకముగా నున్నవి. వ్యాజ్యపు గ్రంథములోని తీర్పు సరిగా దానికి శుద్ధప్రతిగా నుండెను. ఆ రెంటిని చూడగానే దొరగారికి మునుపున్న అభిప్రాయమంతయు ఒక్కసారిగా మారిపోయినది.

ఆయన చిత్తు తీర్పును కామరాజుగారి చేతికిచ్చి, "ఇది తప్పక నీ వ్రాతయే. (నన్ను చూపి) ఇతడు న్యాయస్థుడు. సిరస్తాదారును, మీరును గలిసి యీతనిపై నాకు దురభిప్రాయమును కలిగించితిరి. ఈ వరకు పోయిన ముక్కలన్నియు నిజమైనవే. సిరస్తాదారుకు లంచమిచ్చి ఆ ముక్కలను మార్పించినవాడవు నీవే. విమర్శ నిమిత్తము రేపు నిన్ను దండవిధాయి యొద్దకు పంపెదను," అని కోపముతో పలికి, సిరస్తాదారును, క్రిమినల్ రికార్డుకీపరును పనిలోనుండి తొలగించినట్టు వ్రాసి, చదివి వినిపించెను.

కామరాజుగారు సభనుండి ఇంటికి పోయి, మరణ శాసనము వ్రాసి, ఆ రాత్రియే విషము త్రాగి ఆత్మహత్య చేసుకొనిరి. నాడు తెల్లవారు జామున తన్మరణ వార్త తెలిసినప్పుడు నాకతి విస్మయమును, విచారమును కలిగినవి.

దుర్ణయ పరుల దుర్వ్యాపారములను మాన్పుటకు ప్రయత్నించుటచే నా కెందరితోనో వైరములు సంభవించెను. దూరమున నున్న రాజధానీ పరిపాలకులను, రాజప్రతినిధిని, చివరకు మహారాజ చక్రవర్తిని తప్పులెన్ని దూషించుట నిరపాయమైన పనిగాని, నివసించుతావుననుండు అనుగత దండవిధాయిపైనగాని, ఆరక్షకభటునిపైగాని తప్పెన్ని వ్రాయుట అనపాయమైన పనికాదు. అయిననూ, తప్పు చేసినప్పుడు ఏ యధికారినిగాని ఖండింపక మా వివేకవర్ధని విడిచిపెట్టలేదు. దాని ఆక్షేపములకు పాత్రులైన అధికారులు అనేకులు అనేకవిధముల దానిని రూపుమాపుటకయి ప్రారంభ దశలో ప్రయత్నములు చేసిరి కాని వారి కృషి సఫలము కాలేదు. చిత్రపు కామరాజుగారి వ్యవహారముతో వివేకవర్ధని పేరే భయంకరమయి, దుష్టాధికారులకు గర్భనిర్భేద మయ్యెను.

దండోపాయము చేత వివేకవర్ధనిని గ్రహించుట అసాధ్యమని తోచి, కొందరు బుద్ధిమంతులు సామోపాయము చేత సాధింప జూచిరి. ఆరంభములోనే నెలకు 25 రూపాయల పనిని కాగాగ్రహి కార్యస్థానములో ఇచ్చునట్లు నాకొక వాగ్దానము వచ్చెను. విమోహకరమైన ఆ పనికప్పుడంగీకరించిన యెడల నేనొకవేళ గొప్ప లేక్కాధికారి పదమునొంది యుందునేమో గాని, నా స్వతంత్ర భావమును, పారమార్థిక చింతను, మనశ్శాంతిని తప్పక కోలుపోయియుందును. ఆ పనిని అంగీకరించిన యెడల నే నెట్టివారి క్రింద కొలువు చేయవలెనో ఎరుగుదును. మా పాఠశాలయందు స్వచ్ఛంద వృత్తిని విహరింప మరగిన విద్యార్థులట్టి కొలువులలో ప్రవేశించిన అల్పకాలములోనే మీసములు గొరిగించుకొని, ముఖమున విభూతి రేఖలు తీర్చి, నీరుకావి ధోవతులు కట్టి, ఆనవాలు పట్టరాని మారు వేషములలో చరించుట నేను దినమును చూచుచుండెడి వాడను. వారి యవస్థయే నాకును పట్టునని భయపడి, నా హితులు చెప్పిన బుద్ధి వినక ఆ పని నిరాకరించితిని.

1878 లో ప్రార్థనా సమాజమును మొదట మా గృహమున స్థాపించితిమి. అప్పుడు నేనును, బుర్రా రాజలింగమురావును, బసవరాజు గవర్రాజు

గారును, ఏలూరి లక్ష్మీనరసింహముగారును, బయపునేడి వేంకట జోగయ్య గారును, కన్నమురెడ్డి పార్థసారధి నాయుడుగారును సమాజముగా చేరితిమి. పార్థసారధి నాయుడుగారు కీర్తనలు పాడుచుండెడివారు. నేను చిన్న ధర్మోపదేశము వ్రాసి చదివెడివాడను.

సంవత్సరమైన తరువాత సమాజమును విజయనగరము మహారాజుగారి బాలికా పాఠశాలకు కొనిపోయితిమి. ఇప్పుడే ప్రార్థన సమాజమునకు స్వకీయమైన భవనమేర్పడి యున్నది. ఈ సమాజ మెన్నియో సత్కార్యములకును, ఎందరివర్తనమునో చక్కబరచుటకును కారణమైనదని నిస్సందేహముగా చెప్పవచ్చును. ఈ సమాజము మూలముననే బీదలకు రాత్రి పాఠశాలలు మొదలైనవి మొదట స్థాపింపబడినవి.

## 4. 1880 మొదలు 1890

1874 సం. నందు చెన్నపురిలోని ప్రముఖులు స్త్రీ పునర్వివాహమును ప్రోత్సాహపరచుటకయి సమాజమొకటి స్థాపించి పనిచేయ నారంభించి అన్ని మండలములకును ప్రకటన పత్రికలను పంపిరి. ఆ సమాజమునకు శ్రీ పల్లె చెంచలరావుగారు కార్యదర్శి. ఆ సమాజము రెండు సంవత్సరముల పాటు కోలాహలముచేసి విశ్రమించిన తరువాత మరల దాని పేరే వినబడ లేదు. అది పనిచేయుచుండిన కాలములో శ్రీ మహామహోపాధ్యాయ పరవస్తు వేంకట రంగాచార్యులవారు స్త్రీ పునర్వివాహము శాస్త్ర సమ్మత మని 1875 నందొక చిన్న పుస్తకమును వ్రాసి ప్రకటించిరి.

వ్యభిచార భ్రూణహత్యాదుల కవకాశములేక, బాలవితంతువులు తమ ద్వితీయ వల్లభులతో నిరంతర సౌఖ్యమనుభవించుచుండగా కన్నుల పండువుగా కనుగొనగలిగెడి భాగ్యమెప్పుడు లభించునా యని హృదయ ములో నేనెంతో అభిలషించుచుండినను, స్త్రీ పునర్వివాహములు వ్యాపిం చుటకు తగిన కాలమింకను రాలేదని తలచియుండుటచేత ఇంతటి కూర్పునకయి కృషి చేయుటకు నాకు సాహసము పుట్టలేదు.

ఒకనాడు, నా సహపాఠియు, దేశాభిమానియు, ప్రియమిత్రుడునగు చల్లపల్లి బాపయ్య పంతులుగారు, "మనము స్త్రీ పునర్వివాహ విషయమున కృషి చేయవలెను," అని నాకు అత్యంతాసక్తితో చెప్పెను. నావంటి వాడిట్టి మహాకార్యము తలపెట్టిన ప్రయోజనములేదని యధైర్యము తోచి, నేనాయననంతగా ప్రోత్సాహపరుపక, చూతమని ఉపేక్షించుచు వచ్చితిని. ఆయన రెండు మూడు తడవలు నాతో నీ విషయము మాట్లాడి నన్ను పురికొల్పుచుండెను. ఇట్లు రెండుసారులు ప్రస్తావనము జరిగినమీదట మూడవసారి నా మిత్రుని వంకజూసి, "నిన్ను మీ అన్నలు విడిచిపెట్టి నను, బంధువులు బాధపెట్టినను నన్ను విడువక కడవరకును నాతో నుండి పని చేసెదవా?" అని ధీరవృత్తితో అడిగితిని. అతడణుమాత్ర మును సంశయింపక, "ఎన్ని కష్టములు వచ్చినను తొలగక నిలచి పని చేసెదను," అని తత్క్షణమే చెప్పెను. అప్పుడది యీశ్వర ప్రేరితమైన

అజ్ఞ అని నా మనస్సునకు పొడగట్టగా "సభాహ్వాన పత్రికను వ్రాసి తెమ్ము. నేను చేవ్రాలు చేసి ప్రకటించెదను," అని చెప్పితిని.

నా ఆహ్వాన పత్రిక వెలువడగానే మా పట్టణములోని పండితులందరు నా మీద ధ్వజమెత్తి, కత్తులు నూరుట కారంభించిరి. పూర్వాచార పరాయణులయిన లౌకిక శిఖామణులును, వైదికోత్తములును వారికి సహాయులయి నా మీద దాడి వెడలిరి. స్త్రీ పునర్వివాహ విషయమయి ఈశ్వర చంద్ర విద్యాసాగరుల వారి గ్రంథమున్నట్టు తెలియునుగాని, నా కప్పుడది లభించినది కాదు. మనుస్మృతియు యాజ్ఞవల్క్య స్మృతియు, పరాశర స్మృతియు మాత్రము నాయొద్ద నున్నవి. ఈ విషయమయి "తత్వబోధిని" లో ప్రకటింపబడిన ఉపన్యాసమొకటియు, "పురుషార్థ ప్రదాయిని" లో ప్రకటింపబడిన వ్యాసమొకటియు నాకు లభ్యమయినవి. ఈ గ్రంథ సహాయములతో నా బుద్ధికితోచిన యుక్తులను శాస్త్ర ప్రమాణములను కూర్చి నా శక్తి కొలది ఉపన్యాస మొకటి వ్రాసి, బాలికా పాఠశాలా మందిరములలో 1879 ఆగస్టు 3 న జరిగిన మహాసభలో చదివితిని. నా ఉపన్యాసము ముగియగానే, వృషభము మీదికి కుప్పించు వ్యాఘ్రముల వలె పండితులనేకులు లేచి, భయంకరా రావములతో నన్ను బహు విధముల దూషించి, నష్టేమృతేత్యాది పరాశరస్మృతి వచనమునకు విపరీతార్థములు కల్పించి, ప్రత్యుత్తరము చెప్పుట కవకాశమియ్యక, పయి వారము నా ఉపన్యాసము మీద ఖండనోపన్యాములు చదివెదమని చెప్పి, నాటికి సభనుండి వెడలిపోయిరి.

అవరకు భూషించుచు వచ్చినవారును నన్నీ విషయమున దూషింపనారంభించిరి. మిత్రులు సహితము నన్ను నిరుత్సాహ పరచిరి. నన్నీ కార్యమునందు పురిగొల్పుచున్న బాపయ్య పంతులుగారు మాత్రము సంస్కృతమున కొంత పాండిత్యముగల వారగుటచే నాకు బహు విధముల తోడుపాటుగా నుండిరి. ఇంతలో 30 స్మృతులకంటె నెక్కుడుగా తెప్పించినాడను. నేను చూచిన భాగములలో నా వాదనమున కనుకూలమైన భాగములు అనేకము నాకు దొరకెను. పండితులుపన్యాసము చేసిన సభ నాడు నా ప్రతివాదమును విన్నమీదట వివేకులకందరకును పండితులవాదము అసారమైనదనియు, స్త్రీ పునర్వివాహము శాస్త్ర సమ్మతమనియు అభిప్రాయము కలిగెను.

పండితులు నన్ను బహిరంగ సభలలో నోడింపలేక మాయోపాయములు ప్రయోగింపజొచ్చిరి. కొందరు మంచి మాటలు చెప్పియు, భయపెట్టియు నన్ను మరలింపజూచిరి. అక్కడ పండితులు విశాఖమండలమునుండి ఒక ఖండన గ్రంథమును వ్రాయించి తెప్పించి, స్యేల పేరిచయనులగారి ఇంటిలోపల సభచేసి, ఆ సభకు స్త్రీ పునర్వివాహ ప్రతిపక్షులను మాత్రమే ఆహ్వానము చేసి, నన్నుచటి కాకస్మికముగా పిలుచుకొనిపోయి, పై గ్రంథమును చదివి, అందలి అంశముల కాక్షణముననే ఉత్తరము చెప్పవలయునని అడిగి, నన్ను పండితుని చేయ జూచిరిగాని, నేను సమయోచితములైన ప్రత్యుత్తరములను చెప్పనారంభింపగా వినక, కడుపు నొప్పియని యొకడును, కాలు నొప్పియని యొకడును లేచిపోవ దొడగిరి. అప్పుడొక వైష్ణవుడు లేచి ముందుకు వచ్చి, తాను పూర్వాచార పరాయణుడయ్యును, తమ పక్షము వారు చేయుచుండిన అన్యాయమును సహింపలేక, "ఏమి అన్యాయము? ఇది ఏమి సభ?" అని అరచుచు సభనుండి వెడలి పోయెను.

నేను మొట్టమొదట నిచ్చిన యుపన్యాసము ప్రకటింపబడగానే తెలుగు దేశము సంతంతటను స్త్రీ పునర్వివాహము విషయమైన వాదములే ప్రబలి, అనేకులు నా ఉపన్యాసము మీద ఖండన గ్రంథములు వ్రాసిరి. ఈ గ్రంథములందలి ముఖ్యాంశములకు సమాధానముగా బాలికా పాఠశాలలో అక్టోబరు 12 న జరిగిన మహాసభలో నా ద్వితీయ విజ్ఞాపనమును ఉపన్యసించి ప్రకటించితిని. బహు స్థలములయందు వ్రాయుచు వచ్చిన ప్రతివాదుల వాదములకెల్ల ఉత్తరములను వివేకవర్ధనిలో ప్రకటించుచు వచ్చితిని. తీరికయున్నప్పుడితర స్థలములకు పోయి యుపన్యాసము లిచ్చుటకు ప్రయత్నించుచు వచ్చితిని.

నేను మొట్టమొదట కాకినాడ కొక భానువారము నాడు పోయి, స్త్రీ పునర్వివాహము శాస్త్ర సమ్మతమని హిందూశాస్త్ర పాఠశాలా భవనములో ఉపన్యాసము చేసితిని. ప్రతిపక్షులుగానున్న తత్పురవాసులగు పండితులు కొందరు పై భానువారమునాడు ఖండనోపన్యాసము నిచ్చెదమని సెలవిచ్చిరి. పూర్వ పక్షములను విని నాకు తోచిన సమాధానములు చెప్పుటకు ఆ అదిత్యవారము నాడు నేనక్కడకు కాకినాడకు పోయితిని. పండితులు దేవాలయములో సభ చేసెదు పక్షమున వత్తమని వర్తమానము పంపి

నందున నేనును నా సహాయులును విష్ణ్వాలయమునకు పోయితిమి. విధవా వివాహ నిషేధవాదులు, నేను చేసిన ఉపన్యాసమునకు ఖండనమని ఒక గ్రంథమును చదువనారంభించిరి. వేదార్థ విచారము ముగియునప్పటికే ప్రొద్దు గ్రుంకినది. మరునాటి ఉదయము వారు స్మృతిభాగము యొక్క అర్థమును ముగించునప్పటికి పదిగడియల ప్రొద్దెక్కినది. మరు మధ్యాహ్నము సభ కూడిన పిమ్మట స్త్రీ పునర్వివాహ విధాయక వాదులు ఉపన్యసించబోవుచుండగా మల్లాది అచ్చన్నశాస్త్రిగారను మహా పురుషులు విజయంచేసి, నిష్పక్షపాతముగా న్యాయమును తెలుపుటకు తాము మాధ్యస్థనము చేసెదమని చెప్పిరి. నేను శ్రుతిభాగము యొక్క అర్థ వివరణ చేయగానే శాస్త్రులవారు నిష్పాక్షికమైన తమ అభిప్రాయము చదువుటకయి రొండిని బెట్టుకొని వచ్చిన కాగితమును పయికి తీసి, నిషేధవాదుల కనుకూలముగా చదువు నారంభించిరి. అంతట సభ్యులకా మధ్యస్థుని యోగ్యత తెలిసి, ఇక అభిప్రాయము నీయవలదని వారించిరి. కొందరు సభలోనుండి లేచిపోయిరి. అచ్చన్న శాస్త్రిగారును సంధ్యాసమయమని మిష పెట్టి లేచి పోయిరి.

ప్రతిపక్షులైన బ్రాహ్మణులు కొందరు అల్లరి చేయవలెనని దేవాలయ ద్వారము కడ తోపులాట ఆరంభింపగా ఆరక్షక భటులు వారించిరి.

ఇంతలో చీకటి పడినందున ప్రతిపక్షులు రాళ్లు రువ్వుట కారంభింపగా నా తోడ నాకు అంగరక్షకులుగా వచ్చిన విద్యార్థులు అల్లరి మూకతో తలపడి, వారికి నాయకుడయి యుండిన బ్రాహ్మణుని దిట్టముగా కొట్టుటచేతను, ఆరక్షకభటాధికారియు నా మిత్రుడునైన గుమ్మిడిదల మనోహరము పంతులుగారు వచ్చి అల్లరిమూకను కొట్టులో పెట్టింప జూచుట చేతను వేగముగానే ఆ దుండగపు బాపనగుంపు పలాయన మయ్యెను.

దౌరన్యము చూపి ప్రతిపక్షులు నన్ను మర్దింప యత్నించుట ఒక్క కాకినాడలోనే కాదు, నాస్వస్థలమయిన రాజమహేంద్రవరములో సహిత మట్టి ప్రయత్నమొకసారి జరిగినది. చెన్నపట్టణమువంటి రాజధాని నగరములోనే స్త్రీ పునర్వివాహమును గూర్చి చాకలిపేటలో నేను పన్యాస మిచ్చుచున్న సమయము నందచ్చట వైష్ణవ బ్రాహ్మణులు దొమ్మిచేసి, నా పయిని పడబోగా రావు బహద్దూరు శ్రీవనప్పాకము అనంతాచార్యుల వారు నన్ను తప్పించి, తమ బండిలో నెక్కించుకొని తీసుకొని రావలసి

వచ్చినప్పుడు చిన్న పట్టణములో మూఢులిట్టి దౌర్జన్యమునకు గడగుట ఒక వింతకాదు.

స్త్రీ పునర్వివాహ సమాజము పనిచేయుట కారంభించిన తరువాత బాల వితంతువుల సంరక్షకులనేకులు తమ వితంతు కన్యలకు పునర్వివాహము చేయనుద్దేశించుకొన మొదలుపెట్టిరి. వితంతు కన్యలు దొరకిన పక్షమున తాము వివాహమాడెదమని మా శాస్త్ర పాఠశాలలోని విద్యార్థులనేకులు బయలుదేరిరి. నేనును, బాపయ్య పంతులుగారును ఇంటింటికి తిరిగి అడుగగా, లౌక్యులయిన బ్రాహ్మణ గృహస్థులు 30 మందికంటె నెక్కువ సంఖ్యగలవారు వివాహ సమయము భోజనములకు వచ్చెదమని వాగ్దానములు చేసి, సమాఖ్య పత్రముమీద వ్రాల్లు చేసిరి. మేమీ పనికారంభించినప్పుడు మాయొద్ద ఒక్క కాసును నిధిగా లేదు. ఐనను కొన్ని వారములలోనే నాకు పరిచితులైన బారు రాజారావు పంతులుగారు, పైడా రామకృష్ణయ్యగారు రాజ మహేంద్రవరము వచ్చినపుడు ఈ పని నిమిత్తము 30 వేలరుపాయల నిచ్చెదమని వాగ్దానము చేసిరి. రెండు సంవత్సరమునకు పిమ్మట ప్రథమ వితంతు వివాహమగువరకును పట్టిన సమస్త వ్యయములను నేనే వహించినాడను. నేను చేసిన ఉపన్యాసములను ముద్రింపించి విశేషభాగము ఊరక పంచి పెట్టినాను. వాదమునకయి 30, 40, స్మృతులను, పుస్తకములను కొని కృషి చేసినాను. వివాహములు చేసికొనెదమని వాగ్దానములు చేసిన విద్యార్థులకు కొందరకు పాఠశాల జీతములను సాహాయ్యము చేయుచువచ్చినాను. బాలవితంతువులున్న స్థలములను విచారించి చెప్పుటకును, కృషిచేయుటకును మనుష్యులకు సొమ్మిచ్చుచు వచ్చినాను. బాలవితంతువుల సంరక్షకులతో మాటలాడుటకయి అమలాపురము, మండపేట, తాళ్లపూడి, కాకినాడ, రామచంద్రపురము, పాలకొల్లు మొదలైన స్థలములకు మనుష్యులను పంపుటయే కాక, ఒకటి రెండు స్థలములకు నేనును పోయినాను. ఈ కృషిలో నా కిక్కడి రాజకీయ పాఠశాలలోని విద్యార్థులు మొదటినుండియు ముఖ్య సహాయులుగా నుండిరని చెప్పవలసి యున్నది.

మహారాజులు సహితము నిర్వహించలేని యీ మహాకార్య భారమును ధన, విద్యా, అధికార బలములేని పిన్నవాండ్రము నలుగురైదుగురము పైన వేసికొని శ్రమపడుచుండగా, లోకానుభవమును విద్యాధికారములను

ఎక్కువగా గలవారు మాకు చేయూత అయినిలచి, మాకు అత్యంత ప్రోత్సాహము కలిగింపజొచ్చిరి. ఈ విధముగా మేము కొంత బలపడి, రెండు సంవత్సరములు వాగ్యుద్ధమును నడిపిన మీదట, క్రియలేని వాదములవలన ప్రయోజనము లేదని తెలిసికొని, ఏలాగుననైన కొన్ని వివాహములు జరుపవలెనని నిశ్చయించుకొని, ఆత్మూరి లక్ష్మీనరసింహముగారును, న్యాపతి సుబ్బారావు పంతులుగారును, కొమ్ము రామలింగశాస్త్రిగారును, బసవరాజు గవర్రాజుగారును, నేనును చేరి అయిదుగురమొక అంతరంగిక సమాజముగా నేర్పడి, మా ప్రయత్నముల నితరులతో చెప్పకుండునట్లు ప్రమాణము చేసికొని, రహస్యముగా కార్యాలోచనము చేయుట కారంభించితిమి.

ఈ సంగతి తెలిసికొని స్త్రీ పునర్వివాహ నిషేధ పక్షమువారు, మా ప్రయత్నములు కార్యములకు వచ్చుచున్నవని సంచలించి, ఒక దినమున మార్కండేయస్వామి ఆలయములో సభచేరి నన్ను దేవాలయమునకు రప్పించిరి. సభా భవనమునకు పోవునప్పుడు నన్ను కొట్టవలెనని బ్రాహ్మణులు కొందరు ఉద్దేశించుకొని వచ్చిరట! ఈ వార్త విద్యార్థుల చెవి సోకగానే సభ ఆరంభమయిన అరగంట లోపల దేవాలయ మంతయు రెండు వందల విద్యార్థులతో నిండిపోయినది. అనేకుల చేతులలో కర్రలుండినవి. కొందరు విద్యార్థులు నడుమను నా చుట్టును కూర్చుండిరి. ఆ దినము మొదలుకొని పట్టణములో కక్షావేశములు మరింత ప్రబలసాగెను.

విరూపాక్ష పీఠస్థులైన మా శంకరాచార్య స్వాములవారు విజయనగరము నుండి బైలుదేరి దారిపొడుగునను భిక్షలును, పాద పూజలును గైకొనుచు మా గోదావరీ మండలమునకు వచ్చుచుండిరి. రాజమహేంద్రవరమున జరుగుతున్న విధవా వివాహ ప్రయత్నము గూర్చి విని మా స్వాములవారు ఆ పనిలో ప్రవేశించిన వారినందరిని వెలివేసెదమని అనతిచ్చిరట! పీఠాధిపతులు విత్తాపహరణము నిమిత్తము చేయుచున్న అకృత్యములను గూర్చి మా వివేకవర్ధని బహు విధముల వ్రాసి ప్రజల కన్నులు తెరపుట కారంభించినది. ఈ స్వాములవారు, మగనిని విడిచి లేచి పోయి జగన్నాధపురములో వ్యభిచరించుచుండిన బ్రాహ్మణ కులటవలన ధన స్వీకారము చేసి, భార్యను విడిచిపెట్టినందుకై దాని మగనికి బహిష్కార పత్రిక పంపి, అతనికి శుద్ధ పత్రికనిచ్చుటకు అధిక విత్తము లాగజూచిరి :

బొల్లా ప్రగడ వెంకన్నగారును వృద్ధగృహస్థుడు 50 ఏండ్ల వృద్ధాంగనతో వ్యభిచరించిరని నేరము మోపి, బహిష్కార పత్రిక పంపి, విశేష విత్తము నాకర్షించుటకు ప్రయత్నించిరి: కులము విడిచి లేచిపోయి, తురక పేటలో కాపురముండి బిడ్డలను కన్న బ్రాహ్మణ కులట యొక్క పుత్రుని శిష్యునిగా స్వీకరించిరి. ఇవియన్నియు వివేకవర్ధని వెల్లడించుట చేత రాజమహేంద్ర పురవాసులు, స్వాములవారు మా పురమునకు వచ్చినప్పుడు, భిక్షలు చేయ కుండిరి. కులటా పుత్రుడైన శిష్యుని పంపిన తరువాతనే వారికి భిక్షలు జరిగినవి.

ఇంచుక విద్యాగంధమున గల వితంతువులు కొందరు తమ్ము వైధవ్య దుఃఖమునుండి కాపాడవలసిదని నాకుత్తరములు వ్రాసిరి. యుక్త వయస్సు రాని వితంతు కన్యల వివాహములతో నారంభించిన బహు జనరంజకముగా నుండి శీఘ్రకాలములో వ్యాప్తి కలుగునని భావించి యుంటిమి. వితంతు కన్యలకు వివాహములు చేసెదమని బైలుదేరిన వారు ముందొక వివాహ మైన తరువాత తాము రెండవ వారముగా నుందుమనిరే కాని, మొదటి వారముగా నుందుమను ధైర్యశాలులు బైలుదేరలేదు.

ఇది ఇట్లుండగా, తిరువూరు (Krishna Dt.) డిప్యూటీ తాహస్సీలుదారుగా నుండిన దర్భా బ్రహ్మానందముగారు 1881 నవంబర్ 5 న నాకిట్లు వ్రాసెను: "ఆ బాలవితంతువు 12 ఏళ్ల వయసుగల బ్రాహ్మణ కన్య యొక్క తల్లి. మీరిక్కడికి మీ మనుష్యులను పంపినతోడనే తన కుమారితను మీ వద్దకు పంపెదనని వాగ్దానము చేసినది. నమ్మదగిన వారును, ఋజు వర్తనులును, దృఢచిత్తులునయిన మనుష్యులను పంపుడు. వారు విషయము నత్యంత రహస్యముగా నుంచవలెను. మీ మనుష్యులు మీ యుత్తరముతో మార్గస్థులవలె నిక్కడకు వచ్చి నన్ను కలిసికొననిండు."

ఈ కార్యముల యందత్యంతాదరము గలిగి, మొదటి నుండియు మాతో పని చేయుచుండిన సోమంచి భానుశంకరరాజుగారిని నా లేఖతో బ్రహ్మా నందముగారి యొద్దకు 15 వ తేదీన పంపితిని. ఆ చిన్నది ఏ గ్రామము నందుండెనో, ఆ చిన్నదాని తల్లి పేరేదో మేము పంపిన మిత్రునకు సహి తము చెప్పక, బ్రహ్మానందముగారిని కలుసుకొన్న తరువాత సమస్తమూ వారే చేసెదరని మాత్రము చెప్పితిని.

నా మిత్రుడు రాజమహేంద్రవరమును విడిచిన రెండు దినములకు

బ్రహ్మానందముగారు వ్రాసిన యుత్తర మొకటి నాకు చేరినది. ఆ లేఖలో నిట్లు ఉండెను: "వెంటనే పోయి తహశ్శీలుదారుగా వినుకొండ తాలూకా ఒప్పగించుకోవలసినదని నిన్నటిదిన మాకస్మికముగా నాకుత్తరవు వచ్చినది. నేను రేపటి దినము వినుకొండకు పోవుటకు ఈ స్థలమును విడుచుచున్నాను. ఆశాభంగమును పొందక, రేపూడికి బాలవితంతువు ఉండే గ్రామము వెళ్లి బాలిక తల్లితో మాట్లాడి ఆమెను తీసికొని పోవలసినదని మీ మనుష్యులతో చెప్పుడు."

మా మనుష్యులు నడిదారిలో నుండిరి. మా మిత్రుడు పోవలసిన గ్రామము మా పట్టణమునకు 150 మైళ్ల దూరములో నున్నది. అయోమార్గములు లేవు. తంతి సమాచారముండదు. నేను నా మిత్రులతో ఆలోచించి, ఆ చిన్నది వాసము చేయు గ్రామమును, తల్లి ఇంటిపేరును, జరపవలసిన కృత్యమును తెలుపుచు మా మిత్రునకొక లేఖవ్రాసి, లక్క ముద్రలు వేసి ఒక భటునికిచ్చి పంపితిని. మా మిత్రుడు గమ్యస్థానము చేరి విచారింపగా బ్రహ్మానందముగారు దూరగ్రామము పోయినట్లు తెలియవచ్చినది. తాము పోవలసిన గ్రామమేదో వారికి తెలియదు. తాము వచ్చిన కార్యము వేరొకరితో చెప్పవల్లకాదు: తుదకు తామెవ్వరో తెలుప వీలుపడదు. బుద్ధిమంతుడు, కార్యదక్షుడునగుటచే తొందరపడిరాక, మా యుత్తరము నపేక్షించి మా మిత్రుడా గ్రామములోనే వేచియుండగా, మేము పంపిన మనుష్యుడు పోయి మా లేఖ నిచ్చెను. తక్షణమే పోవలసిన గ్రామమునకు వారు మువ్వురును పోయిరి.

ఆ చిన్నదాని తల్లి దండ్రులు గ్రామాధికారులయిన గొప్ప వంశము వారు. ఈ కార్యము తల్లికొకతెకు తప్ప బంధువర్గములో నెవ్వరికి నిష్టము లేదు. ఈ సమాచారము కొంచెము పైకి పొక్కినను మోటు గ్రామముల వారు దౌర్జన్యమునకు తెగింతురు. మా మిత్రునకు సాయము చేయువారు చుట్టుప్రక్కల నొక్కరును లేరు. ఇటువంటి విషమ పరిస్థితిలో, నా మిత్రుడు తామెక్కడికి పోవుచున్నారో బండివాండ్రకు సహితము చెప్పక, రాత్రి రెండు యామములకు ఆ గ్రామము చేరి, వారి యిల్లుచేరి, చిన్నదాని తల్లిని లేపి, రహస్యముగా తాము వచ్చిన పనిని తెలుపగా, ఆమె బ్రహ్మానందముగారు రానిదే తాను పిల్లను పంపనని చెప్పెను. నా మిత్రుడా రాత్రి ఆమెనేలాగుననో బ్రతిమాలి యొప్పించి, తెల్లవారక మునుపే ఆ చిన్నదానిని తీసు

కొని, వెనుకనుంచి, యెవ్వరు వచ్చి పట్టుకొందురో యను భీతిచేత శీఘ్ర ప్రయాణము చేసి, ఆ చిన్నదానిని 27 వ తేదీని మా యింటివద్ద చేర్చెను. ఆ మరునాడే ఈ వార్త పూరంతయు పొక్కి, ఆ చిన్నదానిని చూచుటకయి జనులు తీర్థ ప్రజవలె మా యింటికి రాసాగిరి.

అప్పుడు మేము వరాన్వేషణమున కుపక్రమించితిమి. ఆ వరకు వివాహ మాడ నిశ్చయించుకొన్న విద్యార్థులకు కొందరికి తల్లి తండ్రులు భయపడి, బలవంత పెట్టినందున వివాహములయిపోయినవి. బహు సంవత్సరములు మా యింటనే యుండి విద్య నేర్చుకొని, విశాఖపట్టణములో ఆరక్షకశాఖ యందిరువది రూపాయల పనిలో నున్న, 22 సం. ప్రాయముగల ఒక చిన్నవాని భార్య ఆకస్మికముగా మరణము నొందుట తటస్థించెను. నేనా తనికి జాబు వ్రాయగా తాను చిన్నదానిని వివాహమాడుట కంగీకరించెను. పలువురాతనికి కన్య నిచ్చెదని తిరుగుచున్నను నిరాకరించి, వితంతు వివాహము చేసికొని అనేక కష్టములు పొందుటకు సాహసించిన అతని ధైర్యమును, పరోపకార చింతయు శ్లాఘ్యములు.

వివాహ వ్యయము నిమిత్తము నాళము కామరాజగారు వేయిరూపా యలు మాకిచ్చిరి. వరుడు గోగులపాటి శ్రీరాములుగారని తెలిసిన తోడనే అతని బంధువులు మొదలయినవారు వచ్చి, వివాహము చేసికోవలదని హితోపదేశములు చేసి, కార్యము గానక మరలిపోయిరి. వివాహము జరుగునని నిశ్చయముగా తెలిసిన తరువాత మా పట్టణమంతయు మహా వాయువు చేత సంక్షోభము చెందిన మహాసముద్రము వలె కలగ నారంభించెను. నా మిత్రులు సహితము నాతో మాటాడుటకే భయపడిరి. స్త్రీ పునర్వివాహ విషయమున తమ ప్రాణములనయిన ఇచ్చెదమని డంభ ములు పలికినవారు సహితము, పెండ్లికి వచ్చుట మాట అటుండగా, మా వీథిన నడచుటకే భయపడి చుట్టు తిరిగి పోవువారైరి. బంధువులందరును నన్ను జాతిభ్రష్టుని వలె చూడసాగిరి. వివాహ దినమున మా యింట మాత్రమే కాక యింటి చుట్టును, వీథి పొడుగునను రక్షక భటుల కావలి కావలసి వచ్చినది. ఇటువంటి మహా సంక్షోభములో 1881 డిసెంబరు 11 రాత్రి రాజమహేంద్రవరములో మొదటి స్త్రీ పునర్వివాహము జరిగినది.

ఆ వివాహమునకు కొందరు అనివార్య ప్రతిబంధముల చేతను, కొందరు స్వాభావిక భీరుత్వము చేతను రాలేకపోయినను, ధైర్యశాలు

లును, దేశాభిమానులును అయిన నా మిత్రులు అనేకులు వివాహ దినములలో తాంబూలమునకు మాత్రమే కాక, భోజనమునకు సహితము వచ్చిరి. అట్టి వారిలో నగ్రగణ్యులు బసవరాజు గవర్రాజుగారు. పదిమంది ఒక్కసారిగా లోకాంతర గతులయినప్పుడు పుట్టినంత సంక్షోభము ఈ వివాహ దిన మున వారి యింట పుట్టినది. భార్యవంక వారును, తన వంక వారును ఒక్కసారిగా గొల్లున గోలపెట్టి, ఏడ్చుచు, శపించుచు లేచిపోయిరి.

గవర్రాజుగారి వలెనే భోజనములు చేసినవారందరును ఈ విధమైన శ్రమల కోర్చినవారే. పలువురు ప్రాయశ్చిత్తములు చేయించుకొని, మమ్ము విడువవలసినవారైరి. ఇటువంటి భయంకర సమయములో ధైర్యము నిలుపలేక పోయినందుకు నేను వారిని నిందింపను.

ఆ అనర్థముల కంతకును మూలమయిన నా ప్రాణములకు సహితము కొందరు దుష్టులెగ్గుతలచిరి గాని విద్యార్థులును, రక్షకభటులును నాకంగ రక్షకులుగా నుండుటచేత నా కేవిధమైన అపాయమును కలుగలేదు. మాకు ఆ రక్షక శాఖవలన కలిగిన సాయ మింత యంత అని చెప్పదరము కాదు. అల్లరి జరుగకుండ వారించుటకయి మా యింటి చుట్టును రక్షక భటులరువది మంది కావలి కాచుచుండిరి. డిస్ట్రిక్టు పోలీసు సూపరింటెం డెంటు స్వయముగా నుండి తగిన ఏర్పాటులు చేయించుచుండెను. జాయింటు మేజిస్ట్రేటు స్వయముగా రక్షణ క్రమమును విచారించుచుండెను. అందు చేత నాటి వివాహము జయప్రదముగా జరిగెను.

ప్రథమ వివాహము నిర్విఘ్నముగా నడచుట మా మండల మంతయు వ్యాపింపగా తమ వితంతు బాలికలకు వివాహము చేయదలచుకొన్న వారనేకులు మా పట్టణమునకు రా సాగిరి. అందుచేత, మొదటి వివాహము జరిగిన నాల్గవ దినముననే రెండవ వివాహము జరిగింది. ఇంకను అనేక వివాహములు జరుగునని అనేకు లెదురు చూచుచుండిరి. వివాహమైన తరువాత దంపతుల నాశీర్వదించుచు, మమ్మభినందించుచు నానా ముఖముల తంత్రీ వార్తలును లేఖలును రాదొడగినవి.

మొదటి వివాహమయిన నాల్గవ దినమున 12 ఏండ్ల ప్రాయముగల బాల వితంతువును వెంటబెట్టుకుని వచ్చి ఆమె తల్లి, తన భర్త ఆ చిన్న దాని వివాహమునకయి మా యొద్దకు బంపెనని చెప్పెను. మేమామె మాటలు నమ్మి, ప్రవేశ పరీక్ష నిమిత్తమయి పోబోవుచున్న ఒక విద్యార్థిని

రప్పించి, వధువును చూపి, అతడొప్పుకొన్న మీదట వివాహము సిద్ధము చేసితిమి. అతడు మంగళా స్నానమునకు కూరుచుండగా యీ వార్త అతని తండ్రికి తెలిసి, రోదనము చేయుచు పరుగెత్తుకొని వచ్చి, పెండ్లి కుమారుని లాగుకొని పోవుటకయి ప్రయత్నించెను. మాలోనివారు కొందరు ఆయనను పట్టుకొని తీసికొనిపోయి శతమానము ముడిపడువరకును ఓదార్చుచు సమాధానపరచి, మెల్లగా నావలకు పంపివేసిరి. మరునాటి రాత్రి ఊరేగింపు మహోత్సవములో హిందువులలోని తగు మనుష్యులేకాక, డిస్ట్రిక్ట్ జడ్జి, జాయింట్ మేజిస్ట్రేట్, కాలేజి ప్రిన్సిపాల్ మొదలైన యూరపియనులు పల్లకుల వెంట నడిచిరి.

రెండవ పెండ్లి కుమార్తెను తండ్రి యనుమతిలేకనే తల్లి తీసుకొని వచ్చినదని మా ప్రతిపక్షులేలాగునో తెలిసికొని, అతనిచేత మామీద నేరము మోపించి, మమ్ము శిక్షింపజేయవలెనని ప్రయత్నించిరి. వారి దుష్ప్ర యత్నములను మేము యుక్తసమయములోనే తెలిసికొని, తల్లివలన సత్య మును గ్రహించి, పెండ్లి కూతురి తల్లిని పంపి ఆమె భర్తను రప్పించుకొని, సభల నెక్కకుండ తప్పించుకొంటిమి.

ఈ వివాహమయిన మరునాటి నుండియు మూర్ఖ జనుల వలన బాధ లంతకంతకు ప్రబల సాగినవి. ఈ శుభకార్యములయందు కొంచెము సంబంధమున్నవారి నందరిని కాపురమున్న అద్దె యిండ్లనుండి లేవ గొట్టిరి. నూతులలో నీళ్లు తోడుకోనియ్యకపోయిరి. నీళ్లు తెచ్చు బ్రాహ్మణు లను తేకుండా చేసిరి. శుభాశుభ కార్యములకు బ్రాహ్మణులను పురోహితు లను రాకుండ చేసిరి. బంధువులను వారి యిండ్లకు పోకుండ చేసిరి. కొంత ధైర్యము కలిగి నిలచిన వారిలో కొందరికి మా గృహము నిచ్చితిని. వివాహములయిన కొద్ది దినములలో 30 మందికి శ్రీ శంకరాచార్య స్వాములవారి యొద్దనుండి బహిష్కార పత్రికలు కూడ వచ్చినవి.

ఈ బాధలిక్కడ నిట్లుండగా బహు స్థలములనుండి ప్రోత్సాహకరము లైన ఉత్తరములు, అభినందన పత్రికలును రాదొడగినవి. చెన్నపట్టణము నుండి అనేక మిత్రులు వెంటనే రావలసినదనియు, ఈ వేడి చల్లారక మునుపే కొన్ని ఉపన్యాసములు చేసిన పక్షమున తప్పక కొన్ని వివాహ ములగుననియు నన్నాహ్వానము చేసిరి. నల్లగొండ కోదండరామయ్య గారు చెన్నపట్టణము చూడవలెనన్న అభిలాష తనకు గలదనియు, తన్ను

తీసుకొనిపోయెడు పక్షమున తానే నాకు వంట చేసి పెట్టెదననియు నన్నడుగగా అంగీకరించితిని.

అప్పుడు చెన్నపట్టణమునకు పోవ ఆవిరి బండ్లును, ఇనుపదారులును లేవు. కాలువపయి పడవలో ఒక్క దినము ప్రయాణము చేసి కాకినాడ చేరి, అక్కడనుండి వారమున కొక్కతరి పోయెడు పొగయోడల మీద రెండు దినములు ప్రయాణము చేసి చెన్నపురి చేరవలెను. పొగయోడ పోవు డిసెంబర్ 30 తేదిన గాలివాన అరంభమయ్యెను. అటువంటి సమయమున సముద్రము మీద పోవలదని పైడా రామకృష్ణయ్యగారు మొదలైనవారు నన్ను బహు విధముల ప్రార్థించిరి. ఒక్కసారి నిశ్చయము చేసికొన్న తరువాత పట్టిన పట్టును విడిచెడు స్వభావము కలవాడను కాకపోవుటచేత, మౌర్ఖ్యముతో గాలివానలోనే పడవయెక్కి, నా సహచరునితో గూడ సముద్రమునందు ఐదుమైళ్ళు ప్రయాణముచేసి పొగయోడ సమీపమునకు పోగలిగినను, పడవ ఓడను తారసించుట అపాయకరమని ఎంచి, ధూమ నౌకాధికారి మమ్మెక్కించుకొన నిరాకరించినందున, మేము ఉభయుల మును తడిసి ముద్ద అయి, రాత్రి 8, 9 గంటలకు తీరము చేరవలసిన వారమయితిమి. . .

స్వాములవారు పంపిన బహిష్కార పత్రికలు పెద్ద పులులవలె బెదిరింపగా, ఆవరకు ముందంజె వేయువారందరును వెనుకంజెవేసి, మా ధైర్య వచనము లను చెవినిబెట్టక పూర్వాచార పరాయణుల మరుగునకు పలాయితులు కాజొచ్చిరి. ఆత్మూరి లక్ష్మీ నరసింహముగారు స్వాములవారిపై అభి యోగము తెచ్చిరి కాని అది కొట్టివేయబడినది. ప్రథమ వివాహము చేసుకొన్న గోగులపాటి శ్రీరాములగారి నీ విషయమున దూషించినారని కొందరు ప్రముఖులమీద దర్భా వేంకట శాస్త్రిగారు మాన నష్టమునకు అభియోగము తెప్పించి ఓడిపోయినందున గొప్పవారితో వైరము తప్ప వేరు ప్రయోజనము లేకపోయెను. మా ప్రతిపక్షులు విజయ గర్వితులయి మా పక్షమువారిని మరింత లోకువ చేసి గేలిచేయసాగిరి.

అభియోగము కొట్టుపడిన తరువాత ఆత్మూరి లక్ష్మీనరసింహముగారు వైష్ణవ మత ప్రవిష్టులయి ప్రాయశ్చిత్తము చేసికొనగా, వితంతు పక్షమున పని చేసినందుకే ప్రాయశ్చిత్తము చేసికొనిరని ప్రతిపక్షులు పలుకజొచ్చిరి. వైష్ణవ మత ప్రవేశమున కావశ్యకమయినందునకే ప్రాయశ్చిత్తము చేసి

కొంటిమనియు, తాము వెనుకటివలెనే వితంతు వివాహముల విషయమున శ్రద్ధ వహించెదమనియు వారు వివేకవర్ధనిలో లేఖ వ్రాసిరి. కాని తరువాత వివాహములు జరుగునప్పుడు మాత్రము రాలేదు. అయినను వివాహముతో సంబంధించిన విషయమందు శ్రద్ధ వహించుచునే యుండిరి.

వితంతు వివాహలత కవలంబస్తంభమని చెప్పదగిన పైడా రామ కృష్ణయ్యగారే వితంతు వివాహ పక్షమును విడిచిపెట్టి, ప్రాయశ్చిత్తము చేయించుకొన బోవుచున్నారని ప్రబల ప్రవాదము వ్యాపించెను. అట్టి వైపరీత్యము కలుగకుండుటకయి నేను సర్వ విధముల ప్రయత్నము చేసితిని. ఈ విషయమును గూర్చి మాకత్యంత సహాయులయి, కాకినాడ సబ్ జడ్జిగా నుండిన కృష్ణస్వామిరావు పంతులుగారి పేర వ్రాయగా వారిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి.

"పైడా రామకృష్ణయ్యగారు ఆచార్యుని అధికారమునకు లోబడుటకు తన మనస్సును దృఢము చేసికొన్నాడు. పైడా రామకృష్ణయ్యగారు ఇంతవరకును చేసినట్లుగా ముందంత సహాయము చేయజాలరు."

ఇటువంటి కష్టకాలముల యందు సహితము రహస్యముగా మాకు బహు విధముల తోడుపడినవారు కొందరుండిరి. అట్టివారిలో ప్రథమగణ్యులయి న్యాపతి సుబ్బారావు పంతులుగారు మా కారంభదశనుండి ఆలోచనలు చెప్పుచు సర్వవిధముల సాయము చేయుచుండిరి. వారు రామకృష్ణయ్యగారిని ప్రాయశ్చిత్త కర్మమునుండి మరలించు సందేశమును వహించి, కాకినాడకు పోయి వారితో మాట్లాడి, "ప్రాయశ్చిత్తము చేయించుకొనుటకు ముందు మిమ్ము చూడవలెనని నే నాయన యొద్ద వాగ్దానమును గైకొన్నాను," అని వ్రాసిరి.

పంతులుగారు వ్రాసినట్లుగా రామకృష్ణయ్యగారు ప్రాయశ్చిత్తము చేసికొనుటకయి రాజమహేంద్రవరము వచ్చి నన్ను చూచిరి. ఆయనకు నేను చెప్పవలసినంత చెప్పితిని. ఆయన ఇకముందు వివాహములు జరుగవనియు, జరగెడు పక్షమున తాము సాహాయ్యము చేసెదమనియు చెప్పెను. అధమ మొక్క సంవత్సరము కాలము వేచి చూడవలసినదనియు, అప్పటికి వివాహములయ్యెడు చిహ్నములు కనబడక పోయిన యెడల ప్రాయశ్చిత్తము చేసికోవచ్చుననియు నేను చెప్పితిని. మొగమోటము చేత నాముందు ప్రాయశ్చిత్తము నిలుపుచేసెదనని చెప్పి ఆయన వెడలిపోయెను. అటు తరువాత

కొందరు విద్యార్థులు వచ్చి రామకృష్ణయ్యగారు ప్రాయశ్చిత్తము చేయించు కొనబోవుచున్నారని చెప్పిరి. నేను వెంటనే వారి యింటికి పోయితిని. ప్రాయ శ్చిత్తమునకై మా ప్రతిపక్ష నాయకులును, కొందరు వైదికులును రామ కృష్ణయ్యగారిని పరివేష్టించి యుండిరి. రామకృష్ణయ్యగారా నాయకులతో మాటాడి పంపివేసి, నేను మా యింటికి వచ్చిన తరువాత, పడవయెక్కి పోయి బొబ్బర్లంకలో ప్రాయశ్చిత్తము చేయించుకొని వచ్చి, నాడే కాకి నాడకు వెడలిపోయిరి. తరువాత రామకృష్ణయ్యగారు మాస వ్యయముల నిమిత్తము డబ్బు పంపమానివేసిరి. నేనా సంగతి ఎవ్వరికిని తెలియనీయక, వారు సొమ్ము పంపుచుండినప్పటివలెనే సేవకుల జీతములు మొదలైన విచ్చుచు పనులు జరుపుచుంటిని.

గోగులపాటి శ్రీరాములుగారు వివాహము చేసికొని విశాఖపట్టణమునకు వెళ్లిన కొలది కాలములోనే ఆయనకు రక్త గ్రహణి పట్టుకొని, అంతకంతకు హెచ్చయ్యెను. జనవరి నెల మూడవ వారములో అతడు ప్రాణ సంశయ దశలో నున్నాడని మిత్రులు నాకు ఉత్తరము వ్రాసి తంతీ వార్తను పంపిరి. అప్పుడు నాకు కలిగిన మనోవ్యాకులతకు పరిమితి లేదు. వివాహమైన నెల దినములలోనే మొదటి వివాహము చేసుకొన్న పురుషుని కేమైన తటస్థించిన జనులు దానిని ఈ వివాహమున కారోపింతురు. ముందెవ్వరును వితంతు వివాహములను చేసికొన సంశయింతురు. అతని విషయమయి అధిక శ్రద్ధ చేయవలసినదని మిత్రుల కనేకులకు లేఖలను వ్రాసి, మా పురోహితుని ముందుగా పంపి, తరువాత, మాలో చేరి మా యింటనే యున్న నట్లగొండ కోదండరామయ్యగారిని పంపితిని. ఆయన జనవరి 29 న విశాఖపట్టణము చేరునప్పటికే అతని వ్యాధి ఈశ్వరానుగ్రహమున మరలి, అతను స్వస్థతకు వచ్చుచుండెను.

లక్ష్మీనరసింహముగారి అభియోగము పోయిన మరునాడు శంకరాచార్య స్వాములవారిని మహా వైభవముతో మా గుమ్మము ముందరి నుంచి కొని పోయి, రాత్రివేళ దీపికా సహస్రములతో రాజమహేంద్రపుర వీథులలో నూరేగించిరి. స్వాములవారు రాజమహేంద్రవరమును వీడక, ప్రతి దినమును వాద్యములతో వీథులగుండ నూరేగుచు, భిక్షలు చేయుచు, కొన్ని మాసములు నిలచియుండిరి. స్వాములవారు విధవా వివాహముల నెంత నిషేధించుచు వచ్చినను, ఘోటక బ్రహ్మచారులైన వారి శిష్యులు దండలతోడ

రాత్రులు అమంత్రకమైన వివాహములను రహస్యముగా జరుపుచునే వచ్చిరి. పాఠశాలలోని విద్యార్థులు కొందరీ రహస్యము గనిపెట్టి, ఒక్క రాత్రి కాచి యుండి, ఒక బ్రాహ్మణ వితంతువుతో సంసారము చేయుచున్న ఒక బ్రహ్మచారి శిష్యుని పట్టుకొని, ఆ అపూర్వ దంపతులను వీథిలోని కీడ్చుకొనివచ్చి, ఎల్లవారికిని చూపి, అవమానపరచిరి. అందుచేత స్వాములవారి శిష్యులు విద్యార్థులమీద పగ తీర్చుకోవలెనని నిశ్చయము చేసికొనియుండిరి.

రెండు దినములయిన తరువాత పగలు 12 గంటల వేళ స్వాములవారి శిష్యులు గోదావరిలో స్నానము చేయుచుండగా విద్యార్థులిద్దరక్కడకు స్నానమునకు పోయిరి. వారిని చూచి శిష్యులు విద్యార్థుల నందరిని కలిపి తిట్టగా, తప్పిదము చేసిన వారిని తిట్టవలయును గాని, మొత్తము మీద తిట్టుట న్యాయము కాదని మందలించిన విద్యార్థిని క్రూరముగా కొట్టిరి. రెండవ విద్యార్థి పారిపోయి ఈ సమాచారము పట్టణములో చెప్పగా, విద్యార్థులనేకులు కూడుకొని, ఆ దుండగపు శిష్యులను దండింపవలయునని ప్రతిజ్ఞ చేసికొని, గుంపులో గూడి, స్వాముల వారున్న గృహము ముందు వీథిలో తిరుగసాగిరి. భయపడి ఆ శిష్యులు వీథిలోనికి రాక, ఇద్దరు రక్షక భటులను వాకిటిలో కావలి యుంచుకొనిరి. విద్యార్థులు రాత్రి జామువరకును శిష్యులిల్లు వెడలివచ్చు జాడగానక విసిగి, నాటికిండ్లకు పోయిరి. మరునాటి యుదయమున యథాప్రకారముగా విద్యార్థులు పాఠశాలకు పోయిరి. విద్యార్థుల సందడి కానరాకపోయినందున శిష్యులు సాహసించి, రెండు మూడు గడియల ప్రొద్దుండగా గోదావరి యొడ్డున నున్న ఇసుక తిప్పకేసి నడిచిరి. ఈ సంగతి ఒక విద్యార్థి కనిపెట్టి తక్కినవారికి సమాచారమంపెను. ఆ శిష్యులు మరలివచ్చుచు గోదావరి యొడ్డునేయున్న ధాన్యపు పాకలను సమీపించునప్పటికి, ఎదుట దండధరులవలె కొందరు విద్యార్థులు కనబడిరి. గుండెలు పగిలిపోయి బెదరి బెదరి శిష్యులు నలుపక్కల చూపు నిగిడింపగా, నానా ముఖముల విద్యార్థులు గుంపులు గుంపులుగా వచ్చుచుండిరి. శిష్యులు పారిపోవుటకు పిక్కబలము చూపిరి. విద్యార్థులు వారిని పట్టుకొని పాదరక్ష ప్రయోగములచేత బుద్ధి చెప్పి, దాసుల మనిపించుకొని విడిచిపెట్టిరి. ముందు పరుగెత్తిన వారి అవస్థను చూచి వెనుకటివారు గోదావరిలోకి దిగి, కంఠము లోతువరకును పాకిపోయిరి. విద్యార్థులు కొందరు వారిని వెంబడించి పట్టుకొని, నీటిలో ముంచి లేవనెత్తి, వారి తలలను

మద్దెలలుగా చేసి వినోదించి, తమతోడి విద్యార్థిని అన్యాయముగా కొట్టిన ఋణమును వడ్డీతో గూడ తీర్చుకొనిరి.

మొట్టమొదట దెబ్బలు తినిపోయిన ఇద్దరు శిష్యులును పరుగెత్తి స్వాముల వారి సన్నిధానము చేరి, జగద్గురువు యొక్క శిష్యులకు సంప్రాప్తమయిన కష్టపాటును విన్నవించుకొని, రక్షక భటులతోడ, మరల యుద్ధ భూమిని చేరిరి. అప్పటికి అక్కడ ఇన్నూరుగురు విద్యార్థులకంటె నధికముగా చేరియుండిరి. నీటిలో నున్న విద్యార్థులా రక్షకభటులను చూచి, శిష్యులను వదలిపెట్టి, నీటిలో మునిగి యీది, మరియొక రేవున తేలి యింటికి పోయిరి. ఆ శిష్యులను వెంటబెట్టుకొని పోయి రక్షక భటులు స్వాముల వారితో చేర్చిరి.

ఆ రాత్రి, బడి పిల్లలు స్వాములు వారి శిష్యులను కొట్టి చంపిరనియే పట్టణములో ప్రవాదము పుట్టెను. అందుచేత విధవా వివాహ ప్రతి పక్షులు వీథిలో మొగము చూపుటకే తెగింపలేక పోయిరి. నేనా సమయ మున చల్లగాలి ననుభవించుచు రేవున ఒక పడవమీద కూరుచుండి యుండు టచే, ప్రొద్దుపోయి యింటికి పోవువరకును నాకీ వార్తయే తెలిసినదికాదు. మొదట మాలో చేరియుండినను ఇప్పుడు స్త్రీ పునర్వివాహ నిషేధవాదులకు నాయకుడుగా నుండిన ఒక ప్రబల గృహస్థు ఆ సమయమున నేను కూరు చుండిన తావునకు అనతి దూరముననే కూరుచుండి, ఎవ్వరో ఈ శిష్యుల వార్త చెవిలో చెప్పగానే అధైర్యము పుట్టి తన సేవకుని చేతిలోని దీపము ఆరిపించి, తలనిండ ముసుగువేసికొని, రాజమార్గమున నడువక, సందుల గుండ పోయి యిల్లు చేరి తిరిగి చూచెను. స్వాములవారికి ముఖ్యబలముగా నున్న వారొక్కరును వారి నూరార్పుటకయి ఆ రాత్రి పీఠ దర్శనమునకు రాక, తక్షణమూరువిడిచి పొండని లోక గురువునకు సందేశము పంపిరి. మరునాటి ఉదయమున, విద్యార్థులు విద్యాశాలనుండి రాకమునుపే, స్వాములవారు తమ పీఠమును మా పట్టణమునుండి తరలించి, తాము నదిని తరించి, భిక్షలు చేయింపలేక శ్రమపడుచున్న మా పురము వారిని కూడ తరింపజేసిరి. స్వాముల వారికి సంభవించిన ఈ విపత్తు వలన మా ప్రతిపక్షులకు కొంత గర్వభంగము కాగా, కొంత కాలము వారు మమ్ము అధికముగా బాధింపకుండిరి.

ఇక్కడ మేము మా పాట్లు పడుచుండగా, చెన్నపట్టణములోని మా

స్నేహితులు పల్లె చెంచలరావు పంతులుగారును, దివాన్ బహదూర్ రఘునాధ రావుగారును మా పక్షమును బలపరుపవలెనని పత్రికలలో ప్రకటనలు ప్రచురింపగా, పేరుగలవారు 20, 30 మంది మాతో భోజనము చేయుటకు సంసిద్ధులై యున్నట్టు ఉత్తరములు వ్రాసిరి. హిందూ పత్రికలో ప్రతి వారమును మూడు నాలుగేసి ఉత్తరములు ప్రకటింపబడుచు వచ్చినవి. అధిక సంఖ్య గలవి అంత ప్రోత్సాహకరములుగా నుండకపోయినను, ప్రోత్సాహకరములుగా నున్నవే అప్పటి మా పనికి చాలియుండునట్లు కనబడెను.

మాతో సహభోజనమున కేర్పాటు చేసి మాకు ప్రోత్సాహము కలిగించుటకయి చెంచలరావు పంతులుగారు మమ్మచ్చటకు ఆహ్వానము చేసిరి. నేనా ఆహ్వానము నంగీకరించి ఈస్టరు సెలవులలో నచటికి బోవ నిశ్చయించి వారికి తెలపితిని. మార్చి 12 వ తేదిన మైలాపురమునుండి వారు నాకిట్లు వ్రాసిరి: "రఘునాధరావు ఏప్రిల్ 30 వరకును మా ప్రయాణము నిలుప వలసినట్టు మిమ్ము ప్రార్థింపుమని నన్ను కోరెను. అయినను మీరు వెంటనే రావలెనని నిశ్చయించుకొన్న పక్షమున నేను మిమ్ము మా యింటనైనను పెట్టుకొనెదను, లేదా ప్రత్యేకముగ నొక ఇల్లయినను కుదిర్చెదను."

మా కప్పుడు వేసవి సెలవులారంభమగును గనుకను, కొంతకాల మధికముగానుండి ఉపన్యాసము లియ్యవచ్చును గనుకను, 1881 మే నెలలో పోపుటయే మంచిదని యెంచితిని. ప్రథమ వివాహ దంపతులను వెంటబెట్టుకొని, భార్యా సహితముగా ఒక వంట బ్రాహ్మణునితోడ బైలుదేరి విశాఖపురిలో పొగయోడ నెక్కి, నాల్గవ దినమున చెన్నపట్టణము చేరితిని. చెంచలరావు పంతులుగారు మమ్ము మైలాపురములో కపాలేశ్వరుని ఆలయ సమీపమున మాకయి యేర్పరచిన విశాల గృహమునందు ప్రవేశపెట్టిరి. పంతులుగారు పంపిన గుఱ్ఱపు బండ్లమీద పోయి ఉపన్యాసములిచ్చుచుంటిని. ఒకసారి చాకలిపేటలో ఉపన్యసించుచుండగా మూర్ఖులైన వైష్ణవులు చుట్టుముట్టి నన్ను మర్దింప జూచిరి. కాని నా మిత్రులైన వనప్పాకము అనంతాచార్యులుగారు నన్నక్కడ నుండి తప్పించి తమ బండిలో నెక్కించుకొని దూరముగా కొనిపోయిరి.

ఇంకొకసారి నేను పెద్దినాయనిపేట (Black Town) లో నుపన్యసించుచుండగా పండితులనేకులు చేరి, ఉపన్యాసాంతమున, వితంతువు వివా

హము చేసికొన్నచో దాని పూర్వ భర్తయొక్క శ్రాద్ధము లెవ్వరు పెట్టుదురనియు, ఇట్టివే అనేక ప్రశ్నములు వేసిరి. నేను వానికన్నిటికిని శాస్త్రోక్తములయిన సమాధానములు చెప్పితిని. ఈ విధముగా నన్నోడింపలేక, "మీకు శాస్త్రములయందు విశ్వాసమున్నదా ?" అని ప్రశ్నవేసిరి. "లేదు, ఆత్మరక్షణార్థమును, శాస్త్ర విశ్వాసముగల వారి నిమిత్తమును నేను శాస్త్ర ప్రమాణములను జూపుచున్నాను," అని చెప్పితిని. ఈ సభలకు పూర్వము ఆండర్సన్ హాలులో స్త్రీ పునర్వివాహమును గూర్చి ఉపన్యాస మిచ్చుట కేర్పాటు చేయబడినది. శాస్త్ర ప్రమాణములను కాగితము మీద వ్రాసికొని, చెంచలరావు పంతులుగారి బండిలో వారితో గూడ బైలుదేరితిని. అది మొదటి ఉపన్యాస మగుటచేత, వితంతు వివాహము గూర్చి జనులకు దురభిప్రాయము కలిగింపవలెనన్న దురుద్దేశముతో పండితు లేమేమో వ్రాసి, పెద్ద కాగితముల మీద నచ్చొత్తించి పట్టణమందంతటను పంచిపెట్టిరి. మేము బండిలో పోవుచుండగా నెవ్వడో ఒక కాగితమును బండిలో గిరవాటు వేసెను. నే నది చదువ నారంభించితిని. అందులో రండలు, ముండలు అన్న పదములును, దూషణ వాక్యములును తప్ప శాస్త్ర ప్రమాణములు కానరాలేదు.

క్రైస్తవ కళాశాలలో చేరిన ఆండర్సన్‌హాలు చేరునప్పటికి నేనా కాగితమును ముగింపగలిగితిని. కోపన్యగ్రత చేత నా రక్తము వేడియెక్కి, నా మనసు నా వశముగాక ఉద్రేకింప జొచ్చెను. రెండు గంటల సేపు నోటికి వచ్చినట్లేమేమో చెప్పితిని. పలుమారు కరతాళ ధ్వనులతో సభా భవనమంతయు మారుమ్రోయజొచ్చెను. నే చేసిన ఉపన్యాసమునందు విద్వాంసులు మెచ్చదగిన శాస్త్రాంశము గాని, యుక్తి విశేషములు గాని ఏమియు లేవు. పామరజన రంజకములయిన పరిహాస వాక్యములే విశేషముగా నుండినవి. అయినను, నా ఉపన్యాసములను వినుచు వచ్చిన వారందరును ఇదియే అధిక హృదయాకర్షకమైనదని చెప్పిరి.

వివాదములతో మేము కాలము పుచ్చుచుండగా, ఉపనయనము నిమిత్తము స్వగ్రామమునకు వెళ్లిన దివాన్ బహదూరు రఘునాథరావుగారు చెన్నపట్టణమునకు విచ్చేసిరి. వారును, చెంచలరావు పంతులుగారును కలసి, అవరకు భోజనములు చేసెదమని శూర వాక్యములు పలికిన సంస్కార ప్రియుల కందరికిని నిర్ణీత దినమున సంస్కార భోజనమునకు

దయచేయవలసినదిగా బహు దినములు ముందుగానే ఆహ్వాన పత్రికలను బంపిరి. వానికి బదులు వ్రాయుటకే కొందరు సంస్కార ప్రియులకు తీరిక కాలేదు. పలువురు కార్యాంతర భారములచేత రాలేకపోయినందుకు క్షమార్పణలు చేసిరి. సబు జడ్జీగానుండిన గణపతయ్యగారు ఒక్కరు మాత్రము రాగలిగిరి. అప్పుడు రఘునాథరావుగారును, మిత్రులును కర్తవ్య మాలోచించి, శ్రీ పార్థసారథిస్వామి వారి ఆలయమునుండి ప్రసాదమును తెప్పించి, మాతోడ విందారగించిరి. ఆ విందుకు వచ్చినవారు, వివాహ దంపతులుగాక, రఘునాథరావుగారును, చెంచలరావు పంతులుగారును, గణపతయ్యగారును, దంపూరి నరసయ్యగారును, నున్నవ బుచ్చయ్య పంతులుగారును, నేనును షట్చక్రవర్తులు. విందు ముగిసిన తరువాత చెంచలరావు పంతులుగారు మాకందరికిని విలువ బట్టలను కట్టనిచ్చి, ప్రయాణ వ్యయమునకయి నూరు రూపాయలు రొక్కమిచ్చి వీడ్కొల్పగా, జూన్ నెల నడుమను సుఖముగా మరల రాజమహేంద్రవరము చేరితిమి.

ఇప్పుడు మా సమాజమునకు నిధి లేదు. నెల చందాలు లేవు. కంచి కృష్ణస్వామిరావు పంతులుగారితో మొర పెట్టుకోగా, వారు పరమ దయాళు రయి రామకృష్ణయ్యగారిని ప్రోత్సాహపరచి, దివాన్ బహదూర్ రఘునాథరావుగారిని, పల్లె చెంచలరావు పంతులుగారిని ట్రస్టీలుగా ఏర్పరపించి, జూన్ నెల కడపట 10 వేల రూపాయలను చెన్నపట్టణమునకు పంపునట్లు చేసిరి. ఈ విషయములో మాకు కృష్ణస్వామి రావు పంతులుగారు చేసిన మహోపకారమును మే మెప్పుడును మరువజాలము.

ఈ పదివేల రూపాయలను పంపిన కాలములో మరల వివాహములు జరుగునన్న నమ్మకము రామకృష్ణయ్యగారి కెంత మాత్రము లేదు. ఆయన చెంచలరావు పంతులుగారి పేరను, రఘునాథరావుగారి పేరను వ్రాసిన ఉత్తరములో, రెండు సంవత్సరముల లోపల వివాహములు జరుగని పక్షమున తమ సొమ్ము తమకు పంపివేయునట్లును, వివాహము లయ్యెడు పక్షమున చెన్నపట్టణము సమాజమువారు రెండు వివాహములకు రెండు వేల రూపాయలను వ్యయపరచుకొను నట్లును, వివాహ మొక్కంటికి వేయేసి రూపాయల చొప్పున నా యొద్దకు పంపుచుండ వలసినదనియు, వ్యయముల క్రింద జూన్ నెల మొదలుకొని నెలకు 75 రూపాయల చొప్పున నాకు పంపుచుండ వలసినదనియు వ్రాసిరి.

మేము మరింత ధైర్యోత్సాహములతో పనిచేయ సాగితిమి గాని, మొట్ట మొదట మా కృషి సఫలమగునట్లు కనబడలేదు. అవరకు తమ వితంతు కన్యలకు వివాహములు చేయుడని మమ్ము బతిమాలుకొన్నవారి కడకు పోయి, మేమే బతిమాలుకోగా, మామీద కోపపడి, అనుచిత ప్రసంగములు చేసినందుకు మమ్ము తిట్టసాగిరి. మరి కొందరు మమ్ము తమ యిండ్ల లోనికే రానీయక పోయిరి.

పెద్దిభట్ల యజ్ఞన్నగారును, ప్రాథమిక పాఠశాలలో ఉపాధ్యాయులైన తాడూరి రామారావుగారును రాజమహేంద్రవరము వచ్చి నాతో మాటా డిరి. మొదటివారు తమ చెల్లెలిని వైదిక వరునకిచ్చి వివాహము చేయుట కును, రెండవవారు మాధ్వ వితంతువును వివాహమాడుటకును అంగీక రించిరి. వైదిక వరుడు మా పాఠశాలలోని విద్యార్థి యొకడు సంసిద్ధు డయియే యుండెను. మాధ్వవధువు సహితము లభించినట్లే యుండెను. మాధ్వ గృహస్థుడొకడు, ఉమ్మెత్తాల వేంకటపతిరావు 1882 జూన్ 24 న నాకీ యుత్తరము వ్రాసెను.

"నా కుమార్తె అయిన శనగవరపు లక్ష్మిబాయమ్మకు భర్త చనిపోయి నాడు. సుమారు 16 సం. వయస్సు కలిగియున్నది. మా మతస్థుడైన చిన్నవాడు ఇందుకు అంగీకరించిన పక్షమున, సదరు లక్ష్మిబాయమ్మను నాకు కర్చులేకుండా వివాహం చేయించిన పక్షమున చాలా సంతోషి స్తున్నాను."

కార్యము కావలసివచ్చునప్పటికి బంధువులకు తెలియుటచేత, వేంకట పతిరావుగారును, యజ్ఞన్నగారును కూడా భయపడి వెనుకతీసిరి. వేంకట పతిరావుగారి కూతురును, యజ్ఞన్నగారి చెల్లెలును నాకాపరకే ఉత్తరములు వ్రాసియుండిరి. అందుచేత ఆ బాల వితంతువులతోనే ఉత్తర ప్రత్యుత్తర ములు జరిపి, కార్యమును సాధింపవలెనని నిశ్చయించుకొంటిని. ఒక చిన్నది పెద్దాపురములో నున్నది. ఇంకొక చిన్నది కాకినాడలో నున్నది. వారి పేరనే ఉత్తరములు వ్రాసెడి పక్షమున రహస్యము వెల్లడి అయి, కార్యభంగము కాకమానదు. వితంతు వివాహ సంస్కారము నందు ఆదరముగల వారయి, కార్య దక్షులయిన మిత్రులు గూఢముగా పనిచేయు టకు పెద్దాపురమునందొకరును, కాకినాడయందొకరును కావలసియుండిరి. మా కత్యంత ఆప్తులయిన గుమ్మడిదల మనోహరముగారు పెద్దాపురము

నందు పోలీసు ఇన్‌స్పెక్టరుగా నుండిరి. గవర్రాజుగారు చెన్నపురికి పోవలసిన అవశ్యకము తటస్థింపగా, కాకినాడలో పనిచేయుటకు నేనాయనను నియమించితిని.

1882 ఆగస్టు 24 న కాకినాడనుండి ఆయన ఇట్లు వ్రాసిరి. "లచ్చిరాజు రామారావు మొదలయినవారిని చూచితిని. తన్ను స్వశాఖ వానినెవ్వనికైన వివాహము చేయుమని కోరుచు ఆ చిన్నది మీ పేర వ్రాసిన యుత్తరము వారి యొద్దనున్నది. వివాహ మీ నెలలో జరుపవచ్చునని నేను తలచుచున్నాను. రేపు గాని, వచ్చు శనివారము గాని మీ యొద్దకు పోవలసినదని పెండ్లికుమారునితో చెప్పితిని. మరల నొక్క వివాహము జరిగిన పక్షమున మరికొన్ని జరిగించుట కాశయున్నది. అతి శ్రమపడుచున్నారు గనుక మేధస్సునకు భారము పెట్టకుడు. ఈ పుస్తకమును, ఆ పుస్తకమును భాషాంతరీకరింపవలెనన్న తలంపును కొంతకాలము వరకైనను కట్టిపెట్టుడు. మరెవ్వరైనను వివేకవర్ధనిని జరుపనిండు."

నా మిత్రుడు వ్రాసినట్టు నేననారోగ్య దశలో నుండుటయు, నతి కష్టపడుచుండుటయు సత్యమేకాని నాకప్పుడుండిన కార్యోత్సాహమే నా చేత అనేక కార్యములను చేయింపగలిగినది. వితంతు వివాహ ప్రయత్నమటుండగా, నేను క్రొత్త గ్రంథములను రచించుచుంటిని. వివేకవర్ధని నడుపుచుంటిని.

శాస్త్రి పాఠశాలలోని విద్యార్థులు చందాలు వేసికొని, పుస్తకములను, పలకలను కొని, పగలెల్ల పాటుపడి వచ్చెడు బీదవాండ్ర విద్యాభివృద్ధి నిమిత్తము ఒక విద్యాశాలలో రాత్రి పాఠశాలను పెట్టి పాటుపడుచుండగా ఆ విద్యాశాఖాధికారి రాత్రి పాఠశాల వలదే అని, పుస్తకములు మొదలయిన వానిని స్వాధీనము చేసికొనెను. నా మిత్రులు మొదలయినవారి చేత చందాలు వేయించి, విద్యార్థులు మరియొక చోట రాత్రి పాఠశాలను సాగించెడి ఏర్పాటు చేసితిని.

మనోహరము పంతులుగారి తమ్ముడు గుమ్మిడిదల సాంబశివరావు గారు రాజమహేంద్రవరము నుండి తరచుగా నాన్నగారి యొద్దకు వెళ్లుచు, నా యుత్తరముల నా చిన్నదాని కందజేయుచు, ఆ చిన్నదాని యుత్తరములు నాకు చేరునట్లు చేయుచు, నాకెంతో సహాయుడుగా నుండెను. ఈయనయే ఒకసారి ఆ చిన్నదానిని చామర్లకోటలో పడవ ఎక్కించి తీసికొనివచ్చి

నట్లేర్పాటు చేసెను. కాని ఆ ప్రయత్నము కొనసాగినది కాదు. ఆ చిన్నదియే తన్ను కొనిపోవుటకు వివిధ మార్గములను మాకుపదేశించినది. ఆమె చెప్పిన యుపాయము ననుసరించి పల్లకి మోచువారిని నియమించి, ఇద్దరు భటులను తోడిచ్చి, మా మిత్రులయిన నల్లకొండ కోదండ రామయ్య గారిని, మనోహరముగారికి వ్రాసి యిచ్చిన ఉత్తరముతో, పల్లకిలో పెద్దా పురము పంపి, ఆ చిన్నదానిని రాత్రివేళ సంకేత స్థలములో కలుసుకొని, పల్లకిలో నెక్కించుకొని, తెల్లవారునప్పటికి మా యింట విడుచునట్లు ఏర్పాటు లన్నియు చేసితిమి. ఈ సంగతి ఏలాగుననో ఆ చిన్నదాని బంధువులకు ముందుగా తెలియగా, వారు జాగరూకులయి యుండుటచేతను, అక్కడకు పోయిన మా మనుష్యుల తెలివి తక్కువ చేతను మా వారు పోయిన దారినే వట్టి చేతులతో తిరిగి రావలసిన వారయిరి.

అందుచేత మేము మరి యొక యుపాయ మాలోచించి పరమ నిపుణుడును, మా ముద్రాశాలలో పనిలో నుండిన మునిసామిని పెద్దా పురమునకు పంపితిమి. అతడు మార్గస్థునివలె నటించి, రాత్రి వారి అరుగు మీదనే పరుండి, తన సందేశము నా చిన్నదానికి తెలిపి, నేర్పుతో పని చేసెను. అమావాస్య రాత్రి రెండు జాములకు మబ్బు పట్టి చినుకులు పడు చుండగా తల్లి మొదలైనవారి నేమరచి వీథిలోనికి వచ్చి ఆ చిన్నది, మా మనుష్యునితో తాను వచ్చుటకు సిద్ధముగా నున్న సంగతి తెలిపెను. అతడు వెంటనే ఆ చిన్నదానిని కొని గాఢాంధకారములో వానలో తడియుచు కొంత దూరము పరుగెత్తి, కొంతదూరమా చిన్నదానిని నడిపించియు, కొంతదూరము మోచియు, తెల్లవారునప్పటికి రెండా మడలు నడచి, అక్కడ బండి చేసుకొని, మరునాడు పగలు రెండు జాములకు ఆమెను మా యింటికి చేర్చెను.

ఆ చిన్నది ఇల్లు దాటిన నాలుగైదు నిమిషములకు తల్లి మొదలైనవారు ఆమె తరలిన సంగతి కనిపెట్టి, అన్ని దారులను వెదకి, ఎందును గానక, న్యాయవాదులతో నాలోచించి, తమ నగలెత్తుకొని పారిపోయినదని దొంగ తనము నారోపించి పోలీసు వారి వద్ద ఫిర్యాదుచేసి, ఆమెను పట్టు కొనుటకు ఆ రాత్రియే వారంటు పుట్టించిరి. వారంటు పట్టుకొని పోయెడు భటునితో ముందుగా కాకినాడకు పోయి, నాలుగైదు దినములక్కడ నుండి, రామకృష్ణయ్యగారి ఇండ్లలో నా చిన్నది దాచబడినదేమో విచారించి,

అక్కడ లేదని రూఢిగా తెలిసిన పిమ్మటనే రాజమహేంద్రవరమునకు పోవలసినదని చెప్పి, రహస్యముగా నాకాదినముననే తెలియునట్లు మనుష్యుని పంపెను.

ఆ సమాచారము తెలియరాగానే, వారంటు తప్పించుటకయి నేను పోలీసు సూపరింటెండెంటుగారి కార్యస్థానమునకు పోగా, అయన కాకినాడ పోయినట్టు తెలిసినది. ఇంటికి వచ్చి చిన్నదానిని భద్రపరచి, పోలీస్ ఇన్స్పెక్టరును కలసికొని, నేను మరల వచ్చు పర్యంతమును వారంటుమీద చిన్నదానిని పట్టుకొనకుండునట్టు దిట్టపరచి, మరునాటి మధ్యాహ్నమునకు కాకినాడ చేరి, చామర్లకోటకు పోవనున్న దొరగారిని కాలువమీది పడవలో సందర్శించి సంగతి విన్నవించితిని. ఆ చిన్నదానిని పట్టుకొనకుండ పోలీసు ఉద్యోగస్థులకుత్తరువు పంపెదనని చెప్పి నన్ను పంపివేసెను.

నేనాయన యొద్దనుండి తిన్నగా హిందూ పాఠశాలకు పోయి, అక్కడ ఉపాధ్యాయుడుగా నున్న పెండ్లికుమారుని కలిసికొని, నా వెంట రమ్మని పిలువగా అతడీ యభియోగవార్తను వినుట వలనను, భీతివలనను నా వెంట రాకుండుటకయి కొన్ని సాకులు చెప్ప మొదలుపెట్టెను. నేనన్నిటికి తగిన పరిహారములు చెప్పి, నేనాతని పడవ వద్దకు బలవంతముగా తీసికొనిపోయి నా గదిలో కూరుచుండబెట్టుకొనగా, నామాట తీసివేయ లేక నాతో వచ్చి, మరునాడు తెల్లవారిన తరువాత మేడపాడు వద్ద పడవ దిగి వెనుకకు పారిపోయెను. నేను మాత్రము రాజమహేంద్రవరముచేరి, కాకినాడలోని మిత్రులకు తంత్రీ వార్త నిచ్చి, వరుని మరల పంపుటను గూర్చి ఉత్తరములు వ్రాసితిని.

పెండ్లికుమార్తె మీది యభియోగము ఆమె వివాహము చేసికొన బోవు చున్నదన్న ద్వేషముచేత తెచ్చినట్టు కనబడుచున్నందున ఆమెను పట్టుకొన వలదని పోలీసువారికి సూపరింటెండెంటు వద్దనుండి ఉత్తరవు వచ్చెను. నేను రాజకీయ వైద్యుని మా యింటికి పిలిపించి, వధువును పరీక్షింపించి వధువు 6 ఏండ్లు దాటినదని సర్టిఫికేట్ పుచ్చుకొంటిని. 1882 అక్టోబరు 22 న బహు కష్టము మీద మూడవ వితంతు వివాహము చేసి ఈశ్వరాను గ్రహమున నిర్వహింపగలిగితిమి. ఈ వివాహమునకు మాకు మొదటి వివాహమునకు కంటె పదిరెట్లెక్కువ ప్రయాసమైనది. విశేష ధన

వ్యయముచేసి ఈ వివాహమును మొదటిదాని కంటెను అధిక వైభవముతో జరిపితిమి. ఈ వివాహముతోనే ప్రతి పక్షుల గర్వము సగమడగెను. కాని తరువాత జరిగిన నాల్గవ వివాహముతో వారికి పూర్ణముగా గర్వభంగ మయినది.

అక్టోబరు 24 వ తేదీని కలకత్తానుండి ఈశ్వరచంద్ర విద్యాసాగరుల వారిట్లు వ్రాసిరి: "My dear Sir, I am very much obliged to you for the information respecting the celebration of marriage of the third Brahman widow in your part of the country. The friends of the marriage of Hindu widows here have been exceedingly delighted by this happy news. May uniform success attend your benevolent exertions on behalf of the unhappy sufferers is the earnest prayer of.

Yours sincerely,
**Iswara Chandra Sarma.**

కాకినాడలోని బాలవితంతువు తానుకూడ వివాహము చేసికోవలెనని ఎంతో అభిలాష పడుచుండెను. ఆ చిన్నదాని యింటి యెదుటనున్న యింటిలో తంజావూరి చలపతిరావుగారను పెద్ద మనుష్యుడు కాపుర ముండెను. ఆయన వితంతు వివాహములయందు విశేషాభిమానము గల వాడగుటచే, ఆ చిన్నది తమ యింటికి ఒంటరిగా వచ్చినప్పుడు వివాహ ప్రసంగమును తీసికొనిరాగా ఆమె తన అభీష్టమును తెలియబరచెను. ఆ చిన్నదాని విషయమై పనిచేయవలెనని ఆయననే మేము కోరితిమి.

ఆ చిన్నది ఒకనాటి ప్రాతఃకాలమునందొంటిగా ఆయనను కలిసికొని, ఆ రాత్రి పెండ్లివారు తమ వీధినుండి ఊరేగునప్పుడు తనకీవలకు వచ్చుట కవకాశము కలుగుననియు, అప్పుడు తన్ను తీసికొనిపోవు ఏర్పాటు చేసిన పక్షమున రాజమహేంద్రవరము వెళ్లుదుననియు చెప్పెను. ఆయన అప్పుడే మూడవ వివాహము చేసికొన్న మా మిత్రునితో కలిసికొని, పల్లకిని బోయీలను సిద్ధముచేసి, పల్లకి వద్దకు తీసికొనిపోవ నియమించిన మనుష్యుని ముందుగా ఆ చిన్నదానికి చూపెను.

ఆ రాత్రి 9 గంటలకు ఒక చోట అద్భుతమైన మాజిక్ చూపబడునని ప్రకటన పత్రికలురాగా, చలపతిరావుగారు ఆ చిన్నదాని అన్నను, మేన మామలను దానిని చూచుట కొడబరిచెను. సుమారు రాత్రి 10 గంటల

వేళ పెండ్లి యూరేగింపు వారి యింటి ముందు నుండి సాగెను. నియమించ బడిన మనుష్యుడు పెండ్లి పల్లకితో నడచుచుండెను. పెండ్లి పల్లకి తమ యింటి ముందుకు రాగానే లోపలివారు గుమ్మము ముందు నిలుచుండి వేశ్యల నృత్య గానములను చూచుచుండగా, ఆ చిన్నది సందడిలో వెలుపలికి వచ్చి, తన రాకకయి ఎదురుచూచుచుండిన మనుష్యుని వెంట నడచి, పల్లకిలో కూరుచుండెను. తక్షణమే పల్లకి మోచువారు చిన్నదానిని కొని బైలుదేరిరి. తెల్లవారునప్పటికి పల్లకి వచ్చి మా గుమ్మములో దిగగా మేమా చిన్నదానిని లోపలికి తీసుకొనిపోయి భద్రముగా నుంచితిమి.

ఆ చిన్నదాని మేనమామలా రాత్రియే, ఆ చిన్నది రాజమహేంద్ర వరము పోయినదని నిశ్చయించి, అక్కడ తాహశ్శీలుదారుగా నున్న తమ బంధువుకు పోలీసువారికి తంత్రి వార్తలు పంపిరి. కాని ఎవ్వరును జోక్యము కలిగించుకొనక యూరకుండిరి. చిన్నదాని అన్నయు, తల్లియు, మేన మామలలో ఒకడును మూడవనాటి మధ్యాహ్నము మా యింటికి వచ్చిరి. తల్లి రోదనముచేసి, కుమారితను తమ వెంట రమ్మని బతిమాలుకొనెను గాని, చిన్నది స్థిర చిత్తురాలయి నిరాకరించెను. మేనమామ నన్ను చాటునకు పిలిచి, మంచి వరుని విచారించి వివాహము చేయవలసిన దని చెప్పి, అప్పను, మేనల్లుని వెంటగొని వెడలిపోయెను. ఆమె అన్న గారు ఆవరకు నాతో అనేక పర్యాయములు మాటాడి ఉత్తరములు వ్రాసిన వాడే యైనను, బహిష్కార పత్రికలు వచ్చిన తరువాత జడిసి, సాహసింప లేకపోయెను.

పులవర్తి శేషయ్య అను వైదిక విద్యార్థికి ఆ చిన్నదానిని 1883 జనవరి 3 న వివాహము చేసితిమి. ప్రజాక్షేమ కార్యముల యందుత్సాహము కలిగి, నాకు సహాయములుగా నుండిన విద్యార్థులలో నితడొకడు. తరువాత పదవ వివాహము చేసికొన్న నల్లకొండ కోదండరామయ్యగారింకొకడు. ఇటువంటి విద్యార్థులకనేకులకు పాఠశాల జీతములు మొదలయినవి యిచ్చి, సాయము చేయుచుండెడి వాడను. ఆ కాలమునందు విద్యార్థులు మాకు చేసిన సాయమును నేనెన్నటికి మరువజాలను. కొందరు లోకోపకార కార్యార్థమయి అగ్ని హోత్రములో దూకమన్నను వెనుదీయని వారు. ఏ కార్యమును చేసికొని రమ్మన్నను మారుమాటడక చెప్పినట్లు చేసికొని

వచ్చుచుండిరి. ఇటువంటివారి తోడ్పాటువలననే మేమనేక కార్యములు నిర్విఘ్నముగా నిర్వహింప గలిగితిమి.

బాల వితంతువులతోను, వితంతు సంరక్షకులతోను మాటాడి, ప్రోత్సాహపరచి, సంస్కార వ్యాపకము చేయు నిమిత్తమయి నెలకు 8 రూపాయలు జీతమేర్పరచి సంచార వెంకన్నగారిని నియమించితిని. ఆయన, ఈ వితంతువుతో మాటాడితిని, ఆ వితంతువుతో మాటాడితిని, ఈ సంరక్షకుని, ఆ సంరక్షకుని ప్రోత్సాహ పరచి ఒప్పించితిని అని చెప్పుచు అక్టోబరు నుండి నావద్ద మూడు నెలల జీతము పుచ్చుకొనెను. ఆ వితంతువు మాట, ఈ వితంతువు మాట అటుండగా, 18 ఏండ్ల ప్రాయము గల ఆయన కూతురే నాల్గవ నెలలో మా యింటికి పరిగెత్తుకొని వచ్చి తనకు పతిభిక్ష పెట్టుమని నన్ను వేడుకొనెను. తండ్రి కొమారిత వెంటనే పరిగెత్తుకొని వచ్చి విలపించుచు, తన కొమారితను పంపివేయ వలసినదనియు, తనకు వంటచేసి పెట్టుటకు వేరు దిక్కులేరనియు వేడు కొనెను. వంటచేసి పెట్టుటకు వేరొక పనికత్తెను కుదుర్చుకోవలసినదనియు లేకపోయిన యెడల ఉద్యోగములో నున్న కొడుకు వద్ద నుండవలసిన దనియు హితము చెప్పి, పనినుండి తొలగించి, కుమారితను మాయింటనే ఉంచుకొని, ఆయనను పంపివేసితిని.

ముంజులూరి వెంకట్రామయ్యగారు ప్రాయశ్చిత్తము చేసికొని వెడలి పోవునప్పుడు, 20 ఏండ్ల వయసుగల తన తమ్ముని మా యింట దిగవిడిచి పోయిరి. నేనాతని ముద్రాక్షరశాలలో అక్షరములు కూర్చు పనిలో పెట్టి, నెలకు 6 రూపాయ లిచ్చుచుంటిని. గోపాలమను పేరుగల ఈతడు తనకు వివాహము చేయవలసినదని నన్ను తొందర పెట్టుచుండెను. అతనికి 8 రూపాయలు జీతము చేసి, 1883 జనవరి 30 న, కొత్తగా వచ్చిన వితంతువు నాతనికి పెండ్లిచేసితిని.

ఆ సంవత్సరము గోదావరి పుష్కరము. ఆవరకు తలవెంట్రుకలున్న బాల వితంతువులను సంరక్షకులు రాజమహేంద్రవరము తీసికొని వచ్చి, గోదావరీతీరమున శిరోజములు తీయించి, విరూపిణులను చేయుదురు. ఆ యాచారమును బట్టి 17 ఏండ్ల గల ఒక వైదిక వితంతువును తల్లియు, అన్నగారును రాజమహేంద్రవరమునకు తెచ్చి, గోదావరి యొడ్డుననున్న సత్రములో దిగియుండిరి. తెల్లవారిన శిరోజములు తీయింతురనగా, ఆ రాత్రి

ఎట్లో ఆ చిన్నది తనవారి నేమరించి తప్పించుకొని వచ్చి నన్ను శరణు జొచ్చెను. తన ప్రస్తుతావస్థను బట్టి ఎంత బీదవానినైనను వివాహము చేసికొనను సంసిద్ధురాలనని ఆ చిన్నది నన్ను దీనముగా వేడుకొనెను.

మా పాత పురోహితుడు ప్రాయశ్చిత్తము చేసికొని పారిపోగా విధురుడైన చెలుకూరి నారాయణమూర్తి యనునతని పురోహితునిగా నేర్పరచుకొంటిమి. ఆ దినమున 23 సం. ప్రాయముగల ఆతని మేనల్లుడొకడు అమలాపురము నుండి రాజమహేంద్రవరము మీదుగా కాకినాడ పోవుచు, మేనమామను చూడబోయెను. మేనమామ వితంతు వివాహము చేసికొమ్మని ప్రోత్సహింపగా నతడంగీకరించెను. క్రొత్తగా వితంతువు వచ్చినదని విని మా పురోహితుడు, ఆమెను తానైనను, తన మేనల్లుడైనను వివాహము చేసికొనవచ్చునని ఆలోచించి, తన మేనల్లుని వెంటబెట్టుకొని నా వద్దకు వచ్చి తన అభిమతమును తెలుపగా, నేనా చిన్నదానికి వారిరువురను చూపి, "ఇతడు పురోహితుడు, ఇతడు వంట బ్రాహ్మణుడు, వీరిలో నెవరినైన పెళ్లియాడుట కిష్టమున్నదా?" అని అడిగితిని. పడుచువాడైన రెండవ వానినే చేసికొనెదనని ఆమె చెప్పెను. నేను శతమానము చేయించి ఆ రాత్రియే వారికి వివాహము చేసితిని. ఆరవది అయిన ఈ వివాహము 1883 మార్చి 13 న నడచినది.

అయిదవ వివాహమునకు వంట బ్రాహ్మణుడు లేచిపోగా నా భార్యయే గోదావరి నుండి నీళ్లు తెచ్చి, వంట మొదలైన పనులెల్లను చేసి ఎంతో కష్టపడవలసినదయ్యెను. ఈ కార్యములయందు నావలెనే నా భార్యయు బద్ధాదరము కలదయి, సర్వ కష్టములును సంతోష పూర్వకముగా సహించి, నన్ననుసరించుచు, సహధర్మచారిణి అన్న పేరు అన్వర్థము చేయుచుండెను. వంటలు మొదలైనవి చేయగలిగిన శ్రోత్రియ బ్రాహ్మణునకే ఈ వివాహముచేసి, వంట బ్రాహ్మణుల బెదిరింపులను తప్పించుకో గలిగితిమి.

బ్రాహ్మణులలో వివాహములు తరచుగా జరుగుచుండుట విని ఒక వైశ్య వితంతువు తన కొమార్తెయైన 10 ఏండ్ల బాల వితంతువును తీసికొని వచ్చి పరిణయము చేయవలసినదని నాకాళ్లమీద పడవైచెను. వివాహము చేసికొనెదనని నావద్ద తిరుగుచున్న 20 ఏండ్ల యీడుగల బోడా శ్రీరాములను కోమటి చిన్నవానికిచ్చి ఆ చిన్నదానిని 1883 ఏప్రిల్ 11 న

వివాహము చేసితిని. ఇదియే మొదటి వైశ్య వితంతువు వివాహము. పల్లకి చుట్టును రక్షక భటులున్నను రాళ్లురువ్విన కాలముపోయి, ఏడవది అయిన ఈ వివాహము జరుగునప్పటికి విద్యార్థుల సాయము తక్క రక్షక భటుల సాయ మక్కరలేకయే దంపతులను రాత్రి వేళ నిర్భయముగా వీథుఁగుండ నూరేగింపగల కాలము వచ్చినది.

రాజమహేంద్రవరములో వెంబడి వెంబడిగా వివాహములు జరుగు చుండుట చూచి చెన్నపురములోని మా మిత్రులు పల్లె చెంచలరావుగారును, దివాన్ బహదూరు రఘునాథరావుగారును ఒకటి, రెండు వివాహములు చెన్నపట్టణములో జరపవలసినదని కోరిరి. నేను వారి యాజ్ఞను శిరసా వహించి చెన్నపట్టణములో వివాహము చేయుటకు ప్రయత్నించెదనని వ్రాసితిని.

రాజమహేంద్రవరములోని బ్రాహ్మణ విద్యార్థి యొకఁడు క్రొత్తగా పెండ్లి చేసికొని కాలధర్మము నొందెను. అతని అప్పగారు అప్పుడప్పుడు మా యింటికి వచ్చుచుండెను. ఆమె నొకసారి, మీ తమ్ముని భార్య ఎక్కడనున్నదని అడుగగా, గుంటూరు మండలములోని ఒక పల్లెయం దున్నదని చెప్పి, తన మరదలు మాత్రమేగాక ఆమె చెల్లెలు సహితము విధవ యయ్యెనని చెప్పెను. వారికి వివాహము చేయింపరాదా అని అడుగగా, తనకు ప్రయాణ వ్యయములును, కొంత బహుమానమును ఇచ్చిన, పిల్లల తల్లితో మాట్లాడి తీసికొని వచ్చెదనని చెప్పెను. నేనంగీక రించి దారి బత్తెము నియ్యగా ఆమె తల్లిని కొనివచ్చెను. తల్లితో మాటాడి, ఆమె అంగీకారమును బడసి ఇద్దరు వితంతు కన్యలను పిలిపించితిని.

తణుకు చలపతి రావనునతఁడు, బేతపూడి ప్రకాశరావను నతఁడును ఇద్దరు వరులా వరకే మా యింట నుండిరి. బాల వితంతువులలో పెద్ద దాని వయస్సు 12 ఏండ్లు, చెల్లెలి వయసు 10 ఏండ్లు. ఈ వధువుల నిద్దరిని నా యొద్దనున్న వరుల కిచ్చి చెన్నపట్టణములో వివాహములు చేయ నిశ్చయించి, అక్కడి మిత్రద్వయమునకీ శుభ వార్త తెలిపి, ఇద్దరు వరులు, వధువులు, పురోహితుడు, వంట బ్రాహ్మణుడు మొదలైన వారిని వెంట బెట్టుకొని, భార్యా సహితముగా పొగ యోడ నెక్కుటకు నేను కాకి నాడ వెళ్లితిని. రఘునాథరావుగారు అవరకే తమ శాఖవారు వంట చేసిన గాని భోజనము చేయనని వ్రాసిరి. అందుచేత కాకినాడలోనున్న మాధ్వ

దంపతులను గూడ ప్రయాణము చేసితిని. నా ఉత్తరమందగానే చెంచల రావుగారు, రఘునాథరావుగారి ఉత్తరమందు వరకు రావలదని కాకినాడకు తంత్రీ వార్త పంపిరి. అందుచేత మేము నాటి పొగయోడను విడిచిపెట్టి వారము దినములు కాకినాడలో నిలువవలసి వచ్చినది. రఘునాథరావుగారి వద్ద నుంచి వచ్చిన ఉత్తరమిది:

"My dear sir,

We convened an extraordinary meeting of the members of the association. 30 members attended of whom 18 were Brahmins. They are all willing to attend the marriage and take betel-nut. As regards dining of course, Sudra members have no objection which is not of much use to us. Of the Brahmin members very few are willing to dine. . . . it seems to us that it would be unwise to celebrate the marriage at Madras. If you, however think that the scanty attendance is of no consequence, you are welcome and we can easily arrange a house."

ఈ యుత్తరము రాగానే ప్రత్యుత్తరము వ్రాసి, జూన్ 2 న, "పదమున్గురము నేటి ధూమనౌకలో బయలుదేరుతున్నాము. ఇల్లు కుదుర్చుడు" అని తంత్రీవార్త పంపి, నాటిసాయంకాలము పొగయోడలో బైలుదేరితిమి. 4 వ తేదీ ప్రాతఃకాలమున చేరవలసిన నౌక, చెన్నపురికి మధ్యాహ్నము 2 గంటలకు చేరెను. మా కొరకు ఓడలోని కెవ్వరు రాలేదు. మేమే పడవ మాటాడి ఒడ్డున దిగితిమి. అక్కడ సహితము మా నిమిత్త మెవ్వరును వేచియుండలేదు. ఇల్లు కుదిర్చిరో లేదో, మేమేమి చేయవలెనో, ఎక్కడకు పోవలెనో తెలిసినదికాదు. మా వారినందరిని అక్కడనే నిలిపి, సమీపముననేయున్న చెంచలరావు పంతులుగారి కార్యస్థానమునకు పోయి, మా యవస్థను తెలిపితిని. ఆయన అద్భుతపడి, జరిగిన పనికి మిక్కిలి నొచ్చుకొని, రఘునాథరావుగారి ఇంటి ప్రక్కనే యిల్లు కుదుర్చబడెనని చెప్పి, ఒక భటునిచ్చెను.

ఆ యిల్లు విశాలమైనదే గాని కొన్ని నెలలు పాడుబడియుండిన దగుట చేత గబ్బిలముల పెంటతోను, ఎలుకలు త్రవ్వినమంటి రాసులతోను వాసార్హము కాకయుండెను. మేము వస్తుసామగ్రిని తెప్పించుకొని, యిల్లు

బాగుచేసుకొని, వంటచేసుకొని భోజనములు చేయునప్పటికి రాత్రి 8 గంటలయినది.

వచ్చిననాడు రఘునాథ రావుగారి దర్శనము కాలేదు. మరునాటి ప్రొద్దున వారి దర్శనము చేయుటకయి పోయితిని గాని, వాకిట నున్న భటులు సమయము కాదని చెప్పినందున వెనుకకు మరలవలసిన వాడ నయితిని. రెండవ నాడు మరల చూడబోయినప్పుడు వారి భటులు రాయల వారు జపములో నున్నారనియు, చూచుటకు సమయము కాదనియు వారించినందున మరల మా యింటికి పోయితిని. 7 వ తేదీన నే నెప్పటి యట్ల వారి దర్శనార్థ మరుగగా కావలి భటులు వెనుకటి సాకులనే చెప్పిరి. కాని, వారి మాటలను గణన చేయక లోపలికిపోయి, మేడ యెక్కి వారు కూరుచుండు స్థలమునకు పోయితిని.

నన్ను చూచి లేచి ఎదురుగా వచ్చి, నన్ను కొనిపోయి ఉచితాసనమున కూరుచుండ బెట్టి, నా రాక తాము వింటిమనియు, తొందర పనులచేత మూడు దినముల నుండియు నన్ను చూడలేక పోయినందుకు చింతిల్లు చుంటి మనియు పలికి క్షమార్పణము చేసిరి. నేను వచ్చిన కార్య విష యమునందుకొని, రేపటి దినము వివాహము జరుపుటకు నిశ్చయించుకొంటి ననియు, ఆహ్వాన పత్రికలను వారి పేర పంపుట కిష్టపడని యెడల నా పేరనే పంపెదననియు స్పష్టముగా చెప్పితిని. వారించుక సేపాలోచించి యాహ్వాన పత్రికను వ్రాసి తమ చేవ్రాలు చేసి, నేనుండగానే తమ ముద్రా యంత్రమునకు పంపిరి. పోయిన పని అగుటచేత వారిని వీడ్కొని ఇంటికి వచ్చితిని. చెంచలరావు పంతులుగారు ప్రతి దినమును వచ్చి నాతో మాటాడి పోవుచునే వచ్చిరి. ముద్రింపబడిన ఆహ్వాన పత్రికలలో రఘు నాథరావుగారి పేరు కానబడలేదు. వివాహమునకు విజయము చేయుటకు సమాజము వారిచే ఎల్లవారును కోరబడుచున్నారని ప్రకటింపబడినది. పట్టణములో పత్రికలకును, మిత్రులకును తగు మనుష్యులకును వారే ఆహ్వాన పత్రికను పంపిరి. పందిళ్లు వేయించుట, తోరణములు కట్టించుట మొదలైనవాటి నన్నిటిని రఘునాథరావుగారే చేయించి, పాత్ర సామగ్రిని, భోజనపదార్థములను పుష్కలముగా సమకూర్పించిరి.

చెన్నపురి చేరిన తరువాత పెండ్లికూతురు తల్లి తన రెండవ కుమార్తెను ప్రకాశరావుగారి కిచ్చి చేయుట కంగీకరింపనందున ఒక్క వివాహము

మాత్రమే చెన్నపట్టణములో జరిగినది. వితంతు వివాహము జరుగుటకు చెన్నపట్టణములో నిదియే ప్రథమ మగుటచేత జనులపరిమితముగా వేడుక చూడ వచ్చిరి. పెద్దమనుష్యులు సహితము విశేషముగా దయచేసి, అమితోత్సాహమును గనబరిచిరి. 1883 జూన్ 8 న నారంభించబడిన ఈ వివాహ మహోత్సవము 12 తేదీతో సంతోషకరముగా సమాప్తమయినది.

అగస్టు 13 న రెండవ కోమటి వివాహము జరిగినది. ఇది తొమ్మిదవ వివాహము. 1883 డిసెంబరునందు ఒక వృద్ధ వైదిక వితంతువు నాయొద్దకు వచ్చి, తన సంరక్షణలో 13 ఏండ్ల ప్రాయముగల వితంతువైన మనుమరాలున్నదనియు, తల్లిదండ్రులులేని ఆ చిన్నదానికి వివాహముచేసి, తాను కూడ మనుమరాలి యొద్దనే ఉండెదననియు చెప్పెను. నేను పులవర్తి శేషయ్యాగారిని వెంటనిచ్చి అమెతో కూడా తాటిపాకకు పంపితిని. పిల్లను, ముత్తవ తల్లిని రాత్రివేళ నొరులెరుగకుండ, వారి వస్తువులను మోచుకొని వచ్చుటకు కూలివానిని సంపాదించుట కష్టమైనందున, కార్యసాధనమే ముఖ్యముగా చూచుకొని, కావడిని కొని, కొన్ని క్రోసుల దూరము తానే మోసుకొనివచ్చి శేషయ్యాగారే వారిని మా యింటికి తెచ్చెను. 1884 జనవరి 5 న నల్లగొండ కోదండరామయ్యగారి కిచ్చి చేయబడినది ఈ చిన్నదే. వరుడు ప్రథమ శాఖవాడు, వధువు వైదిక శాఖ సంభవ. శాఖా భేదము పాటించక చేసిన వివాహములలో నిదియే మొదటిది. ప్రథమ వివాహము చేసికొన్న దంపతులకు దక్క తక్కినవారి కందరకు కాపురములుండుటకు గృహము లీయబడుచు వచ్చినవి.

1884 ఏప్రిల్ న మచిలీ (బందరు) నుండి చెరువు సుబ్రహ్మణ్య శాస్త్రి, న్యాయవాది, కొన్ని ఉత్తర ప్రత్యుత్తరములు జరిపిన మీదట, తాను వితంతు వివాహము చేసికొనుటకు సంసిద్ధుడయి యున్నాననియు, తనకు ధన సహాయమక్కర లేదనియు, మరియొక వధూవరులకు ధన సహాయము కావలసియున్నదనియు వ్రాసెను.

మిత్రులు పోవలదని హితబోధ చేసినను, వ్యాధి బాధచేత దుర్బల శరీరుడనైయుండియున్నను, ఎండలు దుస్సహములై అతి తీక్షణముగా నుండినను, సంస్కార బీజము నితరస్థలములలో నాటుట కవకాశము కలిగినప్పుడు ఉపేక్షించుట ధర్మము కాదని భావించి, వచ్చుచున్నానని

సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి వ్రాసి, మండువేసవిలో ఇసుకదారిని మోటు బండ్ల మీద కుటుంబ సహితముగా బైలుదేరి బందరునకు ప్రయాణమైతిని.

బందరు పురము మేము చేరునప్పటికి, నా రాకముందే తెలియుటచేత, పౌరజన వారధి యంతయు కలగి అల్లకల్లోలముగా నుండెను. తన పట్టణములో గత భర్తృక పాణిగ్రహణమునకు ప్రథముడుగా నుండెదనని వ్రాసిన బ్రాహ్మణ ధీరుడు, బాల వితంతు పరిణయము మాట అటుండగా, నేను వెదకుకొనుచు తమ యింటికి పోయినప్పుడు నాతో బహిరంగముగా మాటాడుటకే భయపడి, నన్ను చాటునకు కొనిపోయి, తానప్పుడు రోగ పీడితుడయి యుండుటచేత వివాహ ప్రయత్నమప్పటికి విడిచితిననియు, తాను స్వస్థపడి పునః ప్రయత్నమును చేసినప్పుడు వ్రాసెదననియు చెప్పెను.

నేనంతటితో ఆశాభంగము చెందక, పట్టణమునకు వచ్చినందుకు కొన్ని ఉపన్యాసము లిచ్చుటకు నిశ్చయించుకొంటిని. నా మొదటి ఉపన్యాసము వల్లూరు జమీందారుగారి విశాల సభా భవనమందు చేసితిని. నా ప్రథమోపన్యాసము వినవలెనన్న కుతూహలముచేతను, నా మొగమెట్లుండునో చూడవలెనన్న అభిలాషచేతను సభా భవనమంతయు మనుష్యులతో క్రిక్కిరిసి పోయినది. ఎల్లవారును కడవరకును నా యుపన్యాసమును నిశ్శబ్దముగా వినిరి.

పట్లమన్నాటి వేంకటాచలము పంతులుగారా పట్టణములో వితంతు వివాహ ప్రతిపక్షులకు ప్రధాన నాయకులు. వారు ఒక గొప్ప పండితుని చేత నా వితంతు వివాహ విషయిక విజ్ఞాపనముల మీద నొక ఖండన గ్రంథమును వ్రాయించిరి. నేను వేంకటాచలము పంతులుగారి దర్శనార్థమయి ఒకనాటి ప్రాతఃకాలమున వెళ్ళినప్పుడు వారు జపము చేసికొనుచుండి, నన్ను లోపలికి రప్పించుకొని, తమ సరసను కూర్చుండబెట్టుకొని, పొడిమాటలతో ప్రయోజనములేదనియు శాస్త్రార్థవిచార మావశ్యకమనియు, పండిత సభ జరుగుట కర్తవ్యమనియు సెలవిచ్చిరి. నేనును వారితో నేకీభవించి, చిన్న సభలో శాస్త్ర విషయక వాద ప్రతివాదములు జరుపుటయే లాభకరమని చెప్పితిని.

వారందు కొప్పుకొని, మరునాటి మధ్యాహ్నమున తమ చావడిలోనే సభ ఏర్పరచి, ఉభయపక్షములలోని పెద్ద మనుష్యులకును, విద్వాంసులకును

ఆహ్వానములు పంపెను. ఖండన గ్రంథము చేసిన శాస్త్రుల వారు పండిత పక్షమున వాదము చేయుటకు నా యెదుటను కూరుచుండిరి. కలియుగమునకు పరాశరస్మృతి పరమ ప్రమాణ మయినందున, "నష్టేమృతే" అను శ్లోకము యొక్క అర్థ నిర్ణయ మొక్కటే ప్రథమ కర్తవ్యమని నేను చెప్పగా శాస్త్రులవారు నాతో ఏకీభవించి, ఆ శ్లోకమున కర్థము చెప్పనారంభించిరి. నేను వారు చేసెడి అర్థములను పూర్వపక్షము చేయ నారంభించితిని. పావుగంటసేపు శాస్త్రార్థవిచారము నడచిన పిమ్మట శాస్త్రులవారు క్షణకాల మూరకుండి, సభవారివంక తిరిగి "అయ్యా, వీరు తమ జీవితము నిందులో ధారపోసి విశేష కృషి చేసినారు. నాకు కొంతకాలము గడు విచ్చినగాని వీరితో వాదము చేయజాలను," అని యూరకుండిరి. అనేక పండితులతో అనేక స్థలములయందు వాదము చేసితినిగాని, తమ అశక్తి నొప్పుకొని, సత్యమునందాదరము చూపినవారిని వీరిని దక్క మరి ఎవ్వరిని నేను చూడలేదు.

బందరునుండి మరలి రాగానే నేను మిత్రులతో నాలోచించి, 1884 జూన్ 22 న, స్త్రీ పునర్వివాహ పక్షాభిమానులయిన మిత్రులను సమకూర్చి క్రొత్త సమాజము నొకదాని నేర్పాటు చేసితిని. ఈ నూతన సమాజము రామకృష్ణయ్యగారును, నేనును, గవర్రాజుగారును, ఆత్మూరి లక్ష్మీనరసింహముగారును, న్యాపతి సుబ్బారావు పంతులుగారును చేరి పదునారుగురు సామాన్య సామాజికులతో ఆరంభమయినది. ఇది పూర్వ సమాజముయొక్క అనుబంధమే అయినట్టును, సమాజమువారి ఆదరణ క్రింద వివాహము చేసికొన్న వారందరును సామాజికులుగా పరిగణింపబడునట్టును ఏర్పరుపబడినది. 7 గురు కార్య నిర్వాహకసంఘముగా నుండుటకును, వారిలో 6 గురు సామాజికుల చేతను, ఒకరు వివాహములు చేసికొన్న వారిచేతను ఏటేట ఎన్నుకొనబడుటకును నిర్ణయము జరిగినది.

రఘునాథరావుగారును, చెంచలరావుగారును పెండ్లిలో భోజనములు చేయకపోయినను, చెన్నపురిలోని 8 వ వివాహానంతరము కులము వారైన మాధ్వులు వారిని బాధింపనారంభించిరి. వారి ఆచార్యుడైన ఉత్తరాది మఠస్వామి చెన్నపురికి వచ్చి, కొంతకాల మచ్చట వాసమేర్పరచుకొనిరి. తామొక దుర్బల విషయములో ప్రాయశ్చిత్తమునకు లోనుగావలసి వచ్చినదనియు, తాము రఘునాథరావు, చెంచలరావు యథాపూర్వముగానే

వితంతూద్వాహ పక్షమునకు సాయము చేయుచుండెదమనియు నా పేర చెంచెలరావు పంతులుగారు లేఖ వ్రాసిరి. ఈ విషయము నేను రఘునాథ రావుగారి పేర వ్రాసితిని గాని, వారు ప్రత్యుత్తర మియ్యననుగ్రహించిన వారు కారు.

ఆ సంవత్సరము శీతాకాలపు సెలవులలో నేను మరల చెన్నపట్టణము నకు పోయి రఘునాథరావుగారి దర్శనము చేసితిని. వారు నన్ను చూసి, "నేను ప్రాయశ్చిత్తము చేసికొంటినని మీకు వ్రాసిన బుద్ధిహీనుడెవ్వడు? మా స్వామి ఇప్పుడిక్కడనే ఉన్నాడు. ఈ సమయమునందొక్క పెండ్లి వారు కుదిరిన, వాని ఇంటి ఎదుటనే పెండ్లి చేసి వానికి బుద్ధివచ్చునట్లు చేసి యుందును," అని పండ్లు గీటుచు, పిడుగులు పడునట్లు శీరాలాపములు పలికిరి. శూరత్వము మూర్తీభవించినట్లున్న వారి ఆకారము చూచి, వారి వాక్యార్థము వినినప్పుడు మేను గగురుపొడవ, వీరికున్న యుత్సాహ ములో నాకు పాతికవంతుండిన నేనెంతో పని చేసి యుండవచ్చును గదా అని నాలో నాకే లజ్జవొడమ దొడగెను.

నేనింటికి వచ్చునప్పటికి కొందరు విద్యార్థులు నన్ను చూడవచ్చి, "ఒక వృద్ధ బ్రాహ్మణుడు మీకొరకు తిరుగుచున్నాడు," అని చెప్పిరి. మరునాటి ఉదయమున వారా వృద్ధుని నా యొద్దకు గొనివచ్చిరి. చిత్తూరు జిల్లాలో ఒక గ్రామమున ఇద్దరు బాల వితంతువులు కలరనియు, వారికి వివాహ ములు చేయుటకు తల్లిదండ్రులు లొప్పుకొన్నారనియు ఆయన చెప్పెను. వారిని వివాహము చేసికొనుటకు వరులును సంసిద్ధులయియే యున్నారని అతడు పలికెను. "అట్లయినచో చెంచలరావుగారి వద్దకును, రఘునాథ రావుగారి వద్దకును పోయి వివాహము చేయింపరాదా?" అని అంటిని. "వారు మాటలవారేకాని కార్యములవారు కారు," అని ఆయన నుడివెను. "మీకు నావలన కావలసిన పని యేమున్నది?" అని నేనడుగగా, 25 రూపాయలిచ్చిన పక్షమున తాను పోయి, ఇద్దరు పెండ్లికూతురులను, వారి, తల్లి దండ్రులను వరులను కొనివచ్చెదననియు, వారికి వివాహ ములు చేయవచ్చుననియు చెప్పెను. ఆయనను నా బండిలో నెక్కించుకొని చెంచలరావుగారి యింటికి తీసికొనిపోయి, జరిగిన కథను చెప్పి, 25 రూపాయలిమ్మని కోరితిని. ఇట్టివారు సొమ్ము అపహరింతురని ఆయన

చెప్పెను గాని, ఆ నష్టమును నేను భరించెదనని పలికి, సొమ్మిప్పించి ఆ వృద్ధ బ్రాహ్మణుని పంపివేసితిని.

తరువాత తిన్నగా రఘునాధరావుగారి యింటికి పోయి, "మీరు నిన్న, వధూవరులు దొరికిన పక్షమున స్వాములవారి ఇంటి యెదుటనే వివాహము జరిపించెదమని సెలవిచ్చిరి. ఈశ్వరుడు మీ అభీష్టమును శీఘ్రముగానే సిద్ధింప జేయునట్లున్నాడు. వధూవరులను కొనివచ్చుటకయి ఒక మనుష్యుని నేనిప్పుడే పంపించితిని" అని చెప్పితిని. ఈ వాక్యము ముగించునప్పటికి ఆయన ముఖము కళావిహీనమయి వైవర్ణ్యము నొందెను. ఆయన చేతులు జోడించి నాకు నమస్కారము చేసి, "ఈ పక్షమున పనిచేసినందుకు ఇప్పటికే బహు బాధలు పొందితిని. నేనిక దీనిలో సంబంధము కలిగించు కొనజాలను. క్షమింపుడు" అని స్పష్టముగా పలికిరి.

ముసలాయన 4, 5 దినములలో వధువుల నిద్దరిని, వారి జననీ జనకులను, వరుల నిద్దరిని తీసికొని వచ్చి నా కప్పగించి తన దారిన పోయెను. తరువాత విచారింపగా, నా వృద్ధ విప్రుడు వధువుల మాతామహుడయినట్లు తెలియవచ్చెను. చెంచలరావు పంతులుగారును, రఘునాధరావుగారును నా వద్దకు వచ్చి, ఈ వివాహములను చెన్నపట్టణములో జరుపవలదనియు, తాము ఈ పక్షమును విడనాడినట్టు జనులకు తెలిసిన ఈ పక్షమునకు నష్టమే కలుగుననియు, తమ గుట్టు బైలుపడకుండా వివాహములను స్థలాంతరమున చేసి, తమ్మవమానము నుండి కాపాడవలసినదనియు బహువిధముల ప్రార్థించిరి. వారి కోరిక చెల్లించుట ఉచితమని తోచినది.

సెలవులంతము కావచ్చుచున్నందున నేను పోవలసిన దినములు సమీపించుచుండెను. "మీ స్థలములో వివాహములు జరుప బూనుకొనెదరా?" అని అభిమానులకనేకులకు వ్రాసితిమి. బళ్లారినుండి రావు బహద్దూరు సభాపతి మొదల్యారుగారు సమస్త వ్యయములను వహించి తాము చేయ బూను కొనెదమని వ్రాసిరి. 1882 ఫిబ్రవరి 12 న 15 ఏండ్ల ప్రాయము గల వధువును చిత్తూరి సుబ్బారావుగారును, 12 ఏండ్లు గల చిన్న వధువును జటప్రోలు రామారావుగారును బళ్లారిలో వివాహమాడిరి. ఇవి రామకృష్ణయ్యగారి ధనముతో మాచే జరిగింపబడిన 11 వ, 12 వ వితంతు వివాహములు.

ఈ వివాహము లన్నియు పైడా రామకృష్ణయ్యగారు మహదార్యముతో

మా సమాజమునకు దయచేసిన 10,000 రూపాయలతోనే జరుపబడినవి. ఈయన సాహాయ్యమే లేకయుండిన మేమిందులో నొక్క వివాహమును చేయుటకు సమర్థులమై యుండము. ఈ పది వేల రూపాయలు గాక మొదటి రెండు వివాహములకు నయిన సమస్త వ్యయమును వహించుటయే కాక, కొన్ని గృహములను పునర్వివాహ దంపతులు కాపురముండుటకు సమాజము వారి వశముననుంచి యున్నారు. ఈయన కీర్తి యీ భూ మండలములో స్థిరముగా నుండక పోదు.

ఇప్పుడు వివాహములు చేయుటకు మాత్రమే కాక, మాస వ్యయములకు సహితము సొమ్ము కావలసియున్నది. మా పాఠశాలకు వేసవి కాలపు సెలవు లియ్యబడిన పిమ్మట చందాలు వేయించుటకు నేను సకుటుంబముగా చెన్నపురికి ప్రయాణమై పోయితిని. బండ్లు చేసికొనిపోయి చందాల నిమిత్తము గొప్పవారి గృహములకు తిరుగ నారంభించితిని. పిఠాపురపు రాజుగారి దత్తపుత్రులు ఇన్నూరు రూపాయలిచ్చిరి. నలుగురు 25 రూపాయల చొప్పున చందాలు వేసిరి. 20, 15, 10, రూపాయలు ముగ్గురిచ్చిరి. బండి చేసికొని ఒక గొప్ప గృహస్థుని యింటికి చందా నిమిత్తము పోయితిని. మహా ధనికుడై, వితంతు వివాహముల యందత్యంతాదరము చూపుచు, నేను పోయినప్పుడెల్ల అధిక గౌరవముతో చూచుచుండెడి ఆ గృహస్థు నా పేరుగల చీటీ లోపలికి పోయిన అరగంటకు వెలుపలికి వచ్చి తాను తొందర పని మీదనున్నట్టు నిలుచుండియే రెండు మాటలు చెప్పి, మరల లోపలికి పోయెను. ఆయనకు నిజముగా తొందర పనియే యుండి యుండ వచ్చును గాని, నేను మాత్రమది గొప్ప అవమానముగా భావించుకొని కోపముతో మరలితిని. నేను శాసించుటకేగాని యాచించుట కలవాటుపడిన వాడనుకాను. ఇక ముందెవ్వరిని యాచింపబోకూడదని నిశ్చయము చేసి కొని, మరి ఎవ్వరి ఇంటికినిబోక, యోడనెక్కి రాజమహేంద్రవరమున మా ఇంటికే పోయితిని.

మా సామాజికులు నెలచందాల నిచ్చుటయేగాక, వారిలో కొందరు పెద్ద మొత్తములను సహితము దయచేసిరి. మా విజ్ఞాపన పత్రిక చదివి సహాయులైన వారిలో బెంగుళూరులోని ఉన్నత న్యాయ సభలోని న్యాయాధిపతి (Judge) ఎ. రామచంద్ర అయ్యరుగారు వివాహమొకటికి నూరేసి రూపాయలు పంపుటయేకాక, ఆరేసి నెలలకు నూరు రూపాయలు

చందాలిచ్చుచుండిరి. రావు బహదూరు పి. సభాపతి మొదల్యారుగారు వివాహమొకటికి నూరేసి రూపాయలు పంపుచుండిరి. డిసెంబరు 20 న జరిగిన 13 వ వివాహమునకు 300 రూపాయలను రామకృష్ణయ్యగారు రహస్యముగా పంపిరి.

వివాహము నిమిత్తము చెన్నపురికి గొనిపోబడి వివాహము జరగక మరల తీసికొనిరాబడిన తణుకు చలపతిరావుగారి మరదలుండెను. చిన్నదాని తల్లి తన కొమార్తెకు వరునిగా కొమ్మరాజు గోపాలమను నియోగి బ్రాహ్మణ బాలుని తీసికొని వచ్చి వివాహము చేయుమని అడిగినది. అతడు చదువుకొన్నవాడుకాడు. అల్లరిగా తిరిగి, తల్లి దండ్రుల మాట వినక లేచి వచ్చిన వాడు. ఈ హేతువునుబట్టి నేనాతనికి వివాహము చేయ నిరాకరించితిని. అందుపై ఆమె ఆత్మారి లక్ష్మీనరసింహముగారి వద్ద పైడా రామకృష్ణయ్యగారికి ఉత్తరము పుచ్చుకొని కాకినాడకు వెళ్లెను. అప్పుడు రామకృష్ణయ్యగారు నాకిట్లు వ్రాసిరి.

"చిన్నపిల్ల తల్లి నా యొద్దకు వచ్చెను. వివాహము జరుపుటకు నేను కూడ ఒప్పుకొన్నాను. ఇందునిమిత్తము మిక్కిలి ఆవశ్యకముగా కావలసిన తక్కువ సొమ్మును దయచేసి తెలుపుడు. ఇది అయిన తరువాత మనము ప్రస్తుతము వివాహములు చేయుట నిలుపవలెను."

ఆయన ఉత్తరమునకు బదులుగా 300 రూపాయలు కావలసి యుండునని వ్రాసితిని. 1886 మార్చి 8 రాత్రి వివాహమేర్పరచి ఆహ్వానములు పంపితిని. అందరును వచ్చి వేచి యుండిరి గాని, పెండ్లి కుమారుడు రాక పోవుటచే పెండ్లి నిలిచిపోయినది. సిద్ధమైన వివాహమునకు భంగము కలుగుట కిదియే ప్రథమము కాదు. చెన్నపట్టణమున కూడా నొక వివాహమునకిట్లే భంగము కలిగెను. పూర్తిగా చెడిపోక, రాజమహేంద్ర వివాహము తరువాత జరిగినను, రామకృష్ణయ్యగారి జీవిత కాలములో జరగలేదు.

మార్చి 17 న రామకృష్ణయ్యగారు ఉత్తరము వ్రాసిరి - "My dear friend, I am suffering from a boil on my neck for the last 15 days."

ఉత్తరము నాకందిన రెండు, మూడు దినములలోనే ఆయన కాల ధర్మము నొందుట తటస్థించెను.

ఆ కాలమునందు వితంతు కన్యలను తెచ్చెదమనియు, దారి బత్తెము లకు కావలయుననియు నా వద్ద రూపాయలు పుచ్చుకొని, మోసము చేయు చుండెడివారు. అవివేకము చేత చేయబడినవి క్షమింపదగినవి. దుస్స్వ భావము చేత చేసినవియు కొంతవరకు క్షమింపదగినవి, కాని లోకోప కారధురీణులమనియు, స్వార్థత్యాగులమనియు చెప్పుకొనుచు ధనాశ పరత్వముచేత చేసెడి అకార్యములు క్షంతవ్యములు కావు....

1884 జనవరిలో నల్లగొండ కోదండ రామయ్యగారి వివాహమగు వరకును సామాజికులకును, వివాహములు చేసికొన్న వారికిని ఐకమత్యము నకు కొరతరాలేదు ... కోదండ రామయ్యగారి వివాహమైన రెండు, మూడు మాసములలో కొన్ని కలహ కారణములు కలిగినవి. ఈ కారణము ధనాశయని నా ఆశయము.

ఈ వితంతు వివాహమునకు నేను పూనినప్పుడు, పామరులును, పూర్వాచార పరాయణులును అయిన విపక్షుల వలన దూషణములకును, బాధలకును సంసిద్ధుడనయితిని గాని, నా వలన లాభములను పొంది, లోకోపకారార్థమే తాము సర్వ కష్టములకు లోనుగానున్నట్లు పలుమారు పలుకుచుండువారు నాకాయాసము కలిగింతురని నేను బొత్తిగా తలంప లేదు.

మా వీథిన నున్న చయనులుగారి ఇల్లు కొన్నప్పుడు నేనందు మూడు కుటుంబముల నుంచదలచి, ముందుగా కోదండ రామయ్యగారు కోరుకొన్న భాగమును, అనగా వంట యిల్లును, భోజనముల యిల్లును, పడక గది యునున్న భాగమును, ఈయనకిచ్చి, ఒక భాగములో తణుకు చలపతిరావు గారి కుటుంబమును, చావడి భాగములో చేబోలు వెంకయ్యగారి కుటుంబ మును కాపురముంచితిని. కోదండ రామయ్యగారు తానున్న ఇల్లు బాగు చేయుటకయి కావలెనని కోరుచుండగా, మార్చిలో 6 రూ. లును, జూల యిలో రు. 5. 50 లిచ్చితిని. ఈయన ఒక్క యింటికి దక్క మరి యెవ్వరి ఇంటికి నేనేమియు నియ్యలేదు.

నల్లగొండ కోదండ రామయ్యగారు దీనినంతయు మరిచిపోయి, గోదా వరీ వరదలు విశేషముగా వచ్చి, ప్రవాహము వీథులలో ప్రవేశించి, కోదండ రామయ్యగారున్న ఇంటిగోడ, యుక్త సమయములో బాగు చేసి కొనక పోవుటచేత, కొంత కూలగా, నేను తనయందు గల ద్వేషము చేత

తన యిల్లు బాగుచేయించలేదని నా మీద దోషారోపణ చేయుచు, నన్ను దూషించుచు, 1888 ఫిబ్రవరి 15 న కార్యనిర్వాహక సంఘమున కొక విజ్ఞాపన పంపెను. ఆ నెల 26 న విచారణ వచ్చినప్పుడు నేనాయన యింటి మరమ్మతు నిమిత్తమయి ఇచ్చిన సొమ్ము లెక్కలను, ఆయన నా కిచ్చిన స్వీకారపత్రములను సభవారిముందు పెట్టగా వారీ క్రింది నిర్ణయము చేసిరి.

విద్యలేని మూఢులు పలువురు చేరి చేయుదానికంటె విద్యాధికు డొక్కడు చేయు హాని శతగుణములధికముగా నుండును. మన దేశములో యాచ్నా వృత్తి హేయముగా నెంచబడకుండుటయు, పాటుపడక కూరుచుండుట గొప్ప యని తలపబడుచుండుటయు చిరకాలాగతాచారములగుటచేత ఎల్ల వారును సాధ్యమైనంత డబ్బు లాగవలయుననియే యత్నించుచుందురు. వికలాంగులుగాక, అవయవపటిత్వముగల వారందరును పాటుపడవలసిన వారే అనియు పాటుపడ నొల్లని వారికి ధన దానముచేసి సోమరితనమును ప్రోత్సాహపరచుట పాపమనియు నా మతము. నేను పాటుపడెడివాడను. ఇతరులు పాటుపడవలెనని తలచెడివాడను. కాయకష్టమువలని గౌరవము నెరుగని ముంజులూరి గోపాలముగారు పంచమ వివాహవరుడు తాను ముద్రాశాలలో పనిచేయుదుననియు, ద్వితీయ వివాహ వరుడు, రామచంద్ర రావును, చతుర్ధ వివాహవరుడు శేషయ్యకును ఇచ్చుచున్నట్లే తనకును నెల కెనిమిదిరూపాయల చొప్పున ఇయ్యవలయుననియు నన్నడిగెను. వారిరువురును చదువుకొనుచున్నారు గనుక ఇచ్చుచున్నాననియు, చదువు లేక దృఢకాయుడవై యుండియు కష్టపడనొల్లని నీ కొరకయి యియ్యననియు దృఢముగా చెప్పితిని. తాను పుచ్చుకొన్న జీతము సొమ్ము అయిపోయిన తరువాత తిండికి లేక, రామకృష్ణయ్యగారి యొద్దకు కాకినాడకు బోయి అతడు తన అవస్థను చెప్పుకొనెను. ఆయన అతనికి కొన్ని రూపాయలిచ్చి, నన్ను రాజమహేంద్రవరములో కలిసికొన్నప్పుడు, మనలో చేరినవారు చెప్పిన మాట విననివారయినను కష్టములో నున్నప్పుడు సాయము చేయు చుండవలెనని చెప్పెను. దృఢశరీరులు ఉద్యోగము చెప్పినను చేయక, సోమరితనమున కాలము గడప నిశ్చయించుకొన్నప్పుడు మీ ధనములో నుండియైనను నేనియ్యనని మొహమాటము లేక ఖండితముగా చెప్పితిని.

నా దగ్గిర నొక్క గొప్ప లోపము గలదు. ఇతరులడుగునది న్యాయము కాదని భావించినప్పుడు నెమ్మదితో సమాధానపరుప జూడక, పెద్ద గొంతుకతో, వారు దురాశాపరులనియు, వారడిగినది అనుచితమైన దనియు మొగము మీదనే అనివేయుట. ఎవ్వరికైనను నిజమైన కష్టము వచ్చినప్పుడు వారడుగకయే నాచేతనైన సాయమంతయు చేసెడివాడను. ఈ గోపాలముగారి భార్యకే మసూచి (స్ఫోటకము) వచ్చెను. అతని అసహాయ స్థితిని కనిపెట్టి, వెంటనే అతని యింటికి పోయి, పథ్యపానములకు 4 రూపాయలిచ్చి, రోగి యొద్ద కనిపెట్టియుండుటకు ఒక శూద్ర స్త్రీని పెట్టి, కావలసిన పదార్థములు కొనియిచ్చి, ఆరోగ్య స్నానము చేయు వరకును ప్రతి దినమును పోయి చూచుచుంటిని.

చదువంతగా లేని మూఢుల ఆశలు అత్యధికములు కానివిగాను, అత్యల్పముతోనే తృప్తినొందునవిగాను ఉన్నవని ఒప్పుకోవలసియున్నది. విద్య నేర్చిన వారిలోనే యివి విపరీతములుగా నుండినవి. ఒకటి, రెండు సంగతుల నిచ్చట పేర్కొనవలసివచ్చినందుకు చింతిల్లుచున్నాను.

మూడవ వివాహము చేసికొన్న రామారావుగారికి మున్నూరు రూపాయల ఇల్లిచ్చెదనని వాగ్దానము చేసితినిగాని, తెప్పించిన సొమ్మంతయు వివాహమునకే వ్యయపడినందున చెప్పినట్లు చేయలేక పోతిని. రామారావుగారి ఎదుటనే నా అశక్తతను రామకృష్ణయ్యగారికి తెలుపగా, ఇల్లు తామిచ్చెదమని చెప్పిరి. 1885 సెప్టెంబరులో రామారావుగారు, దాదాపుగా మూడు సంవత్సరము లయినను రామకృష్ణయ్యగారు వాగ్దానము చెల్లింపలేదని వ్రాసిరి. నేనా నెల 13 న ఇతర విషయములతో బాటు ఈ విషయము కూడ రామకృష్ణయ్యగారికి వ్రాసితిని. ఆయన పంపిన ప్రత్యుత్తరము :

"I gave him food many things, and many times much money than you and I said we would give him. . . . . After his marriage I gave him a house situated on a large piece of ground, fit for building 2 houses more at least . . ."

ఈ యుత్తరము వచ్చువరకును రామకృష్ణయ్యగారు ఇంత సొమ్ము (రూ. 1505 లు) ఈయన నిమిత్తము వ్యయపెట్టిరని నాకు తెలియదు. ఇక్కడ రాజమహేంద్రవరములో ఒక్కొక్క వరుని విషయమున నింతింత

సొమ్ము వ్యయపెట్టుటకు సమాజము వారియొద్ద ధనము లేదు. ఉన్నను విచ్చలవిడిగా వ్యయము చేయరు. కొంచెము వైరకారణము కలుగగానే, నాకు విరోధులుగానున్న పెద్దమనుష్యులు కొందరు తమయొద్ద కాలోచనకు పోయిన ఒకరిద్దరు వరుల సాహాయ్యముతో తక్కిన వరులను తమ యొద్దకు పిలిపించుకొని, నాపయిని దోషారోపణములు చేయుచు సమాజము వారికి విన్నపములు పంపునట్లు పురికొల్పజొచ్చిరి. నాకు రెండు విధములుగా శత్రువులేర్పడి కీడు చేయుచుండువారు: ఒక తెగవారు వితంతు వివాహ ప్రతిపక్షులుగానుండి నన్ను ద్వేషించువారు: ఇంకొక తెగవారు, 'వివేక వర్ధని'లో నేను తమ కార్యములను బయటపెట్టుటచేత, ద్రేటుపడ్డ పాముల వలె పగతీర్చుకొనుటకు ప్రతీక్షించుచుండెడివారు. వీరిలో మా సామాజికు లలో సహిత మొకరిద్దరుండిరి.

వివాహమైనవారిలో విద్యాధికులు కొందరు తమకు గల అల్పకష్టము లను కోటి గుణితముగా చాటుకొనుచు మొఱపెట్టు కొనుచుండెడివారు. వారు పడ్డ కష్టములు అంత విశేషమైనవి కావని నేను చెప్పగలను. ఈ వివాహములు చేసికొన్న వారిలో అవరకెవ్వరికిని సొంత యిండ్లు లేవు. అట్టివారికందరికిని కాపురముండుట కిండ్లీయబడినవి: పనిచేయుటకయి సేవకులియ్యబడిరి: వారు కావలసినప్పుడు వంట సహితము చేసిపెట్టు చుండిరి. భోజన వ్యయములు మాత్రమేకాక, పాఠశాలల జీతములును, పుస్తకములును బట్టలును వేరుగా నీయబడుచువచ్చినవి. వైద్యపు ఖర్చులును, శుభాశుభ కార్య వ్యయములును సమాజమువారే భరించుచు వచ్చిరి. ఎవరికైన కొంచెము కష్టము వచ్చిన, నేనును గవర్రాజుగారును పోయి విచారించుచు, కావలసిన సాయమునంతను చేయుచుంటిమి.

మిత్ర సాహాయ్యముతో కృషిచేసి నేను రాజమహేంద్రవరములో విత్తనములేసి మొలిపించిన విశ్వస్తావివాహలతాంకురమునకు పట్టుకొమ్మ అయి, నానా ముఖముల తీగలు సాగించిన పైడా రామకృష్ణయ్యగారు బాల వితంతువుల అభాగ్యముచేత 1886 మార్చి 28 న ప్రాతఃకాలమున స్వర్గస్థు లగుట తటస్థించెను. ఆయన మొదటి రెండు వివాహములకు చేసిన వ్యయ ములు, తరువాత ఇచ్చిన పదివేల రూపాయలు, కట్టించిన ఇండ్లును, స్త్రీ పునర్వివాహాభివృద్ధికి చేసిన ఇతర వ్యయములను కలుపుకొని యిరువది వేల రూపాయలయ్యెను. మొట్టమొదట నిచ్చెదనని వాగ్దానము చేసిన

ముప్పదివేలలో నీ యిరువదివేలు పోగా మిగిలిన పదివేల రూపాయలను వేగముగా నిచ్చెదనని చెప్పిన ప్రకారముగా మరణమునకు నాలుగు దినములు ముందు, తన సమ్ముఖమున నుండ తటస్థించిన ఆత్మూరి లక్ష్మీ నరసింహముగారిని సమాజ పక్షమున ధర్మకర్త (Trustee) గా ఏర్పరచి, పదివేల రూపాయలను మరణ శాసన మూలమున సమాజమునకిచ్చి, వాగ్దానమును పూర్ణముగా చెల్లించుకొనిరి.

ఆయన వ్రాసిన మరణ శాసనములు రెండు.

మొదటి మరణ శాసనములో వితంతు వివాహ సమాజమన్నచోట రాజ మహేంద్రవరమని గాని, ధర్మకర్త అన్నచోట ఆత్మూరి లక్ష్మీనరసింహము గారనిగాని వ్రాయబడలేదు. వితంతు వివాహ సమాజ మొక్కటియే యుండుటచేత వేరుగ రాజమహేంద్రవర మనుట అనావశ్యకము. తమ పేరు చేర్చవలసినదని లక్ష్మీనరసింహముగారు రామకృష్ణయ్యగారికి లేఖ వ్రాసిరి కాని చేరులోపలనే ఆయన మరణము నొందుట తటస్థించెను.

రెండవ మరణ శాసనముతో జత చేయబడిన పట్టికలో, ఇక్కడ నున్న వారిలో మొదటి వివాహమును, కడపటి వివాహమును చేసుకొన్న వారి పేరులు తక్క తక్కిన వివాహములు చేసికొన్న దంపతుల పేరులుదాహ రింపబడి, వారి వారి వశములో నున్న యిండ్లు వారికియ్యబడినట్లు వ్రాయ బడెను.

రామకృష్ణయ్యగారి మరణానంతరమున వారు వితంతు వివాహ సమాజము వారి పక్షమున వ్రాసి యిచ్చిన మరణ శాసనములు రెంటిని ఆత్మూరి లక్ష్మీనరసింహముగారు తీసుకొనివచ్చి సమాజమునకిచ్చిరి. ఆయన సమాజమువారి కోశాధ్యక్షుడయినందున శాసనములు వారి యొద్దనే యుంచబడెను.

1886 ఏప్రిల్ 3 న సమాజము యొక్క కార్యనిర్వాహక సంఘము వారి సభలో "That the wills executed by late Ramakrishniah Garu in favour of the Association be registered.'' నిర్ధారణ చేయుబడినది. నిర్ధారణ ప్రకారముగా మరణ శాసనములు రెంటిని కొనిపోయి లేఖ్యా రూఢము (రిజిస్టరు) చేయించుటకు సమాజ సహాయ కార్యదర్శి అయిన సోమంచి భీమశంకరముగారు లక్ష్మీనరసింహముగారి యొద్దకు పోయి అడుగగా, పదివేల రూపాయల మరణ శాసనమును తన యొద్దనే యుంచు

కొని, మిగిలిన మరణ శాసనమును నొక్కదానినే ఇచ్చినందున, భీమశంక రముగారు ఒక్క మరణ శాసనమును మాత్రమే 1886 మే 6 న సబ్ రిజిస్ట్రార్ ఎదుట పెట్టవలసిన వాడయ్యెను. జూన్ 26 న లక్ష్మీనరసింహము గారు సబ్‌రిజిస్ట్రార్ కార్యస్థానమునకు పోయి, మరణ శాసనము రామ కృష్ణయ్యగారు వ్రాసి యిచ్చినట్టు సాక్ష్యమిచ్చెను.

ఆ మరునాడు, అనగా జూన్ 27 న, జరిగిన కార్య నిర్వాహక సంఘ సభలో, మిగిలియున్న రెండవ మరణ శాసనమును రిజిస్టరు చేయించు టకై నిర్ధారణము చేయబడినది. ఈ నిర్ధారణము క్రింద న్యాపతి సుబ్బా రావు పంతులుగారును, ఆత్మూరి లక్ష్మీనరసింహముగారును, నేనును, సోమంచి భీమశంకరముగారును, బసవరాజు గవర్రాజుగారును, మాకర్ల వెంకట సుబ్బారావు నాయుడుగారును వ్రాళ్లు చేసితిమి.

ఆత్మూరి లక్ష్మీనరసింహముగారు రామకృష్ణయ్యగారి పదివేల రూపా యల మరణ శాసనమును రిజిస్ట్రేషను నిమిత్తమియ్యక పోవుటకును, ఇయ్యక పోవలెనని నిశ్చయించుకున్నను పైకి చెప్పక, కార్య నిర్వాహక సంఘము వారి నిర్ధారణ క్రింద వ్రాలు చేయుటకును గల కారణము కొంత చెప్పవలసి యున్నది.

నేను నాల్గవ తరగతి యందు చదువుచుండినప్పుడు ఆయన యొద్ద మా పాఠములు కొన్ని జరుగుచుండుటచే నాకాయన గురువు. ప్రియ శిష్యుడగుటచేత నాకాయన బ్రహ్మ సమాజ సిద్ధాంతములు బోధించుచు, మా యింట నేను చేసెడి విద్యార్థుల సభలకు వచ్చుచు, నన్ను ప్రోత్సహిం చెడివారు. చిన్ననాటి కథల నటుండనిచ్చినను, ఈయన మరల రాజ మహేంద్రము వచ్చిన తరువాతకూడ స్త్రీ పునర్వివాహ దీక్షయందు నా కెన్ని విధములనో సాయపడుచుండెను. అయినను నాకు నెయ్యము కంటె న్యాయము ప్రియతరమైనది. నేనిప్పుడాయనతో ప్రతిఘటింపవలసి వచ్చినది.

నే నా కాలములో వితంతు వివాహ విషయమున విశేషముగా పాటు పడుచుండినను, పురపారిశుద్ధ్య విచారణ సంఘకార్యములలోనూ, పత్రికా నిర్వహణలోను, గ్రంథ రచనలోను, దౌర్జన్య నివారణ ప్రయత్నము లోను, ఉపన్యాస కరణములోను, పూర్వ గ్రంథ ప్రకటనములోను కూడ

సమానముగానే పాటుపడుచుంటిని. నేను ప్రకటించుచుండిన 'వివేకవర్ధని' దుష్టవర్తనముగల వారి కంపరికిని గర్వనిర్భేదకముగా నుండెను.

ఉన్నత న్యాయసభ వారొకసారి, లంచములు పుచ్చుకొనుట కలవాటు పడి అరితేరిన ఒక ప్రాడ్వివాకుని మా రాజమహేంద్రవరమునకు పంపిరి. ఈయన లంచములు పుచ్చుకొనెడి రీతి పోలూరి శ్రీరాములుగారి దానికంటె భిన్నమైనది. ఈయన సాక్ష్యము మొదలైనవానిని క్రమముగా పుచ్చుకొని, తీర్పు చెప్పబోవు సమయమున ఉభయ పక్షములవారి యొద్దనుండియు వారియ్యదగినంత మొత్తమును లంచముగా తెప్పించి, గ్రంథమునంతయు న్యాయ దృష్టితో చదివి, న్యాయ పక్షమువాడు పది రూపాయ లిచ్చినను దానితోనే తృప్తినొంది, వాని పక్షమే తీర్పుచెప్పి, అన్యాయ పక్షమువాడు ఇన్నూరు రూపాయలిచ్చినను తిరిగి యిచ్చివేసెడి వాడు. అందుచేత అతని తీర్పు న్యాయము తప్పిన తీర్పని ఎవ్వడును చెప్పజాలడు అటువంటి ప్రాడ్వుని లంచములను మాన్పవలెనని మా 'వివేకవర్ధని' పనిచేయ బూనెను. ఇతని విషయమయి వ్రాయబడిన హాస్యసంజీవనిలోని సంభాషణలు చదివి, కొన్నాళ్లు లంచములు మానివేసి, ఆరు నెలలు సెలవు పుచ్చుకొని తన పని మరియొక చోటికి మార్చుకొన ప్రయత్నించెను కాని, ఉన్నత న్యాయ సభవారు అంగీకరించనందున మరల మా పట్టణమునకే రావలసినవాడయ్యెను. రెండవసారి వచ్చిన పిమ్మట అల్పకాలము శుద్ధవర్తనుడయి యుండి, శీఘ్రకాలములోనే రహస్యముగా చేయి చాపనారంభించెను. వెంటనే మా 'వివేకవర్ధని' అన్యాపదేశముగా వ్రాయుచు పోరాడదొడగెను. దాని ధాటికి తాళజాలక అతడు మరల సెలవు గైకొనిపోయి, మరల మా యూరికి రాకుండ తప్పించుకొని పోయెను.

అట్టి 'వివేకవర్ధని' స్వపక్షము వారి అక్రమమును వెల్లడింపక పక్షపాతము వహించుచున్నదని కొందరు మిత్రులు నాతోనే అనిరి. మా పత్రిక స్వపక్షమువారి దుష్కృత్యములను కప్పిపుచ్చుటకు బుద్ధిపూర్వకముగా నెప్పుడును ప్రయత్నింపలేదు గాని, అల్పదోషముల నుపేక్షించుచు వచ్చెను. అల్పదోషముల నుపేక్షించుటచేత ఒకానొకరు నిర్భయులయి యథేచ్ఛముగా సంచరించుచు వచ్చుటయు కలదు. మా 'వివేకవర్ధని' సర్వ సామాన్యములైన మానుష దౌర్బల్యములు లేనిదని చెప్ప నెవ్వరు సాహసింపగలరు?

ఆత్మూరి లక్ష్మీనరసింహముగారు లంచములు పుచ్చుకొనువారు కాక పోయినను, తమ న్యాయసభలో పనియున్న వారియొద్ద, మిక్కిలి తక్కువ వెలలకు ధాన్యము మొదలైన పదార్థములను కొనుచుండిరి. తాము పూనిన పనులకు చందాలు వేయించి కక్షిదారులవలన ధనస్వీకారము చేయు చుండిరి. తాము గ్రామాంతరము పోవలసివచ్చినప్పుడు దారిలోగాని, తత్సమీపమున గాని స్థల వివాదముగల వ్యాజ్యమున్నదేమో విచారించి, దానిని స్వయముగా చూడవలెనని చెప్పి, తమకును, తమ కుటుంబమున కును పల్లకుల మీద రాకపోకలకయ్యెడు ఖర్చులను వ్యాజ్యదారుల వలన పుచ్చుకొనుచుండిరి. దాంభిక వర్తనాపేక్షయు, సర్వజన ప్రియాచరణ కాంక్షయు నాయన యందు ముఖ్య లోపములుగా నుండెను. 1886 మార్చి 31 న ప్రకటింపబడిన 'వివేకవర్ధని' లో 'దంభాచార్య విలసన' మను ప్రహసనము యొక్క ప్రథమ భాగములోని ముఖ్య పాత్రములు దంభా చార్యులును, మిత్రుడు జంబుకేశ్వర శాస్త్రియు, స్వామి శాస్త్రియు, అందు వర్ణింపబడిన లక్షణములవంటివి రెండు, మూడు ఈయనయందుండినవి.

ఆయన దీనిని చదివిన తరువాత కూడ యథాప్రకారముగానే నాతో మాటాడుచుండిరి. రామకృష్ణయ్యగారు మరణ శాసనములను నాకాయన చూపినప్పుడు, మరి యిద్దరు, ముగ్గురు ట్రస్టీలను కూడ తమతో చేర్చుకొని పనిచేయుడని నేను చెప్పిన హితవచనముల కాయన ఆమోదించినట్లే మాట్లాడిరి. రామకృష్ణయ్యగారి మరణమును గూర్చి ఏప్రిల్ 7 "వివేక వర్ధని" లోని వ్యాసములో, నేనాయనతో మాటల యర్థమిచ్చెడు వాక్యములే యుండినవి.

ఇట్లుండగా మే నెల మొదటి వారములో 'సత్యకామి' అను పేరుతో ఒకరు 'వివేకవర్ధని' కిట్లు వ్రాసిరి: "ఈ యూరిలో నున్న ఒక పెద్దమనిషి, వీరేశలింగముగారా సొమ్ము రామకృష్ణయ్యగారు మరణ శాసనము మూల ముగా ఇచ్చిన పదివేల రూపాయలు తమకు కావలెననుచున్నారని వాడుక చేయుచున్నాడు. ఆ మాటలలో నేమయిన నిజమున్నదేమో మీ పత్రిక ద్వారా తెలియచెయ్య కోరుతాను."

ఈ యుత్తరమును, నేను దీనికిచ్చిన ఈ క్రింది ప్రత్యుత్తరమును మే 19 'వివేకవర్ధని' లో ప్రకటింపబడినవి.

"సత్యకామిగారు చెప్పిన మాటలను వాడుక చేయుచున్న పెద్ద

మనుష్యుడు ఏదో దురుద్దేశముతో పయి ప్రవాదమును వేయుచున్నాడే గాని, ఆ పెద్ద మనుష్యుని మాట నెంతమాత్రమును సత్యములు కావు. 'వివేకవర్ధని' లో ప్రకటింపబడిన యర్థమిచ్చెడు మాటలనే నేనొకసారి మహారాజశ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహముగారితో, ఆయన క్షేమమును, సమాజము యొక్క వృద్ధియును కోరి చెప్పియున్నాను. ఆ ఏర్పరచెడు ట్రస్టీలలో నా పేరక్కర లేదనియు చెప్పియున్నాను. ఈ విషయమయి ఎవ్వరికయిన సందేహము కలిగియున్న పక్షమున లక్ష్మీనరసింహముగారినే అడిగి తెలిసికోవచ్చును. ఆయన ఈ విషయమయి అసత్యమాడబోరు.... కందుకూరి వీరేశలింగము.''

పయి యుత్తరము వచ్చిన తరువాతను, అది నా అభిప్రాయముతో ప్రచురింపబడులోపలను, 1886 మే 9 న, ఒక చిత్రకథ నడచినది.

లక్ష్మీనరసింహముగారి మిత్రుడు సభకు పోయినపుడెల్ల తోడి న్యాయవాదులు, ''జంబుకశాస్త్రిగారు దయచేసినారా? జంబుక శాస్త్రిగారూ, విశేషములేమి?'' అని హేళనము చేయ నారంభించిరట! ఆయనయు, కలహ ప్రియులైన కొందరు పెద్ద మనుష్యులును లక్ష్మీనరసింహము గారి యొద్దకు పోయి ''దంభాచార్య విలసనము' మిమ్ముద్దేశించియే వ్రాయబడిన దనియు, మీరూరకుండుట పౌరుషము కాదనియు ఆయనను పురికొల్పి, ప్రోత్సాహ పరిచిరట! వారి మాటలపైని కోపావేశము గలవాడయి, నెలపై నెనిమిది దినములూరకున్న తరువాత అకస్మికముగా, 'దంభాచార్య విలసనము' కలిగియుండిన 'వివేకవర్ధని' ని అద్భుత విధమున లక్ష్మీ నరసింహముగారు దగ్ధము చేయించిరి.

రెండవనాడు నేను మా పత్రికా ప్రకటనకర్త చేత వ్రాయించిన లేఖను బట్టి ఈ యద్భుత విధము తేటపడవచ్చును.

''మహారాజశ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహం చెట్టియార్‌గారికి వివేకవర్ధని ప్రింటర్ అండ్ పబ్లిషర్ కూరెళ్ల రామయ్య విన్నపములు. ఈ నెల 9 వ తేది సాయంత్రము వివేకవర్ధని పత్రికను గడకు గట్టి, పాత చెప్పున్ను చీవురున్ను కట్టి, వివేకవర్ధనిలో ప్రచురము చేయించినవాడినిన్ని, చేసిన వాడినిన్ని, వివేకవర్ధనిన్ని బంగారయ్య మేడ అనే స్థలమందు తగుల పెడతామనిన్ని, యిష్టము వచ్చినవారు వచ్చి చూడవలసినదనిన్ని, మీ కోర్టు ప్రెస్సాఫీసుల నవుకర్లు కొందరున్ను, మీ యిలాకా మనుష్య

లున్ను అనేక విధములైన ధూషణపు మాటలనుపయోగిస్తూ, పత్రికకున్ను, పబ్లిషరుకున్ను, పత్రికాధికారికిన్ని అవమానము (insult) పరుపు నష్ట (defame) మున్ను చేయు దురుద్దేశ్యముతో వీధులవెంట టముకు వేయిస్తూ, ఆ పని మీ వుత్తరవు ప్రకారము జరిగిస్తూ వున్నట్టు ప్రచురణము చేసినాఁ ఇందు గురించి నేను న్యాయశాస్త్ర ప్రకారము చర్య జరిగించ తలచినాను కనుక యీ విషయములో మీకు ఎంతవరకు యిలాకా వున్నదిన్ని నాలుగు రోజులలోగా తెలియజేయగోరుతాను. చిత్తగించవలెను."

దానికి లక్ష్మీనరసింహముగారింగ్లీషున నీ క్రింది ప్రత్యుత్తరము పంపిరి:

"In reply to your registered letter I have to say that on enquiring I find that what is stated in the letter is not true. I have further to inform you that the letter under reply contains libellous and defamatory statement and learn that yourself and one or two of your men have been making much disparaging statements and that unless sufficient apology is made within a fortnight from this day, I shall be compelled to proceed against you and your men according to law.

Rajahmundry — I have etc.
16th May 1886 — **A. L. Narasimham.**

పైదాని కింగ్లీషుననే ఈ క్రింది ప్రత్యుత్తరము పంపబడినది.

"In reply ... I beg to inform you that I fail to see that my letter contains any libellous and defamatory statement and that I am not aware of any such disparaging statements whatever it may mean and that the expression "One or two of your men" conveys no idea to my mind and that I am not consequently prepared to make an apology and that you may "proceed according to law" against whose ever you may please.

20th May 1886 — I remain sir, yours etc.
**K. Ramayya**

వివేకవర్ధని దహన విషయమయి జరిగించిన పనికి అభియోగము తెప్పించి, తుదముట్ట గ్రంథము నడుపుటకు నేను నిశ్చయించుకొని, సాక్ష్యమును సేకరించి, సాధన సామగ్రితో సంసిద్ధుఁడనయి యుంటిని. ఇంతలో మా యుభయుల మిత్రులును, మిత్రులుగానుండిన వారు రచ్చ

కెక్కి తగవులాడుట ధర్మము కాదనియు, అంతఃకలహముల వలన ప్రతి పక్షులకు మరింత లోకువ అగుననియు, మేము పూనిన మహా కార్యమునకు నష్టము కలుగుననియు మమ్ము సమాధాన పరుప పాటుపడిరి. నేను మొదటినుండియు పట్టిన పట్టు విడువని మూర్ఖ స్వభావము కలవాడనగు టచే, లిఖిత పూర్వకమైన క్షమార్పణము చేసినగాని సంధి పొసగనేరదని స్పష్టముగా చెప్పితిని. కొంతకాలము రాయబారములు జరిగినమీదట లక్ష్మీనరసింహముగారు 1886 ఆగస్టు 6 న ఈ క్రింది క్షమార్పణ లేఖను పంపిరి.

"మార్చి నెల 11 తారీఖుగల వివేకవర్ధనిలోని హాస్య సంజీవని యందుండు సంగతులు ఒక్కరి విషయమయి ఉద్దేశించి వ్రాయబడినట్టు నా స్నేహితులు కొందరు నాతో చెప్పిన మీదట ఆగ్రహము వచ్చి, మే నెల 9 వ తారీఖున సదరు వివేకవర్ధని దగ్ధ విషయమయి జరిగించిన పనికి విచారిస్తున్నాను. మరిన్ని అప్పుడు నా నవుకర్లు కొందరు మిమ్మల దూషించినట్టు మీరు తెలియజేసినారు. అట్లా చేయడమెంతమాత్రము నా యుద్దేశము కాదు. వారిని మందలించడమైనది..... అందుకు అపాలజీ చేయుచున్నాను...."

తరువాత 1886 సెప్టెంబరు 8 న లక్ష్మీనరసింహముగారి క్షమార్పణ పత్రమును వివేకవర్ధని వ్యాఖ్యానముతోను, మొదటినుండియు జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములతోను ప్రకటించినది.

వివాదాగ్ని పూర్ణముగా చల్లారిపోయినందుకు లక్ష్మీనరసింహముగారిక తమ మనసు వచ్చినట్టు వ్యవహారము నడపవచ్చును. తమ తమ దౌర్జన్య ములను వివేకవర్ధనిలో వెల్లడించుచు వచ్చుటచేత నాకు శత్రువులైన వారందరును లక్ష్మీనరసింహముగారి కాలోచన చెప్పుటకు మంత్రులయిరి. ఈ మిత్రులు కొందరు వివేకవర్ధనీ దహన విషయమున మొదట ఏమియు నెరుగమని చెప్పి, తరువాత క్షమార్పణ వేడుకొనుట అవమానకరమని ఆయనను పరిహాసము చేసి, పగ తీర్చుకోవలెనని పురికొల్పిరి. రామ కృష్ణయ్యగారిచ్చిన 10 వేలలో నేభాగమును వివాహముల కుపయోగ పడకుండ చేసిన పక్షమున ముందు వితంతు వివాహములు జరుగవనియు, అట్లు చేయుటయే నన్ను సాధించుట అనియు లక్ష్మీనరసింహ ప్రభృతులా వరకే ఆలోచించిరి! ఆహా! ఇది యేమి అజ్ఞానము! వివాహములు జరగక

పోయిన యెడల నాకేమి యవమానము? పగ తీర్చుకోదలచిన యెడల నాకపకారము చేయవలెనుగాని, లోకోపకారమయిన అనాథ రక్షణ కార్యమునకు హాని చేయుట ఏమి న్యాయము?

స్వప్రయోజన పరత్వము చేత, విధవా వివాహములు చేసికొన్నవారు కొందరు ఈ అనాలోచిత వ్యవహారమునకు సహాయులయిరి. 10 వేల రూపాయల వలన వచ్చెడి వడ్డీనంతను మీకే ఇచ్చెదనని ఆశపెట్టి లక్ష్మీ నరసింహముగారు రాజమహేంద్రవరములో నున్న వితంతు వివాహ వరులను తనతో చేర్చుకొని, రామకృష్ణయ్యగారి మరణ శాసనములో "వివాహములు చేసుకొన్న వితంతువుల యొక్కయు, వారి భర్తల యొక్కయు, బిడ్డల యొక్కయు పోషణము నిమిత్తము" అన్నదానికి ఈవరకు వివాహములు చేసికొన్న వారికి మాత్రమే అని నూతనార్థము కల్పించి, "వితంతు వివాహములను జరుపు నిమిత్తము" అని వ్రాసిన కథను బొత్తిగా నెత్తుకోక, ఈవరకు వివాహములు చేసికొన్నవారి పోషణ మునకును, చిల్లర వ్యయములకును మాత్రమే వడ్డీని వ్యయము చేయ వలసినదని రామకృష్ణయ్యగారు తనతో రహస్యముగా చెప్పినట్లు నవ సృష్టి నొకదానిని బైలుదేరదీసి, అక్టోబరు 5 తేదీగల తమ ప్రకటన పత్రముతో, నితర స్థలముల యందుండిన వరులకు పంపిరి.

ఈ కాగితములను, మొదటి వివాహమాడిన గోగులపాటి శ్రీరాములు గారికి పంపినప్పు డాయన వ్రాసిన యుత్తరములో, "దాత యొక్క ప్రథ మోద్దేశ ప్రకారము పదివేల రూపాయల మీది వడ్డీని ఈవరకు వివాహము చేసికొన్న వారిలో సమానముగా పంచిపెట్టుట గూర్చి నా అభిప్రాయ మడుగుచు ప్రకటన పంపినందుకు అనేక వందనములు. మీ ప్రకటనను బట్టి, దాత మీతో నెప్పుడట్లు చెప్పెనో సాక్ష్యము కనబడదు. మరణ కాలము నందాయన యుద్దేశమదియేయని మీరు మనఃపూర్తిగా చెప్పి, మీరాయుద్దేశమును నెరవేర్పదలచుకొన్న పక్షమున ఇప్పుడు వివాహ ములు చేసికొన్న వారి అభిప్రాయములను పోగుచేయుటకేల పూను కొన్నారో నాకు కారణము కానరాకున్నది. మీరిప్పుడభిప్రాయములను పోగుచేయనారంభించుటను బట్టి, దాతయొక్క ఉద్దేశమది అగునా, కానా అని నాకు సందేహము కలుగుచున్నది. వడ్డీని 12 కుటుంబములలో మాత్రమే పంచిపెట్టిన ముందు మనము వివాహములు చేయగలుగుదుమా?

సొమ్మును ఒక్కరి కంటె ఎక్కువ మంది పేరిట ధనాగారములో నుంచి, వచ్చిన వడ్డీని అసలులో చేర్చుచు, అవశ్యకమయినప్పుడు నిజముగా రిక్త స్థితిలోనున్న వారికి మాత్రము వడ్డీలోనుండి సాయము చేయుచు, వడ్డీలో మిగిలిన దానితో వివాహములు జరుపుచుండవలెనని నా యభిప్రాయము.''

ఈయనకును, తరువాత ఇచ్చట పెండ్లి కొడుకులకును తారతమ్యము పైదాని వలన తేటపడవచ్చును. తగిన యుద్యోగములో నున్న కోదండ రామయ్యగారు, శేషయ్యగారు మొదలగువారు వివాహములకు లేకుండ వడ్డి నంతను తామే పంచుకొని మ్రింగవలెనని ఈ నూతన పథకమేర్పరచిరి. అటుతరువాత లక్ష్మీనరసింహముగారు మరణ శాసనములో పేర్కొనబడిన వితంతు వివాహ సమాజము రాజమహేంద్రవర సమాజమే కాదని చెప్పు సాహసమునకు గడంగిరి. మరణ శాసనము మూలము మాట అటుండగా దాని నకలు సహితము సామాజికులలో నెవరి యొద్దను లేదు. అందుచేత డిసెంబరు 19 సభలో కార్య నిర్వాక సంఘమువారిచే, "That printed copies of P. Ramakrishnayya's Rs. 10,000=00 be circulated among the members of the Managing Committee." అని నిర్ధార ణము చేయబడెను. లక్ష్మీనరసింహముగారు ఆ మరణశాసనమును తమ వైదిక ముద్రాశాలలోనే ముద్రింపించి సామాజికులకు పంపిరి.

వితంతు వివాహ సమాజమని మరణ శాసనములలో చెప్పబడినది రాజ మహేంద్రవర సమాజమగునా? పైడా రామకృష్ణయ్యగారి నిధి నుపయో గించుట కేది యుత్తమ మార్గము? ఈ రెండు ప్రశ్నలు చర్చించుటకు 9 జనవరిన కార్యనిర్వాహక సంఘ విశేష సభ ఏర్పాటు చేయబడెను. కాని నాటి దినము లక్ష్మీనరసింహముగారు రానందున సభ 13 కు వాయిదా వేయ బడెను. 13 న సహితము లక్ష్మీనరసింహముగారు సభకు రాలేదు. ఆయన లేకయే సభ జరుపబడి, పదివేల రూపాయల నిధిని గూర్చి పైడా రామ కృష్ణయ్యగారి మరణ శాసనములో చెప్పబడిన వితంతు వివాహ సమాజము రాజమహేంద్రవర సమాజమే అనియు, నిధి నుండివచ్చెడు వడ్డీ, ఈవరకు వివాహములైన వారికిని, ఇప్పటి పురోహితునకును, వల్లూరి పున్నమ్మకును, ఆమె భావి భర్తకును, బిడ్డలకును ఖర్చుపెట్టి, మిగిలిన దానిని ముందు వివాహములు నడపి, వాని వ్యయములకును ఖర్చు పెట్టవలసినది అనియు నిర్ధారణలు చేయబడినవి.

నాటి సాయంకాలమే వితంతు వివాహ సమాజ మిత్రులును క్షేమ కాంక్షులును సభచేసి, పై నిర్ధారణల యర్థము వచ్చెడు నిర్ధారణలనే చేసిరి. 1887, 15, 16, 22 తేదీలలో సమాజము యొక్క సామాన్య సభ మూడు దినములు జరిగినది. మూడవ నాటి సభ ముఖ్యమైనది. ఆ సభయందీ నిర్ధారణలు చేయబడినవి. "That the trustee Mr. A. L. Narasimham be requested to associate with two other trustees for the best administration of the fund of Rs. 10,000=00." That of the two trustees one be elected by the ex. office members from among themselves, another be selected by the present trustee from among the members of the widow marriage association ex-officer or not etc."

సభావసానమున లక్ష్మీనరసింహముగారు లేచి, "సామాజికులారా! నేను మీ ఆలోచన నడుగుచుండెదను గాని దాని ననుసరించి నడుచుకొనుటకు బద్ధుడను కాను," అని సెలవిచ్చిరి.

1887 జనవరి 22 న జరిగిన నాలుగు నిర్ధారణలు ధర్మకర్త లక్ష్మీనరసింహముగారిచే గౌరవింపబడి జరపబడలేదు. సమాజము దుర్బల స్థితియందుండుటను కనిపెట్టి, లక్ష్మీనరసింహముగారు ఆ ధనముతో చిత్తూరు మండల మందొాక గ్రామమును కొని, "రాజా" అను బిరుదు నామముతో తన్ను పిలుచుకొనుచు, తన మరణ పర్యంతము 10 కుటుంబములకు సంవత్సరమునకు మున్నూరు రూపాయలు పంపుచుండిరి.

1886, 1887 సంవత్సరములలో సమాజమువారొక్క వివాహమునైనను చేయగలిగినవారు కారు. ఈ లోపల సమాజమునకు కొన్ని విపత్తులు సంభవించినవి. 1888 ఏప్రిల్ 19 న ద్వితీయ వివాహ వరుడైన రామచంద్రరావు లోకాంతర గతుడయ్యెను. ఆ నెల 23 న చతుర్థ వివాహ వరుడైన శేషయ్య భార్య శేషమ్మ పరలోకగతురాలయ్యెను. ఆ మాసమునందే ప్రథమ వివాహ వరుడైన గోగులపాటి శ్రీరాములు క్రైస్తవమత ప్రవిష్టుడయ్యెను.

1888 జూలయి 6 న కొమ్మరాజు గోపాలముగారి వివాహము జరిగినది. ఆయన కియ్యబడిన వధువు పల్లూరి పున్నమ్మ, వివాహము నిమిత్తమయి రామకృష్ణయ్యగారే 300 రూపాయలు తమ మరణమునకు ముందిచ్చియుండిరి. 1888 అక్టోబరు 17 న కోదండరామయ్యగారి ద్వితీయ వివా

హము జరిగినది. క్రొత్తగా నియ్యనక్కరలేక ఈయనకు ఇల్లు ఈవరకే యుండెను. నగలును ప్రథమ భార్యవే యుండినవి. ఈయన సమాజము తోడి సంబంధము లేక తన వివాహమును స్వతంత్రముగా చేసికొనెదనని చెప్పినను, బదులని చెప్పి మరల తీర్చని రూ. 75 ల సమాజ ధనములోనే వివాహ వ్యయములు నడచినవి. తన వివాహమును తానే చేసికొంటినని వ్రాసి లక్ష్మీనరసింహముగారి ద్వారా, సభాపతి మొదల్యారుగారు పెండ్లి ఒకటికి సమాజమున కిచ్చెదనని నూరు రూపాయలను కోదండ రామయ్యగారే తెప్పించుకొనెను.

తన యింటిలోని ఒక భాగమునకు గోదావరి వరద చేత కొంత చెరుపు కలిగిన తరువాత రామకృష్ణయ్యగారి మరణ శాసనానుసారముగా, మూడు భాగములుగా నుండిన ఇంటిని ఆత్మూరి లక్ష్మీనరసింహముగారు రెండు భాగములుగా పంచి యిచ్చినను పంచి ఇయ్యనే లేదనియు, ఇల్లు పంచి యియ్యలేదనుట వాస్తవము కాదని కార్య నిర్వాహక సంఘమువారు నిర్ధారణ చేసిన పిమ్మట న్యాయ సభలకు పోయెదనని బెదిరించియు, తాను బదులు పుచ్చుకొన్న సొమ్ము తీర్చనక్కరలేదని తగవు పెట్టియు, తనకు ధనమియ్యక పోయిన యెడల పునర్వివాహ పక్షమును విడచిపెట్టి ప్రాయశ్చిత్తము చేయించుకొనెదనని భయపెట్టియు, ఉన్న సమాజమునకు విరోధముగా అత్యల్పకాలములోనే నశించిన ఇంకొక సమాజమును స్థాపించియు, తనకు ధన సాహాయ్యము చేయనివారిని, తన పక్షమున మాటాడని వారిని దూషించుటకయి పత్రిక నొకదానిని బైలుదేరదీసియు కోదండరామయ్యగారును, ప్రతిపక్షుల ప్రేరణముచేత మరియొకరిద్దరును అవిచారకరములయిన తొందర పనులు చేసి, నాకును, సమాజము వారికిని కొంత శ్రమ కలుగజేయుచు వచ్చిరి.

ఇక్కడి వితంతు వివాహ సమాజములో రాజమహేంద్రవరములోని ప్రముఖులలో ముక్కాలు మువ్వీసము $\frac{15}{16}$ చేరియుండిరి. అయినను, పూర్వోక్తములైన వివాహములు రెండునుగాక, 5 సంవత్సరముల కాలములో క్రొత్త వివాహ మొక్కటియే జరిగినది. 1889 మార్చి 29 న ఈ కోమటి వివాహము జరిగినది. ఇకముందు నూతన దంపతులకిచ్చుటకు ఇండ్లులేవు. ఇండ్లు కట్టించి యిచ్చుటకు ధనము లేదు. కొందరు చందా లిచ్చుట మానుకొనిరి. సంవత్సరమునకు 6 రూపాయలు భారముగా

నుండునని, మూడు రూపాయలకు తగ్గింపబడినది. 3 ఒక్కటిగా చేయబడినవి. ఆ ఒక్క రూపాయి సహితము అనేకులు క్రమముగా నియ్యకుండిరి. నెల జీతములిచ్చుటయే దుర్భరమయి నందున పురోహితుని, వంట బ్రాహ్మణుని తొలగించిరి.

వివాహములను నా సొంత సొమ్ముతో నా మనసు వచ్చినట్లు నేనే సమాజము వారి ఆదరణక్రింద చేయ జొచ్చితిని. 1892 లో రెండు వివాహములు, 1893 లో రెండు వివాహములు ఈ ప్రకారముగా 1907 లో నేను చెన్నపట్టణమునకు వెళ్లునప్పటికి 10 వివాహములు చేసితిని. ఈ వివాహ దంపతులకు ఇంగ్లీషు పద్ధతిని గాని, నగలు పెట్టు పద్ధతిని గాని పెట్టుకొనక, మట్టెలు, మంగళసూత్రములు, తాంబూలాదులు, వాద్యములు, భోజనములు మొదలయిన వాని క్రింద 100 రూపాయలకు మించకుండ వ్యయము చేయుచుంటిని. 27 న వివాహముచేసి నేనిక్కడ (రాజమహేంద్రవరము) నుండి చెన్నపురికి పోయితిని. అక్కడ 35 వ వివాహము జరుగుచుండగా ఆత్మూరి లక్ష్మీనరసింహముగారు నన్ను చూడ వచ్చిరి. నేనాయనతో ప్రసంగవశమున, ధనము లేక సత్కార్యములు నిలిచిపోవనియు, రామకృష్ణయ్యగారి ధనముతో చేయబడిన వాటికంటె ద్విగుణముగా వారి ధన సాహాయములేకనే చేయబడినవనియు ప్రస్తావించితిని. ధనము వచ్చునన్న ఆశ లేకపోవుటచేత ఇప్పటి వరులకు ఆ తృప్తి లేదు. నాకు వారివలన పీడలేదు. రాగా రాగా వివాహ వ్యయమును నూటి నుండి ఏబదికి, ఏబదినుండి ఇరువదికిని దింపినాను. ఇప్పుడు చేయుచున్న కొన్ని వివాహములకు వ్యయమును వరులు తామే భరించుచున్నారు.

ఈ పది సంవత్సరములలో 1881-1890 నేను తీవ్రమైన ఉబ్బసపు దగ్గుచేత బాధపడుచుండినను ప్రతిదినము పగలు 10 గంటలకు పాఠశాలకు పోయి, సాయంకాలము 5 గంటల వరకును పని చేసి వచ్చుచుండెడివాడను. విద్యార్థి సంఘములకు పోయి ఉపన్యాసములిచ్చెడి వాడను. ఇన్నీసు పేట పాఠశాల యొక్క, పట్టణ పాఠశాల యొక్క కార్యనిర్వాహక సంఘములలో నుండి పని చేయుచుండెడివాడను. మహమ్మదీయ విద్యా సంఘమునకు సహితము, మహమ్మదీయుల ప్రార్థనమీద, కార్యదర్శిగా నుండి, విద్యార్థుల భోజన గృహమును నడుపుచుండెడివాడను. పురపారిశుద్ధ్య సంఘము (Municipal Council) Taluq Board, District

Local Fund Board లలో సభ్యుడనుగా నుండి పనిచేయుచుండెడివాడను. అప్పటి పారిశుద్ధ్య సంఘ సభ్యులలో కొందరు లంచముల వలననే సుఖ జీవనము చేయుచుండిరి. సభ్యులు దీపస్తంభములనుపయుక్త స్థలముల యందుగాక తమ యిండ్లముందరనే వేయించుకొనుచుండిరి. దీపముల గుత్తవారుడు వీధి దీపములలో నుండి తగ్గించి చమురు సభ్యులు కొందరి ఇండ్లలోని దీపములకు పోయవలసి వచ్చుచుండెను. బాటలు, వీధులు బాగు చేయుటకయి ఏటేట నియ్యబడు ప్రజల సొమ్ములో విశేష భాగము ఈ దుష్టుల సంచులలోనికే పోవుచుండెను. ప్రబలులైన ప్రజలు తమ వీధి అరుగులను పెంచియు, ఇండ్లను ముందుకు జరిపి కట్టియు, వీధులంత కంతకు సన్నమగునట్లు చేయుచుండిరి. పారిశుద్ధ్య శాసన విధులు బీదలను మాత్రమే బాధించుచుండెను గాని, ధనికులు శాసన విధులనే బాధించు చుండిరి. పారిశుద్ధ్య సంఘమువారి అధికారములో నున్న ధర్మ వైద్యశాలలో ధనము కావలసినంత వ్యయపడుచుండినను, రోగులకు పథ్యపానములు సరిగా జరుగక, ఆ ధనములో సగపాలు అల్పోద్యోగుల పాలగుచుండెను. ఈ అక్రమముల నన్నిటిని సాధ్యమైనంత వరకు మాన్పుటకు పాటుపడ దొడ్చితిని. ఈ విషయములో జరిగిన రెండు, మూడు కార్యములనుదా హరించెదను.

నేనొక దినమున ధర్మ వైద్యశాలకు పోయితిని. అక్కడ రోగులకు లెక్కలలో చూపబడినట్లు పాలును, రొట్టెయు కాక, గంజియు, మెతుకులును పెట్టుచుండిరి. నేను రోగులను ప్రశ్నించుచుండుట చూచి ఒక సేవకుడు పరుగెత్తుకొనిపోయి రంగయ్యనాయుడును తీసుకొనివచ్చెను. అతడు తన గుట్టు బయలుపడునని తలుపులు వేయించి, నన్ను లోపలకు రావలదని నిషేధించెను. నేను అతని చర్యను పురపారిశుద్ధ్య సంఘము వారికి తెలియబరచితిని. నా పైని ద్వేషము పూని, ఒకనాటి రాత్రి ఒక పెద్ద మనుష్యుని యింట జరిగిన సభలో నా వంక కన్నులెఱ్ఱచేసి చూచుచు, ఏదో దౌర్జన్యము జరిగించుటకు ఉద్యుక్తుడైనట్టు కానబడెను. ఆ సంగతి కనిపెట్టి గృహస్థుని మనుష్యులాతనిని పట్టుకొని బలవంతముగా వెలుపలికి లాగుకొని పోయిరి. నాటి రాత్రి జరిగిన వృత్తాంతమును సహితము పారి శుద్ధ్య సంఘమువారికి తెలియజేసితిని. అందుమీద వారావైద్యశాలా సహాయుని మరియొక చోటికి మార్చవలసినదని చెన్నపట్టణము వైద్యశాల

ముఖ్యాధికారికి వ్రాసిరి. రాజధాని వైద్యశాలాధికారి యతనిని నవ్యస్థలము నకు పంపివేసెను.

ఒక దినమున నేను పాఠశాలకు పోవుచుండగా పట్నాల వీరేశలింగ మను స్వర్ణకారుడు నాలుగయిదడుగులు రాజవీధి (Main Road) లోని స్థల మాక్రమించుకొని, పునాదులు ముందుకు జరిపి, గోడ లేవదీయుచుండెను. నేనది చూచి, ఇట్లు అక్రమముగా స్థలము నాక్రమింప కూడదనియు, పారి శుద్ధ్య విచారణ సంఘము వారికి విజ్ఞాపన పంపుకొని, వారిచ్చిన పక్షమున ఇప్పుడు కట్టుచున్న రీతిగాను, ఇయ్యని పక్షమున పూర్వమున్నరీతిగాను కట్టుకొనవలసినదని చెప్పితిని. అతడు నా మాట యొప్పుకొని పనివాండ్రను పంపించి వేసెను. నేను సాయంకాలమూ దాకినే ఇంటికి పోవునప్పుడు ఆ యింటి పని మరల నారంభింపబడినవి. ఇది ఏమని అడుగగా, ఆ విభాగపు పారిశుద్ధ్య సంఘ సభ్యులను (వార్డు కౌన్సిలర్లను) అడుగగా, దీనినాపుటకు మీకు (వీరేశలింగముకు) అధికారము లేదనియు, తమ విభాగములోనిదగుటచేత తమకే స్వాతంత్ర్యమున్నదనియు, కట్టుకోవచ్చు ననియు సెలవిచ్చిరని చెప్పెను. నేనీ విషయము మరునాడు సభ వారికి జ్ఞాపిక పంపితిని. ఈ జ్ఞాపిక (Memo) విచారణకు వచ్చులోపలనే యిల్లు కట్టించి, పూర్వపు గుర్తులేవియు లేకుండ చేసిరి. ప్రధాన రథ్య (Main Road) లోనే అక్రమణము జరుగుటను గూర్చి నేను మాట్లాడు నప్పుడా స్వర్ణకారునికాలోచన చెప్పిన విభాగ సభ్యులు తామేమియు నెరుగ నట్టూరకుండిరి. ఆక్రమణము తీసివేయించుటకు నిర్ధారణ చేయబడినది. సభవారి పక్షమున నేను పోయి, ఆక్రమించుకొన్న వెనకను రంపముతో కోయించి వేసి, వీధి అరుగులను, ఒక అరుగు మీద నున్న గదిని గడ్డ పారలతో త్రవ్వించి వేసితిని. ఆ సభ్యులకు తాను ముందుగా 25 రూపాయ లిచ్చితిననియు, నేనాటంక పెట్టిన మీదట మరల 75 కైకొనిరనియు అతడు నాతో చెప్పుకొని దుఃఖించెను.

నాగోజీరావు పంతులుగారు (Municipal Chairman) పాఠశాలల పరీక్షకులయి రాజమహేంద్రవరము విడిచినప్పుడు, ఉపకరగ్రాహి (Sub-Collector) అయిన హామ్మొట్టు దొరగారు పారిశుద్ధ్య సంఘాధ్యక్ష త్వమునకై ప్రయత్నించిరి. మా శాస్త్ర పాఠశాలలో ప్రధానోపాధ్యాయులైన మెట్కాపు దొరగారు పారిశుద్ధ్య సంఘాధ్యక్షత్వమునకు హామ్మొట్టుగారి

పేరు నిర్దేశించుచు ఒక కాగితము వ్రాసి, చేవ్రాలు చేయుటకయి నా యొద్దకు తీసికొని వచ్చిరి. దొరతనమువారు స్థానిక ప్రభుత్వము నిచ్చుట సభ్యులు స్వతంత్రముగా పనిచేయుటకొరకనియు, దండనాధికారముగల వారధ్యక్షులయినప్పుడు సభ్యులు నిర్భయముగా వర్తించుట పొసగదనియు, కాబట్టి నేను వ్రాలు చేయక పోవుటయేగాక, నియామక దినమునందు వ్యతిరేకముగా మాటాడెదననియు చెప్పితిని. అధ్యక్షుని నియమించుకొను దినము వచ్చినప్పుడు సభలో హామ్నెట్టుదొరగారిని కోరుకొనక అధ్యక్షత్వమునకు వేరొకరిని కోరుకొనవలెనని నేను చెప్పితిని. కాని సభ్యులు ఉపకరగ్రాహిగారికి వ్యతిరేకముగా నడచునంతటి ధైర్యశాలులు కానందున వారినే కోరుకొనిరి.

కరగ్రాహ కార్యములలోనూ, దండనీతి ప్రయోగ కార్యములలోను గడపవలసినందునను, తరచుగా గ్రామాంతర సంచారము చేయవలసినందునను పురపారిశుద్ధ్య సంఘ కార్యములలో తగినంత శ్రద్ధకవకాశము లేనివారయి, హామ్నెట్టు దొరగారు తమ పక్షమున ప్రతినిధి నేర్పరుపగోరి అట్టి పనికి ఎవరు సమర్థులని మెట్కాపు దొరగారి నాలోచన అడిగిరి. వారు నా పేరు చెప్పిరి. అందుమీద హామ్నెట్టు దొరగారు నన్ను అడుగగా, సమస్త విషయములలోను నాకు సర్వ స్వాతంత్ర్యము నిచ్చిన గాని నేనా పనికి అంగీకరింపనంటిని. ఆయన అందుల కొప్పుకొని సభ్యుల అనుమతితో తన అధికారముల నన్నిటిని నాకు సంక్రమింప జేసెను.

నేను యథాశక్తిని పాటుపడుచు, ముఖ్య విషయములలో నెల్లదొరగారి అంగీకారమును బడయుచు, లంచములు మాన్పుటకును, కార్య స్థాన వ్యవహారములు అవిలంబముగా జరుపుటకును, ఆదాయము వృద్ధి చేయుటకును పని చేసితిని. ఇండ్ల పన్ను లెక్కువగా నుండవలసిన వారికి తక్కువగానూ, తక్కువగా నుండవలసిన వారికి ఎక్కువగానూ కట్టబడియుండెను. నేను ప్రతి గృహమును తిరిగిచూచి, కొందరు ధనికుల ఇండ్లకు పన్ను హెచ్చుచేసి, బీదల యిండ్లకు తగ్గించి పారిశుద్ధ్య సంఘమునకు ధనాగమ మెంతో హెచ్చునట్లు చేసితిని. వితంతు వివాహ విషయమున నాకు ప్రతిపక్షులుగానున్న వైదికులు తమకు పన్నులు హెచ్చునని భయపడితిమనియు, అట్లు జరుగక కొన్ని విషయములలో తగ్గింపబడి న్యాయము జరిగెననియు

తమతో చెప్పి నన్ను శ్లాఘించిరనియు చల్లపల్లి రంగయ్య పంతులుగారు నాతో చెప్పిరి.

హామ్నెట్టు దొరగారు ఇక్కడినుండి మార్పబడి వెళ్లనున్న సమయమందు, 1886 సెప్టెంబరు 17 న నాకిట్లు వ్రాసిరి : "I must tender you my sincere thanks for the assistance you have given me and the untiring energy you have displayed in connection with the Municipality during the last few months I am convinced that you are the best man to fill the post of chairman but you see a system of free election by ballot does not always result in the best man being returned."

దొరగారి శ్లాఘనను పడసినంత మాత్రముచేత నెల్ల విషయముల యందును నేనాయన యిష్టానుసారముగా వర్తించుచుండునట్లు తలపకూడదు. కొన్ని సమయములయందు ఆయన చెప్పినది తప్పని నిర్భయముగా మొగము మీదనే అనెడివాడను. ముందు రాగల ఫలములు లేశమయినను విచారింపక, స్వదేశీయుడైనను, విదేశీయుడైనను, హిందువైనను, యూరపియనైనను లక్ష్యముచేయక, నేను మంచిదనుకొన్న దానిని మొగము ముందర ననివేయునట్టియు, నిర్భయముగా చేయునట్టియు తొందర స్వభావము నాకు గల లోపములలో నొకటి. ఈ వేగిరపాటు వలన మనవారిలో కొందరు నాకు ద్వేషులగుట సంభవించుచు వచ్చెను.

అధికారుల అభిప్రాయమునకు వ్యతిరేకముగా తమ అభిప్రాయమును తెలుపలేని లోపము మన వారియందే విశేషముగా నున్నది. అస్వస్థముగా నున్నందున ఒక తాలుకా సంఘ (Taluq Board) సభకు పోలేక పోయితిని. తరువాత కొందరు సభ్యులు నన్ను చూడవచ్చిరి. విశేషము లేమని నేనడిగిన మీదట ఒకరు, "దొరగారు మమ్మడిగి మా అభిప్రాయములు గైకొన్నారా? ఏమేమి నిర్ధారణములు చేసిరో మాకు తెలియ నిచ్చిరా?" అని ఉత్తరమిచ్చిరి.

ఆ పయి నెలలో జరిగిన సభలో, వారు ముద్రపెట్టిన మోబర్లి దొరగారే అగ్రాసనాసీనులయి యుండిరి. ఒక విషయమున నాకును దొరగారికిని అభిప్రాయ భేదము కలిగి, కొంత వివాదము నడచెను. కొన్ని నిమిషములు గడచిన తరువాత దొరగారు తమ పట్టును విడచి నా అభిప్రాయము ప్రకారమే నిర్ధారణ చేసిరి.

ఈ సమయమునందు నేను రెండు పాఠశాలలకు కార్యనిర్వాహక సంఘ సభ్యుడనుగా నుండుటయేగాక ఇన్నీసుపేట బాలికా పాఠశాలకు కార్య నిర్వాహకుడనుగా నుంటిని. బాలికల పాఠశాలలో బాలికలు జీతము లియ్యక పోవుటచేత దానిని భరించుట ఎక్కువ కష్టముగా నుండెను. ఈ పాఠశాలను చందాల మూలమునను, పారిశుద్ధ్య సంఘమువారును, దొర తనమువారును వేరు వేరుగా ఇచ్చు సహాయ ద్రవ్యము వలనను భరించు చుంటిని. ఇట్లుండగా, 1885 మార్చి 2 న పురపాలకాధ్యక్షుని యొద్దనుండి, "The Government has disallowed the payment of salary grant to your school for next year from the Municipal fund" అని యుత్తరము వచ్చినది.

శీఘ్రకాలములోనే చెన్నపురి రాజధాని విద్యా విచారణకర్తగారు రాజమహేంద్రవరమునకు రాగా, నేనాయనను కలిసికొని మాటాడి, ఆయనచేత బలముగా మా బాలికా పాఠశాల కనుకూలముగా వ్రాయించిన మీదట దొరతనమువారు మా పురపాలక సంఘ ధనములోనుండి యథా పూర్వకముగా సహాయమిచ్చునట్లుత్తరువు చేసిరి.

నాకు మొదటినుండియు స్త్రీ విద్య యందధికాభిమానము. స్త్రీల స్థితి బాగుపడిన గాని దేశము బాగుపడదని నా నమ్మకము. వారము వారము ప్రకటింపబడు వివేకవర్ధనితోబాటు 'సతీహిత బోధిని' అను స్త్రీల మాసపత్రికను మూడు సంవత్సరములు నడిపి, స్త్రీల నిమిత్తమయి, 'సత్యవతీ చరిత్రము,' 'చంద్రమతీ చరిత్రము,' 'సత్య సంజీవని,' 'పత్నీహితసూచని,' 'దేహారోగ్య ధర్మబోధిని' మొదలగు పుస్తకములను రచించితిని.

1881–90 నడుమను, పై పుస్తకములను గాక, 'చమత్కార రత్నా వళి,' 'రాగమంజరి' నాటకముల నింగ్లీషుల నుండియు, 'రత్నావళీ' మాళవికాగ్నిమిత్ర' నాటకములను సంస్కృతము నుండియు తెనిగించి 'ప్రహ్లాద నాటకము' 'దక్షిణ గోగ్రహణము,' 'సత్యహరిశ్చంద్ర నాటకము' అను రూపకములను, కొన్ని నాటక కథలను, ప్రహసనము లను 'ఆంధ్ర కవుల చరిత్రము' ను రచించితిని. ఇవిగాక పెక్కు ఉపన్యాస ములు వ్రాసి ప్రచురించితిని. పూర్వ కవి ప్రణీత గ్రంథములు కొన్నింటిని సంస్కరించి ప్రకటించితిని.

మా పట్టణములో సునిర్మిత సభల పాలనలో చక్కగా నడుపబడుచున్న రెండు పాఠశాలలకును పోటీగా, ధనార్జనాభిలాష చేతను, కీర్తి కామిత్వము చేతను కొందరు పెద్దలు ఆస్తిక పాఠశాల యనియు, మహారాష్ట్ర పాఠశాల అనియు, స్వదేశాభిమాని పాఠశాల అనియు పెద్ద పెద్ద పేరులు పెట్టి కొత్త పాఠశాలలు పెట్ట మొదలుపెట్టిరి. ఈ నూతన పాఠశాలకు నిధి లేదు. చందాలు లేవు. దాన ధనము లేదు. విద్యార్థుల నెల జీతములే ఆధారము. సుస్థిర పాఠశాల నుండి సాధ్యమైనంత ఎక్కువ మందిని ఆకర్షించుటకయి పన్నిన ఉపాయములు: విద్యార్థుల వలన తక్కువ జీతములు గ్రహించుట, తోడి బాలుర నెక్కువ మందిని తెచ్చిన వారి వలన జీతములు గైకొనకుండుట, బాలురను తగిన తరగతులలో చేర్చుకొనుట మొదలైనవి. వచ్చిన మొత్తములో కార్యనిర్వాహకుని భాగము పోగా, మిగిలిన దాని నుపాధ్యాయులు వంతుల ప్రకారము పంచుకొనుచుండిరి. ఉపాధ్యాయులకు ముట్టెడు మాసవేతనములు 8, 10, 15 అయినను లెక్కలలో 20, 30, 40, 50 అయినట్టు చూపబడి ఆ దానికలు (receipts) గైకొనబడుచుండెను. కార్య నిర్వాహకులు తమ చేతి సొమ్ము వ్యయ పెట్టుచున్నట్టుచూపి, దొరతనము వారివలన సహాయ ద్రవ్యము విశేషముగా గైకొనబడుచుండెను. ఇట్టి అనుచిత కార్యముల చేత ఉపాధ్యాయులే నీతి మాలిన వారయినప్పుడు విద్యార్థులేమి నీతిమంతు లగుదురు? వారు నీతిని మాత్రమే కాక విద్య సహితము కోలుపోవు చుండిరి. అందుచేత అప్పుడు మా పట్టణములో విద్య యొక్కయు, విద్యార్థుల యొక్కయు స్థితి శోచనీయముగా నుండెను.

అందుచేత, పాఠశాలా కార్యనిర్వాహక సంఘమున కధ్యక్షులయిన మెట్కాఫు దొరగారును, సంఘ సభ్యులైన అస్మదాదులును పాఠశాలల నన్నింటిని నొక్కటిగాచేర్చి ఒక్క కార్యనిర్వాహక సంఘముయొక్క అధి కారము క్రిందికితెచ్చి, ప్రతి పాఠశాలవారు కోరిన నియమములనే అంగీక రించి, వారు చెప్పిన జీతములమీద వారి పాఠశాలలోని ఉపాధ్యాయులను తీసి కొనుట కొప్పుకొని, వారి పాఠశాలాధికారియైన యేలూరి లక్ష్మీనరసింహము గారినే ప్రధానోపాధ్యాయ పదమునందు నిలిపి, పాఠశాలలన్నిటి నొక్కటిగా కలిపి, ఒక్క సభవారి నిర్వాహకత్వమునకు లోబరుప గలిగితిమి.

ఇన్ని విషయములలో నేనత్యంతోత్సాహముతో పని చేయుచుండిన కాల

ములో, మిత్రభావముతోనే గాక గురుభావముతో నేను చెప్పినదెల్ల శిరసా వహించి చేయుచు, నాకు కుడి భుజమైయుండి నన్ను కంటికి రెప్పవలె సదా కాచుచు, అందరును విడిచినను తాను మాత్రము నన్ను విడువకుండిన బసవరాజు గవర్రాజుగారు ఆకస్మికముగా 1838 జూలయి 16 న లోకాంతరగతులయిరి. అటువంటి సుగుణ నిధియయిన మిత్రరత్నము మరణముతో నాకావరకున్న కార్యోత్సాహము సగము తగ్గిపోయినది. సదా రోగపీడితుడనైన నేను చిరకాలము జీవింపననియు, నేను పూనిన మహాకార్యమును నా అనంతరమాయన నిర్వహించుననియు నేను దృఢముగా నమ్మియుంటిని. అట్టి నాయాశ అకాల వినాశనము నొందగా విరక్తుడనయి, పురపాలక సంఘములోను, స్థానిక నిధి సంఘములలోను నా సభ్యత్వములకు పరిత్యాగ పత్రికలను పంపి, ఆ పనులన్నియు ఒక్కమారుగా మానుకొంటిని.

గవర్రాజుగారు తన మరణమునకు నాలుగయిదు మాసములకు ముందు నా జీవిత చరిత్రమును వ్రాయుటకయి సాధనముల నిమ్మని అడిగెను. నేనాయనను నిరుత్సాహపరచి, నా మరణానంతరమున నేమైన వ్రాయవగి యుండినచో వ్రాయ వచ్చునని చెప్పితిని. కొన్ని మాసముల లోనే, నా జీవ చరిత్రమును వ్రాయనెంచిన మిత్రుని జీవ చరిత్రమును నేనే వ్రాసి, ఆయన స్మృతిని శాశ్వతము చేయుటకయి చేయబడిన పురజనుల సభలో చదువవలసినవాడనైతిని.

ఈయన అనంతరము, నా తరువాత నిరంతరాయముగా లోకోపకార కార్యము నడుపుదురని నేను ప్రతీక్షించిన రెండవ వారగు సత్తిరాజు మృత్యుంజయరావుగారును, కడపటి వారయిన దేశిరాజు పెదబాపయ్యగారును అకాల మృత్యుదేవత వాతబడిరి. వీరు ముప్వురును పట్ట పరీక్షా సిద్ధులు, దేశాభిమాననీయులు, స్వార్థపరిత్యాగులు, పరోపకారరతులు, ఉత్సాహధైర్య సాహసములు గల కార్యశూరులు. వీరు ముప్వురును యౌవన మధ్యమున స్వర్గస్థులయిరి.

# 1. 1890 మొదలు 1900 వరకు

1879 సంవత్సరము నందు వితంతు వివాహ విషయమున నేనియ్యదలచిన ఉపన్యాసములకు తావు ఒక పట్టున లభింపక పోయినప్పటి నుండియు, సర్వజనులకు ఉపయోగపడెడు ఉపన్యాస సభా భవనసిద్ధి ఎట్లు కలుగునా అని ఆలోచించుచుంటిని. మా ఉత్తర మండలములలో కొంతకాలము పాఠశాలా పరీక్షకులుగా నుండి, తెలుగు దేశముపయి అధిక ఆదరము కలిగి, తరువాత చెన్నపురి రాజధానిలో పాఠశాలలకెల్ల విద్యా విచారణాధి కారియయిన కర్నల్ మక్డానల్డుగారి పేర రాజమహేంద్రవరములో పట్టణ మందిరమును (Town Hall) కట్టింపవలెనని 1880 లో ప్రయత్నించితిని. ఆ సంవత్సరము ఆగష్టు 15 న జరిగిన పురజన సభలో మక్డానలు దొర గారిపేర పురమందిరము కట్టింప నిశ్చయింపబడి చందాలు పోగుచేయుట కయి ఏర్పడిన సభకు నేను కార్యదర్శినిగా నియమింపబడితిని. కాగితము మీద 500 రూపాయలు పడినను, చాలినంత ధనము వచ్చు జాడకాన రానందున అప్పటికా కృషి సఫలమయినది కాదు. అయినను నేనా యుద్య మమును విడిచిపెట్టక పట్టణమందిర నిర్మాణమునకయి పురమధ్యమున నొక స్థలమును దామరాజు నాగరాజుగారి పేర కొనియుంచి, విక్టోరియా జూబిలీ మహోత్సవ సందర్భమున 1887 లో చందాలు చేర్చి పురమందిర మును కట్టింపవలెనని ఒక సభ కూర్చితిని. అయిదారు నూరులు చందాల మూలమున పోగయినవి. పిఠాపురము రాజుగారు వేయి రూపాయలు దయ చేసిరి. పలుమారు సభలు చేయబడుచువచ్చినవి. ఈ సభలలో పట్టుమని పది రూపాయలియ్య సాహసింపని ఉదార పురుషులు, నేను కష్టపడి తిరిగి వ్రాయించి తెచ్చిన భావనాకృతి (plan) లో లోపములెంచుచు, లక్ష రూపాయలు వ్యయపెట్టి దివ్యభవనము కట్టింపవలెనని కొందరును, నేను కొన్న స్థలము బాగులేదని దోషములెన్నుచు, జనోద్యానముగానుపయో గింపదగిన స్థలమును పురమధ్యమున సంపాదించవలెనని కొందరును ఆచరణ సాధ్యములుకాని విచిత్రాభిప్రాయముల నియ్యజొచ్చిరి.

1889 మార్చి 26 న ముద్రితమైన ఈ లేఖను చందాదారులకు పంపితిని:

"I have had ample reasons to believe that there are no chances of

your Town Hall ever coming into existence by means of Public subscriptions . . . and I have therefore made up my mind to have the Hall built at my own expense in the site which I already purchased with my own money for this purpose. I am now prepared to devote the sale proceeds of my books and any remuneration .... to the construction of the Town Hall for the speedy completion of which I intend raising loans. After completion of the building, and discharge of all the debts contracted for this purpose, I will hand over the building for use of Rajahmundry public.

ఈ ప్రకారముగా సభతోడి సంబంధమును వదుల్చుకొని, రెండు, మూడు వేల రూపాయలతో ఒక చిన్న మందిరము కట్టింపవలెనని పని కారంభించితిని. న్యాపతి సుబ్బారావు పంతులుగారు నాకు 500 రూపాయలు వడ్డీలేక బదులిచ్చిరి. నా శిష్యుడైన ఇంకొక మిత్రుడు 400 రూపాయలు వడ్డీ లేక బదులిచ్చిరి. ఈ రు. 900 లు తోను ఇటుకలు, కర్రలు మొదలయినవి సాధ్యమైనంత చౌకగా కొనుచు, పనివాండ్రను పెట్టి నేనే యొద్దనుండి పని చేయించుచుంటిని. ఈ విషయములో నాకీశ్వర సాహాయ్యము అనుగ్రహింపబడినది. ఈ సంవత్సరమునందు పుస్తక విక్రయము వలన 1000 రూపాయల కంటె అధికముగా వచ్చినవి. ఈ సంవత్సరమున నన్ను సర్వకళాశాలవారు పరీక్షకునిగా నియమించిరి. చెన్నరాజధాని విద్యా విచారణ కర్తగారు నన్ను మధ్యమ పాఠశాలా పరీక్షకునిగా నియమించిరి. ఈ ప్రకారముగా నే నెదురు చూడని ధన ప్రాప్తి కలుగగా, 3 వేలతో ముగింపవలెననుకొన్న భవనమును పెంచి, 7 వేల రూపాయలు దాని నిమిత్తమయి వ్యయ పెట్టితిని. ఈ పురమందిర నిర్మాణములో నాకు సాయముచేసిన పయి యిరువురి మిత్రులకును, ఇతర మిత్రులకును నా కృతజ్ఞత తెలుపవలసియున్నది.

1890 అక్టోబరు నెలలో దానిని తెరిచి, గృహ ప్రవేశోత్సవ సమయమందు, ప్రస్తుతము చెన్నపురి రాజధానీ రాజకీయశాస్త్ర పాఠశాలలో సంస్కృతోపన్యాసకులుగా నున్న రావు బహద్దురు రంగాచార్యులు (M.A.) గారు నన్ను గూర్చి ఇంగ్లీషున 23 తేదీన నొక ఉపన్యాస మిచ్చిరి. అటు తరువాత, కలకత్తాలోని సాధారణ బ్రహ్మసమాజ ప్రధాన బోధకులైన పండిత శివనాధశాస్త్రి (M A.) గారు రాజమహేంద్రవరమునకు వచ్చి,

నవంబరు 15 న నన్ను గూర్చి కొంత చెప్పి, పురమందిరములో రాజమహేంద్రపురవాసులప్పటినుండి నిరాటంకముగా సభలు మొదలయినవి చేసికోవచ్చునని ఘోషించిరి. పయి యిరువురు నన్ను గూర్చి చెప్పిన దానిలో నా స్తోత్ర పాఠములు తప్ప విశేషాంశము లేవియు నుండవు గనుక వాని నిచ్చట వివరించుట అనావశ్యకము.

1896 తో పట్టణ మందిర నిర్మాణ విషయమున నేను చేసిన ఋణము లన్నియు పూర్ణముగా తీరిపోయినవి. మందిరమునకు నా పేరు పెట్టవలసినదని కొందరును, నేను కూడా ధర్మకర్తగా నుండుట యావశ్యకమని కొందరును చెప్పిరికాని, వారి మాట వినక, చెన్నపట్టణమునకు పోవుటకు ముందు, 1897 డిసెంబరు నెలలో నిక్షేప పత్రము (Trust Deed) వ్రాసి లేఖ్యరూఢము చేయించి (register) మందిరము ధర్మకర్తల కొప్పగించి పోయితిని.

పురజనుల ఉపయోగార్థము పురమందిరము నేను కట్టించి ఇయ్యదలచి నప్పుడు సంతోషించి పురజనులందరును నాకు తోడుపడి యుందురని మీరు అనుకోవచ్చును. మా పట్టణమట్టి పాపము కట్టుకోలేదు. నేను పురమందిరమును కట్టించుటకు ముందే ఆ స్థల విషయము నాలుగు వ్యాజములు వేయబడి కొట్టుబడి పోయినవి. ఇవి యిట్లుండగా 1889 సెప్టెంబరులో, ఖాజా అహమ్మదుల్లా ఖాన్‌గారు ఇచ్చిన స్థలములో మేము గోయి పెట్టి కర్రలు కోయించుచుండగా ఒక పెద్ద మనుష్యుడు ఖాజా సాహెబుగారి దూరజ్ఞాతి అయిన ఒక బీద తురకవానిని పిలిపించి, వాని చేత నేను తన తాత సమాధిని తవ్వించివేసినట్టు నా పయి అభియోగమును తెప్పించెను. రంపపు గోతిలో నుండి తన తాతగారివని ఏరితెచ్చిన ఎముకల బుట్టతో ఆ బీద తురకవానిని పోలీసువారు రాజకీయ వైద్యునిచేత పరీక్షింపించి, వాని తాత ఎముకలన్నియు మేక ఎముకలని డాక్టరు నిర్ణయ పత్రమిచ్చిన తరువాత, ఇతరులను గూడ విచారించి, ఏలూరి లక్ష్మీనరసింహము గారి ప్రేరణచేత తేబడినదిగాని నిజమైన అభియోగము కాదని తెలియజేసిరి.

నాకు బాల్యమిత్రుడైన ఏలూరి లక్ష్మీనరసింహముగారు నాపై ఇట్టి తప్పుటభియోగమేల తెప్పింతురని అడుగవచ్చును. ఆస్తిక పాఠశాలా స్థాపనము తరువాత ఆ పాఠశాల విషయమున నాతడనుసరించిన

మార్గమును, రాత్రి పాఠశాల విషయమున నాతడు త్రొక్కిన త్రోవయు ఇతర విషయముల యందతడనుసరించిన పద్ధతులును నింద్యములు నాకు కనబడినందున నేనప్పుడప్పుడాయనను మందలించుటయు, వివేకవర్ధనిలో వ్రాయుచుండుటయు తటస్థించెను. అతడును తాను ప్రచురించెడు Godavary News అను పత్రికలో నాకు వ్యతిరిక్తముగా వ్రాయ దొడగెను.

ఇట్లుండగా అతడు రాజమహేంద్రవరోన్నత పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడును, పురపారిశుద్ధ్య సంఘమున కధ్యక్షుడును అగుట తటస్థించెను. ఈ కాలములో నెప్పల్లె రామబ్రహ్మమను గృహస్థుని ఇంటిమీద రాళ్లు పడుచుండెను. రామబ్రహ్మముగారి వదినెగారయిన శంకరమ్మ ఈ విషయమయి ఇరుగు పొరుగువారితోను, చుట్టు పట్టులనున్న పెద్ద మనుష్యులతోను మొర పెట్టెను గాని ఎవ్వరును దానిని నివారించుటకయి ప్రయత్నము చేయరైరి. రాళ్లు పడుటకు ముఖ్యకారణము రామబ్రహ్మముగారి మూడవ అల్లుడు, తల్లిదండ్రులులేని, 18 ఏండ్ల ప్రాయముగల దుండగీడు. అతని భార్య 15 ఏండ్ల ప్రాయముగలది. అతడు ఏలూరి లక్ష్మీనరసింహము గారి సన్నిధాన వర్తిగా తిరుగుచుండెడివాడు. అతడు తన భార్యను పంపవలసినదనియు, తాను వేరు కాపురముండెదననియు అత్త వారినడిగి నిర్బంధించుచురాగా, కాపురముండుటకు ఇల్లు లేకుండుటనుబట్టియు, నిరుద్యోగి అగుటచే భార్యను పోషించుటకు శక్తిలేని వాడగుటను బట్టియు ఆ చిన్న దానిని పంపకపోయిరి. ఆ పిల్లవాడు అత్తవారియింటి నుండి లేచిపోయి, పూర్ణముగా లక్ష్మీనరసింహముగారి సంరక్షణలో చేరెను. ఆయన పురపాలక సంఘమువారి అధికారములో నున్న కంభము వారి సత్రములో అతనికి భోజన వసతి ఏర్పరచి, మరణ కాలమునందు తండ్రి ఇచ్చిపోయిన 500 రూపాయలుగల Savings Bank Book తన అధీనములో నుంచుకొనెను.

అతడు ఇల్లు వెడలిపోయినది మొదలుకొని రాళ్లుపడుట నెలలకొలది నడచెను. ఎవ్వరితో చెప్పుకొన్నను పాలనములేక పట్టపగలు రాళ్లింటిమీద వర్షపాతమువలె పడుచుండుట కోర్వలేక, ఒకనాటి మిట్ట మధ్యాహ్నమున శంకరమ్మ మా యింటికేడ్చుచువచ్చి, లక్ష్మీనరసింహముగారు తమ అల్లుని స్వాధీనము చేసికొని రాళ్లు వేయించుచున్నాడని చెప్పి, ఏలాగుననైన తమ బాధ మాన్పి రక్షింపుమని నన్ను దీనముగా వేడుకొనెను. మనసు

కరిగిన వాడనయి నేనామెవెంట వారి యింటికి పోయితిని. ఆమె తమ యింటి ముంగిట పడియున్న యిటుక ముక్కలను చూపి, అవి దుగ్గిరాల వారి దొడ్డిలో నుండి వేయబడినవని చెప్పెను. అవి వానకు తడిసి పాకుడు పట్టినవి. దుగ్గిరాలవారి దొడ్డిలోనికి పోయి చూడగా పాకుడు పట్టిన ఇటుక ముక్కల కుప్పలు పెక్కులుండెను. దుగిరాల వారి ఇంటిలో లక్ష్మీనరసింహముగారికి ఆప్తులును, వారి పాఠశాలలో ఉపాధ్యాయులును అయిన ఇద్దరు బ్రహ్మచారి బ్రాహ్మణులు, వెంకటప్పయ్య, తిరుపతి రాజు అను వారు వాసము చేయుచుండిరి. ఈ పని వారి తోడు పాటుతో జరుగుచున్నదని భావించి, గృహ యజమాని అయిన దుగ్గిరాల ప్రకాశరావును కలిసికొని, ఆ బ్రహ్మచారులను తమ యింటినుండి పంపి వేయుట గురించి మాటాడి, మరల రామబ్రహ్మముగారి యింటికి వచ్చితిని. మేమక్కడ నిలుచుండగానే వీధి ప్రక్క నుంచి వచ్చి ఒక రాయి మేమున్న చోట పడెను. అది నల్లరాతిముక్క. అది చిన్నస్వామిగారి మేడ మీది నుండి వేయబడినదని శంకరమ్మ కేకలువేసెను. అక్కడకు పోయి చూడగా ఇంటి మీద పడిన రాతి ముక్కల వంటివి రెండు కనబడెను. ఇట్టి అనుచిత కార్యమును చేయించుట మంచిది కాదని చెంతనున్న చిన్నస్వామిగారి రెండవ కుమారుని మందలింపగా అతడు, "లక్ష్మీనరసింహముగారి చాకలి వాడే పట్టపగలు రాళ్లు వేయుచుండగా వాని నేమియు చేయక మమ్మేల నిందించెదరు?" అని అడిగెను.

అందుచేత, రాళ్లు వేయించుటలో లక్ష్మీనరసింహముగారి సంబంధము తప్పక యున్నదని నిశ్చయించి, ఆయన పాఠశాలకు పోయి, ఆయన ప్రాణమిత్రులయిన నిడమర్తి దుర్గాప్రసాదరాయుడుగారును, సహోపాధ్యాయుడైన దామరాజు బసవరాజుగారును దగ్గరనుండగానే, "రామబ్రహ్మముగారి అల్లుని చేరదీసి, వారి యింటి మీద మీరు రాళ్లు వేయించుచున్నారని చెప్పుచున్నారు. ఎంతవరకు నిజము?" అని అడిగితిని. ఆయన తానేమియు నెరుగనని చెప్పగా ఇంటికి పోయితిని. లక్ష్మీనరసింహముగారు ఈ విషయము ఏమైన జరుగునేమో అని భయపడి మరునాడు తెల్లవారునప్పటికి తన మిత్రుడైన మాదిరెడ్డి నారాయణస్వామి నాయుడుగారి యింటికి పోయి ఏమో మాట్లాడగా, నాయుడుగారు నాకు వర్తమానము పంపిరి. జరిగినదేమని అడుగగా, సర్వవృత్తాంతమును

చెప్పి, చాకలివాడు మొదలైనవారి పేరు లెల్ల చెప్పితిని. అక్కడి కందరిని పిలుచుకొని వచ్చుటకయి మనుష్యులను పంపిరిగాని, కొందరు రాలేదు. వెంకటప్పయ్యను, తిరుపతిరాజును దుగ్గిరాలవారి యింటి నుండి పంపి వేయుటకు నిశ్చయింపబడినది.

వీరాస్వామి నాయుడుగారి యింట సమావేశము జరిగిన రెండు దినములకు రామబ్రహ్మముగారు నా యొద్దకు వచ్చి, మరల రాళ్లు పడుచున్న వనియు, ఏలాగుననైన రాళ్లు వేయుట మాన్పించి తమ్ము అపాయము నుండి రక్షింపవలసినదనియు వేడుకొనెను. పోలీసిన్‌స్పెక్టరును వెంట బెట్టుకొని పోయి ఆ స్థలమును చూపి ఆ ఘోర కృత్యమును మాన్పవలసిన దని కోరితిని. భటులను కావలి యుంచి రాళ్లు వేయువారిని పట్టు కొనుటకు ప్రయత్నించెదనని చెప్పి ఆయన వెడలిపోయెను.

నేను దుగ్గిరాల వారి దొడ్డిలో నుంచి వచ్చుచుండగా వేలూరి వెంకట్రామయ్యగారు వెలుపలికి వచ్చి, నెప్పల్లెవారి విషయము తాను విన్న విషయములను చెప్పనారంభింపగా, చుట్టుపట్టువారును వచ్చి తామెరిగి నది చెప్పజొచ్చిరి. అందరమును వెంకట్రామయ్యగారి వీధి అరుగు మీద కూరుచుండి, వారు వారు చెప్పునవి వినుచుండగా, లక్ష్మీనరసింహముగారి మిత్రుడైన బయపునేడి వేంకట జోగయ్యగారచ్చటికి వచ్చి, జరిగిన కథ నంతనూ చెప్పగా, లక్ష్మీనరసింహగారి సమక్షమున నీవ్యవహారము నడచుట మంచిదని చెప్పి, తాను పోయి ఆయనను తీసికొని వచ్చెను. లక్ష్మీనరసింహముగారు, ఈ యల్లరి అంతయు నేను చేయుచున్నాను గాని, నా మీద నెవరు సందేహపడుచుండ లేదని చెప్పెను. వేంకట జోగయ్యగారు, "ఇంతమంది మీకు వ్యతిరేకముగా చెప్పుచున్నప్పుడు మీరు మీ నడతను శుద్ధపరచుకోవలసినది," అని లక్ష్మీనరసింహము గారితో చెప్పవలసిన వారయిరి. ఈ దినము మొదలుకొని రామబ్రహ్మము గారి ఇంటి మీద రాళ్లుపడుట నిలచిపోయి, నా కృషి వలన వారి ఆపద నివారణమయినందుకు నేను సంతోషించితిని.

తరువాత దాదాపుగా సంవత్సర కాలమునకు లక్ష్మీనరసింహముగారు, తాను ఇండ్లమీద రాళ్లు వేయించినట్టును, తన నడత మంచిది కానట్టును, నేను పెద్ద మనుష్యుల ఎదుట దూషించినందుకయి, 3,000 రూపాయల మాన నష్టమునకు 1890 జూలయి 15 న మండల న్యాయ సభలో నా

మీద వ్యాజ్యము తెచ్చి, జూలయి 29 న సంయుక్త దండవిధాయి (Deputy Magistrate) యొద్ద దూషణము కొరకు Criminal అభి యోగము తెచ్చెను.

ఈ విషయమున మండల న్యాయాధిపతి తన తీర్పులో నిట్లు వ్రాసెను. "There is no doubt whatever in my mind that at the time when the imputation and insinuation were made plaintiff's reputation was distinctly bad; and I cannot help thinking that it was his own consciousness of this fact that prompted him after launching this suit, to proceed criminally against defendent in the Joint Magistrates Court where his own character and reputation could not be gone into, so that if he succeeded there, he would be in a position to withdraw this suit without any exposure."

ఈ యభియోగముతోడనే "మహారణ్య పురాధిపత్యము" అన్న ప్రహసనము తన్నుద్దేశించినదనియు, తత్ప్రకటనమున అభియోగమును తెచ్చిరి. ఈ వ్యవహారములను నడుపుటకయి నేను సంవత్సరకాలము సెలవు పుచ్చుకొని పాఠశాలకు పోవుట మానితిని. వాది పక్షమున దుర్గా ప్రసాదరాయడుగారు నన్నేలాగుననైన శిక్షింపజేయవలెనని పట్టుదలతో పని చేయదొడగిరి. నా పక్షమున న్యాపతి సుబ్బారావు పంతులుగారు నన్ను శిక్షనుండి తప్పింపవలెనని పదిరెట్లెక్కువ పట్టుదలతో పనిచేయ సాగిరి. పంతులుగారు పడిన శ్రమ యింతింతని చెప్పుటకు శక్యముకాదు. ఈ పనిలో నాయన నిద్రాహారములను గణన చేయలేదు. నా విషయమయి ఆయనకుండిన చింతలో షోడాశాంశమైనను నాకు లేకుండెను. రాత్రు లప్పుడప్పుడు నన్నాయన తమ యింటికి రమ్మనుచుండెడి వారు. నేను సుఖముగా భోజనము చేసి పోయి, ఆయన కష్టపడి గ్రంథము "చదువు చుండగా నేను పరుండి హాయిగా నిద్రపోవుచుండెడి వాడను. "ఇన్ని వ్యవహారములు పైని నిలుచుండగా నిద్ర యెట్లు పట్టును? అని ఆశ్చర్యపడి, నన్నాయన లేపి మా యింటికి పంపుచుండెడివారు. లక్ష రూపాయ లిచ్చినను నాకు వారు చేసిన ఉపకార ఋణము తీరదు.

వ్యవహారము కొంతవరకు నడచిన తరువాత నా ప్రతిపక్షులు చిక్కులో నుండి గౌరవముగ యీవల పడవలెనని చింతింప మొదలు పెట్టిరి. ఉభయ పక్షములకు సంధి చేయవలెనని ప్రముఖులనేకులు ప్రయ

త్నించిరి గాని నా మూర్ఖపు పట్టుదలవల్ల వారి కృషి సఫలమయినది కాదు. మా పాఠశాల ప్రధానోపాధ్యాయులైన మెట్కాపు దొరగారు, నేను క్షమా ర్పణమునుగాని, విచార సూచనమును గాని చేయవలసిన పని లేద నియు పూర్వమాయన నడత మంచిది కాదని అభిప్రాయపడి, ఇప్పుడితరులు మంచిదే అని చెప్పుటచే నే నన్నమాటలు మరలించు కొనుచున్నానని చెప్పిన చాలుననియు బహు విధముల నాతో చెప్పిరి.

"ఇప్పుడు సహిత మతడు మంచివాడు కాడనియే నేను దృఢముగా నమ్ముచున్నందున సందిగ్ధ వచనములు వ్రాయుట కొడబడ నేరను," అని ఆయన కోరికను నిరాకరించితిని. వారు కోరిన దానికొప్పుకొని సంధి చేసికోవలసినదని సుబ్బారావు పంతులు గారెంత దూరమో చెప్పిరిగాని నేనే నా పట్టు విడకుంటిని. నేను నాకు తోచినట్టుగాని ఇతరులు చెప్పినట్టు చేసెడు స్వభావము గలవాడను కాను. ముందు కార్యమే విధమున ముగియునో యని భయపడు స్వభావము గలవాడను కాను.

1891 జూలయి 27 న దండ విధాయకుడు తీర్పు చెప్పి, నా మీద తెచ్చిన అభియోగములు రెంటిని కొట్టివేసెను. నా ప్రతిపక్షిని గూర్చి తీర్పులో వ్రాయబడిన కొన్ని భాగములు :

"The general reputation of the complainant as a man of adulterous character, untruthful and given to misappropriating money, is proved by the evidence to be perfectly true... He was working in a number of schools as the Agent or Manager of the Theoretic Society in the interest of religion and morality, was in reality working these schools as private proprietory schools of his own,... The society did not hold meetings, had no rules and no funds. No one had a right to call for accounts. He says "I treated My schools as part of my property"... There were ample grounds for an unprejudiced person so describe him as a man who was not of good character."

ఇక, ఇండ్ల మీద రాళ్లు వేయించుచున్నారని నేనన్న రెండవ విషయ ములో మండల న్యాయాధిపతి తీర్పులో నుండి ఎత్తి వ్రాయుట కనుజ్ఞ వేడుచున్నాను :

"According to both sides stone-pelting had been going on at intervals for some months up to August 1889 on Ramabrahmam's

house. Ramabrahmam, his sister-in-law who was the senior lady of the house had repeatedly complained that the stones were being thrown - by their son-in-law, a boy in whom plaintiff admittedly took a special interest, and who, at the time, was living separately in a choultry under arrangements admittedly made by the plaintiff. . . . Sankaramma had been going about making no secret of her suspicions that plaintiff was instigating the boy to pelt stones on their house because they had refused to send the boy's wife away to live separately with him, the suggestions being that the plaintiff had an improper object, .. from the evidence it is also plain that it was only after nothing had come of all her previous complaints and after respondent (Veeresalingam) had once declined to interfere in the matter and had referred her to the authorities that he was moved by Sankaramma's appeals on the 28th July 1889 to assist her by his inquiries.. His (defendant's) whole conduct shows that he entered upon his enquiries under pressure from Sankaramma and with the distinct authority of herself and Ramabrahmam. I can find nothing in the evidence to show that he acted without ordinary care or any unfair or undue manner. There can be little doubt that defendant did honestly believe, in all the circumstances before him, that plaintiff instigated stone-throwing."

1890 జూలై 15 న మండల న్యాయ సభలో 3,000 రూపాయల మాన నష్టమునకయి నా పైని లక్ష్మీనరసింహముగారు తెచ్చిన వ్యాజ్యము అంత శీఘ్రముగా ముగియక, దాదాపుగా మూడు సంవత్సరములు నడచిన మీదట 1893 మార్చి 10 న తీర్పుబడెను. ఈ తీర్పులో మండల న్యాయాధిపతి ఇంచుమించుగా సారాంశముల నన్నిటిని నా కనుకూలముగానే నిర్ధారణ చేసినను, "ఇండ్లమీద రాళ్లు వేయించువారు పెద్ద మనుష్యులుగా పరిగణించబడు చున్నారు" అని నేను వివేకవర్ధనిలో ప్రకటించిన దానిని గూర్చి నాకు ప్రతికూలముగా నిర్ణయము చేసి, నేనొక అణా వాదిపరువు నష్టి క్రింద నిచ్చునట్లును, ఎవరి వ్యయములు వారే భరించునట్లును తీర్పు చెప్పెను.

ఈ వ్యవహారము లిట్లు తీర్పుబడిన తరువాత సహితము లక్ష్మీనర

సింహముగారు నా యెడల మంచి అభిప్రాయమును విడువక, కనబడిన చోట నెల్ల నాకు నమస్కారము చేయుచు, నాతో మాటాడుచు వచ్చిరి.

పురమందిరముతో చేర్చి కట్టిన ప్రార్థన మందిరము గూర్చి కొంచెము చెప్పవలసియున్నది. ప్రార్థన మందిరమునకయిన వ్యయములన్నిటిని నేనొక్కడనే భరింపలేదు. ఈ మండలములోని డెల్టా సూపరింటెండెంటుగా నుండిన టి. శేషాచలము నాయుడుగారు 1874 లో తమ మరణ శాసనములో రాజమహేంద్రవర ప్రార్థన సమాజమునకు నూరు రూపాయ లిచ్చునట్లు వ్రాసి లోకాంతరగతులుకాగా, అనంతర మాయన అన్నగారు ఆ నూరు రూపాయలను నా యొద్దకు పంపిరి. ఆ నూరు రూపాయలను ఏదో ఒక స్థిరమైన పనికి ఉపయోగింపవలెనని ఆలోచించుచుండగా ఈశ్వర ప్రేరణముచేత ప్రార్థన మందిరమును కట్టింపవలెనన్న బుద్ధి ఉద యించినది. నా సంకల్పమును వెంటనే రాజా గోడే నారాయణ గణ పతిరావు బహదూరు సి. ఐ. గారికి తెలిపి, సహాయమువేడగా, వారు 300 రూపాయలను పంపిరి. నావి 200 రూపాయలు చేర్చి మా సామాజిక మిత్రులకు తెలుపగా, న్యాపతి సుబ్బారావు పంతులుగారు 50, కనపర్తి శ్రీరాములుగారు 50, ఆర్. వెంకటరత్నము నాయుడుగారు 50, పెద్దిభట్ల వెంకటప్పయ్యగారు 50, రాయసము వెంకటశివుడుగారు 50 రూపాయలు చందాలు వేసి తోడుపడిరి. మేము ప్రార్థన మందిరమును కట్టింపబోవు చున్నామని విని, మేమడుగకయే, ముగ్గురు స్త్రీలు భక్తితో, ఒకరు మూడు రూపాయలును, మరి ఇద్దరు ఐదేసి రూపాయలును నా వద్దకు పంపిరి. ధనికులైన పురుషులిచ్చిన నూరులకంటె, అస్వతంత్రులయిన అబలలిచ్చిన ఈ మూళ్లును, ఐదులును భగవంతునికి అధిక ప్రీతికరములని నేను భావించెదను.

మందిర నిర్మాణ సమయమున దగ్గరనుండి పని చేయించుచు నాకు తోడ్పడిన రెబ్బాప్రగడ పాపయ్యగారికి వందనములర్పించుచున్నాను. ఈ మందిర నిర్మాణమునకు దాదాపుగా రు. 1500 లు అయినవి. నేను స్థలము నిచ్చుటయేకాక, చందాల మూలమున వచ్చినదికాక మిగిలినది నేనే భరించితిని. సంవత్సరోత్సవ సమయమందు ఆర్. వెంకటరత్నము నాయుడుగారు బందరు నుండి వచ్చి, మందిరమును తెరచి 1897 ఏప్రిల్ 17 న గృహ ప్రవేశోత్సవమును నడపిరి.

1893 ఆరంభమున నూతన సంవత్సరపు బిరుదులలో ఇండియా దొర తనము వారు నాకు రావు బహదూరు బిరుదము అనుగ్రహించిరి. ఈ బిరుదాంకితమునకు నేను అర్హుడనగుదునో కానో కాని, బహు స్థలముల నుండి నేనెరిగిన వారును, ఎరుగని వారును కూడ అభినందించుచు లేఖలు వ్రాసిరి. నూటికంటె ఎక్కువగా వచ్చిన లేఖలలో కొన్ని :

"Let me lose no time in congratulating you on your new honour . . . There is none within my knowledge who has better deserved it .. E. P. Metcalfe Esq., M.A., Principal Rajahmundry College".

"How rejoicing I am now when I am constantly thinking of the truly deserved honour conferred on your good self. In the long list of recipients of honours I cannot think of a more deserving recipient . . . S. Rangiah Chetty, B.A., Telugu Translator to Government of Madras."

"Although we are strangers to you we have much pleasure in conveying our sincere and cordial congratulations to you on the well deserved distinction conferred on you one too soon by the Government of India. Our regret that we do not accept your theories in regard to social reforms concerning betrothal and marriage does not in the least mitigate against our admiring your single mindedness of purpose and perseverance in the paths of practical reform- N. Pattabhirama Rau, T. Varada Rao, Calicut."

"Though I have not known you in person, I have heard a great deal about you . . I am very glad to congratulate you on the work merited honour conferred on you by the Government of India .. M. B. Sreenivasaingar, Head Master, High School, Kolar, Mysore."

నాకభినందన పత్రికలు పంపినవారిలో అనేకులు, ఆంధ్ర భాషాభివృద్ధిక్, సంస్కార విషయమునకు నేను చేసిన అల్పకార్యమును మహాకార్యముగా పొగడిరి. కొన్ని సమాజములవారు నన్నభినందించుచు నిర్ధారణము (resolution) చేసి నాకు పంపిరి. అట్టివారిలో నొకటి :

"We the members of the Literary Association, Coconada (Kakinada) feel highly rejoiced that Government has bestowed

on you the distinction of 'Rao Bahadur' and, on offering you our hearty congratulations on this recognition of your invaluable services to the country, we feel proud to note with great satisfaction that the choice could not have fallen upon a worthier person than one who distinguished from his early days for a task for letters, for high conception of duty and for strong individuality of character, has so long devoted himself to the task of social and religious reforms, to the improvement of vernacular literature, for diffusing useful knowledge among his countrymen and women and to the improvement of the moral tone of society and has made large and noble sacrifices in endeavouring to attain the object he has set for himself without hoping for any remarks.

We pray to the Almighty to give you long life and enable you to continue your labours in the field of good work.

We have the honour to be
Dear Sirs,
Your obedient Servants
Duriseti Seshagiri Rao, Chairman etc."

ఇంగ్లీషు వార్తాపత్రికలలోను, తెలుగుపత్రికలోను నన్నభినందించుచు వ్యాసములు వ్రాయబడినవి. ఒక్క "ఆంధ్రప్రకాశిక" లోని దానిని ఉదాహరించుచున్నాను.

" రాజమహేంద్రవరము గవర్నమెంటు ఫస్టుగ్రేడు కాలేజిలో ప్రధాన పండితులగు మ.రా.రా.శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారికి ఈ సంవత్సరారంభమున ఇండియా గవర్నమెంటువారు 'రావు బహద్దూర్' అను బిరుమ నొసంగిరి.....ప్రస్తుతము ఇంగ్లీషు విద్య నభ్యసించిన నాగరికులందరిలోను ఈయన మహనీయులు. ఈయన యొక్క అత్యద్భుతమగు నీతి ప్రవర్తనయును, తెలుగు గ్రంథముల వ్యాప్తికిని, అభివృద్ధికిని ఈయన పడిన ప్రయాసమును, సంఘ సంస్కరణము కొరకు ఇరువది సంవత్సరముల నుంచి ఈయన పడుచుండిన పాటును, ముఖ్యముగా స్త్రీ పునర్వివాహము నకయి తమ ధనమును, కాలమును, శక్తిని వినియోగ పరచుటయును, సుగుణవంతులైనట్టియు, దేశ క్షేమము కోరునట్టియు, బుద్ధిమంతులైనట్టియు సర్వజనులలోను ఆ మహనీయునకు మిగుల విఖ్యాతిని కలుగ జేసినవి. ఆయన సర్వ సత్కార్యములను కీర్తినేమియు, అపేక్షింపకయె, భగవంతుని

నమ్మకొని, తాము విధిగా చేయవలసిన పనులనియే చేయుచుందురు........ తాము చేయు సత్కార్యములందు అధిక పట్టుదలయు, సాహసమును కలిగియుండుటయేగాక, సర్వ విధ పాప కార్యముల యందును, డంబముల యందును అసహ్యాము కలిగి, సర్వజనోపయోగకరములగు పనులను సదా చేయుచుందురు. ఆయన తెలుగు భాషయందు వచన కావ్యములు, పద్యకావ్య ములు, నాటకములు, ఉపన్యాసములు (Essays) శాస్త్రములు మొదలగు నవి సుమారు 80 గ్రంథములవరకును చేసిరి. ఈయన తెలుగు వచన కావ్యములకు తండ్రి అని చెప్పవచ్చును. ఈయన గ్రంథములన్నియు మృదు మధుర సులభ శైలిని వ్రాయబడి, నీతి పూరితములయి యుండుటయే గాక, హిందూ దురాచార రోగ రసాయనములుగా నుండును. ఈ మహ నీయుడు పూర్వ నాగరిక పరాయణుల చేతను, ఈర్ష్యగల మరి కొందరి చేతను నసహ్యింపబడుచున్నను, సర్వదా దుర్దశనుండి తొలగింపబడిన సుమారు ఇరువది మంది యువతుల యొక్కయు, స్వదేశాభిమానుల యొక్కయు, ఆంధ్ర విద్యాభివృద్ధినికోరు అనేక జనుల యొక్కయు, నవ నాగరికుల యొక్కయు, దీవనలకు పాత్రుడు గదా! ఈ బిరుదు నీయుటలో గవర్నమెంటు వారు మిగుల ఘనకార్యమును చేసినను, ఈయన మాత్రము ఈ బిరుదునకు విశేష లక్ష్యము చేయరని ఆయన నెరిగినవారెవరును తలంచరు. ఈ బిరుదు ఈ మహనీయుని నామమునకు చేర్చబడుటవలన దానికే ఎక్కువ కాంతి కలిగినది. బిరుదులు కలవారును, విద్యా ధనము కల వారును, అనేకులు మనదేశమునందున్నను, ఈయన వలె ధైర్యసాహస ములతో అనేక కష్టములకు లోనయి, దైవమును మాత్రమే నమ్మి పని చేయువారు బహు అరుదు గదా! దక్షిణ హిందూదేశ విద్యాసాగరునకు ప్రస్తుతమీ బిరుదు నొసంగుట కొందరు మహాశుంఠలకు కండ్లలో ఇసుక వేసి నట్లున్నను ఉండనిండు. వీరు ఇంకను చిరకాలము జీవించి పరోపకారము చేయునటుల సత్పురుష వాత్సల్యుడు అనుగ్రహించుగాక!—ఆంధ్ర ప్రకాశిక 1893 జనవరి 14.

రాజమహేంద్రపుర రాజకీయ కళాశాల ప్రధానాధికారియైన మెట్కాఫు దొరగారి అధిపత్యమున పురమందిరములో ఒక సభచేసి నాకభినందనము చేసిరి. అటు తరువాత, చెన్నపురి రాజధానీ విద్యా విచారణాధికారి డంకన్ దొరగారు రాజమహేంద్రవరము వచ్చినపుడు కళాశాలా భవన

ములో నొక సభచేసి, ఉపాధ్యాయుల, బాలుర సమక్షమున దొరతనము వారంపిన సనదును నాకు బహిరంగముగా దయచేసిరి.

వితంతు వివాహ ప్రారంభ దశలో నాకు విశిష్ట జనులకంటె విద్యార్థి జనులే ఎక్కువ సహాయులుగా నుండిరి. అట్లుండుటకు కారణము నా బోధలు వారి మనస్సులకెక్కుటయే. సత్కార్య బీజములను హృదయ క్షేత్రముల యందు నాటించి సఫలములగునట్లు చేయుటకయి బాల్యావస్థయే ఉత్తమ మైనది. అందుచేత బాలురకు భగవద్భక్తియు. పరోపకారా సక్తియు బోధించెడు పాఠశాల యుండిన, శీఘ్రకాలములో దేశాభివృద్ధి కలుగునని మొదటి నుండియు నా నమ్మకము. ఈ నమ్మకము చేతనే, యేలూరి లక్ష్మీనరసింహముగారు ఆస్తిక పాఠశాలను స్థాపించదలచినప్పుడు నే నాయనను ప్రోత్సాహ పరచితిని. ఆ పాఠశాల 1889 వరకు నుండినను తలచుకొన్న ఉద్దేశము లేవియు దానివలన నెరవేరలేదు. పేరు పెట్టిన మాత్రమున సదుద్దేశములు నెరవేరవు. ఆ సదుద్దేశములను బాలుర హృదయములలో పట్టించుటకు తగిన శక్తి సామర్థ్యములును, శ్రద్ధా భక్తులునుగల ఉపాధ్యాయులు కూడ కావలెను. అట్టి ఉపాధ్యాయులను వారు కూర్చి ఆస్తికమత పాఠశాలను స్థాపింపవలెనని, నాయొద్ద చదువుకొనియున్న వారిని కొందరిని పురికొల్పి ఒప్పించితిని. 1893 లో పట్టపరీక్షలో కృతార్థులయి యుండిన రాయసము వెంకట శివుడుగారును, సత్తిరాజు మృత్యుంజయరావుగారును, L.T. పరీక్షకు చదువుటకయి సైదాపేటకు పోయిరి. పయి సంవత్సరము సైదాపేట బోధనాభ్యాసన కళాశాలకు (Teachers Training College, Saidapet) పంపుటకు మరి యిద్దరిని సంసిద్ధులనుగా చేసి ఉంచితిని.

పాఠశాలా భవనమును గూడ సంపాదింపవలెనని ప్రయత్నము చేయ నారంభించితిని. ఇన్నీసుపేట మధ్యమున నున్న విశాలమయిన తమ తోటను వాడ్రేవు శ్రీరాములుగారు రూ. 1600 లకు విక్రయించుట కొప్పుకొనిరి. ఆ రూపాయలను న్యాపతి సుబ్బారావు పంతులుగారిచ్చుట కొప్పుకొనిరి. కాకినాడ వాస్తవ్యులయిన గంజాము వెంకట రత్నముగారు వేయి రూపాయలు పంపిరి. కాని రాజకీయ కళాశాలాధ్యక్షుని సాహాయ్యము కూడ ఈ పనిలో అత్యావశ్యకము. ఆయనయు, అస్మదాదులును కలిసి పట్టణములోని పాఠశాలలనన్నిటిని కొంచెము కాలము క్రిందటనే ఒక్కటిగా

కలసి ఉన్నత పాఠశాలను స్థాపించితిమి. దానిని దొరతనమువారు పుచ్చుకొని దాని శాఖలుగా రెండు, మూడు మధ్యమ పాఠశాలల పెట్టించు ప్రయత్నము నడచుచున్నది. ఇంతలో నేనే మరియొక పాఠశాలను పెట్టిన యెడల ప్రతిపక్ష పాఠశాలయని దొరగారనుకొనవచ్చును. అందు చేత నేను నూతన పాఠశాలోద్దేశమును తెలుపుచు మెట్కాఫు దొరగారికి వ్రాసి, పాఠశాలాస్థాపనము సాగకపోయిన యెడల, సైదాపేటలో శిక్షణను బడయుచున్న వెంకట శివుడుగారిని, మృత్యుంజయరావుగారిని రాజ మహేంద్రవరములో ఉపాధ్యాయ పదమునందుంచుటకు ప్రయత్నించ వలసినదని కోరితిని.

ఆయన ఉన్నత పాఠశాలను నేను పెట్టుట కొప్పుకోలేదు గాని, నేను మధ్యమ పాఠశాలతో తృప్తి పొందిన పక్షమున పురమందిరమున కెదురుగా నున్న పాఠశాలా గృహమును మాకిప్పించెదనని చెప్పెను. మధ్యమ పాఠశాలలో పని చేయుటకు వెంకట శివుడుగారొప్పుకొనలేదు. ఉన్నత పాఠశాలకు దొరగారొప్పుకొనలేదు. వేయి రూపాయలను గంజాము వెంకట రత్నముగారికి మరల నిచ్చివేసి, అప్పటికి నా ప్రయత్నమును విడిచితిని. సత్తిరాజు మృత్యుంజయరావుగారును, గోటేటి కనకరాజుగారును మధ్యమ పాఠశాలలోనైనను, ఎంత తక్కువ జీతమునకైనను, పరోపకారమునకయి పాటుపడెదమని నిలిచియుండిరి. ఇంతలో పరీక్షా పర్యవసానము తెలిసినది. ఎల్. టి. పరీక్షలో మృత్యుంజయరావుగారు కృతార్థులయిరి. వెంకట శివుడుగారు తప్పిపోయిరి. నా మాటను మన్నించి మెట్కాఫు దొరగారు మృత్యుంజయరావుగారికి రాజకీయ శాస్త్ర పాఠశాలలో ఒకసారిగా నూరు రూపాయల పని నిప్పించిరి.

గంజాము వెంకటరత్నముగారు కాకినాడలో న్యాయవాదిగా నుండి విశేష విత్తమార్జించి, చెన్నపురి దొరతనమువారి శాసన నిర్మాణ సభలో సభ్యులయి, కీర్తిశేషులైన ఉదారపురుషులు. 1896 సం. నందు నా పేరిట కాకినాడ కాలేజీలో విద్యార్థివేతనము స్థాపించుట కుద్దేశించి, తన 2,000 రూపాయల భీమా పత్రమును పంపినట్టు వ్రాసినప్పుడు, నన్ను విడిచి నా కంటె అర్హులయిన వారి పేరిట స్థాపించవలసినదని నేను కోరగా, నాకిట్లు బదులు వ్రాసిరి.

"I came to the resolution after long deliberation. I do not know

if I ever in all my life came to a sounder resolution than this one. I am sure you stand in need of no memorial of the kind, but you will not grudge me the honour of being one of your humble yet ardent, admirers...you cannot realise how much I used to admire you when I was a boy, how far your example has influenced my public life and how admiration has grown as I saw more and more of you. It is only patriotic on the part of every educated man to try to hand down your noble life and example to posterity ...I beg therefore you will kindly accede to my proposal and settle the terms of scholarship.

1898 లో చెన్నపురి దొరతనమువారు నన్ను సభ్యునిగా చేసిరి.

నా ఆరోగ్య హీనతను బట్టి 'వివేకవర్ధని' నిలుపు చేయబడిన తరువాత 1891 లో న్యాపతి సుబ్బారావు పంతులుగారు తెలుగులో 'చింతామణి' అను మాసపత్రికను స్థాపించి, మా వివేకవర్ధనీ ముద్రాక్షరశాలలోనే దానిని ముద్రింపించుచు వచ్చిరి. దానికి నేనును వ్రాయుచుంటిని.

నేను కొన్ని సంవత్సరములనుండి చెన్నపట్టణమునకు పోవలెనని తలచుచుండి, 1894 వేసవికాలపు సెలవులలో అక్కడికి పోయినప్పుడు పరశువాకములో నొక యిల్లు కొని, దానిని పడగొట్టించి మేడ కట్టించితిని. జన్మ స్థలమును, బాల్యమిత్రులను విడిచి దూరస్థలములో నుండునట్లు నన్ను ప్రేరేచిన ప్రయోజనములు రెండు: ఒకటి, నా పుస్తకములను చెన్నపట్టణములో సంపుటములుగా ముద్రించుకొనవలెననుట: రెండవది, సంఘ సంస్కార విషయమున రాజధానిలో పనిచేయవలెననుట.

నేను చేసిన పుస్తకముల సంఖ్య నానాటికి పెరుగుచున్నది. వానిని నేత్రానందకరముగా ముద్రింపించుట రాజమహేంద్రవరమువంటి చెన్నపట్టణములో నాకు సాధ్యము కాలేదు. ఈ పని విశేషవిత్త సాధ్యము. కాని నా చేతిలో ధనము నిలువయుండుట ఎప్పుడును తటస్థింపలేదు. నా పుస్తకముల నితరుల ముద్రాయంత్రములలో ముద్రింపవలెనన్న వేలకొలది రూప్యములు కావలెను. అందుచేత ఒక నూతన ముద్రా యంత్రమును చెన్నపట్టణములో స్థాపించి పని నడుపనుద్దేశించుకొంటిని. ఈ పనికి సహితము ధనము కావలసియున్నది. ఈ ధనమును సమకూర్చుటకయి నా వివేకవర్ధనీ ముద్రాక్షరశాలను చిత్రపు నరసింహారావుగారి కమ్మివేయుటయే

కాక, న్యాపతి సుబ్బారావు పంతులుగారి వద్ద వేయి రూపాయలు ఋణము చేయవలసిన వాడనయితిని. నే నడిగినందునను, నా తోడ్పాటు లేక 'చింతామణి' పత్రికను నడపుట కష్టముగా కనబడినందునను సుబ్బారావు పంతులుగారు ఆ పత్రికను చెన్నపురిలో నడుపుటకు నాకిచ్చివేసిరి. నే నింగ్లండునకు వ్రాసి, ఆవిరితో పనిచేయు మంచి ముద్రా యంత్రమును తెప్పించి, దానికి చింతామణి ముద్రాక్షరశాల అని పేరు పెట్టితిని.

ఆరంభములో ఉన్నత పాఠశాల లేక విద్యావ్యాప్తి తక్కువగా నుండి, చిరకాలము అయోమార్గము సహితము లేక నవ నాగరికతా సంపర్కము కొరవడి యుండి, గోదావరీ పుణ్యనది ప్రాంతమగుట చేత ఛాందస్ల బ్రాహ్మణ మండలితో నిండియుండి, నవాచార విద్వేషమునకు ప్రసిద్ధి కెక్కిన రాజమహేంద్రవరమునందు సంఘ సంస్కార కార్యము నారంభించితిని. ఊసర క్షేత్రమందు కష్టపడు కర్షకుని కృషివలె నా కృషి యిక్కడ తగినంత ఫలదాయకము కాకపోవుట చేత, చెన్నపట్టణము నందు నా కృషి విశేష ఫలప్రదమగునని నమ్మి, చెన్నపురిలోనే స్థిరనివాస మేర్పరచుకొన నుద్దేశించితిని.

నేను తమ్ము విడిచిపోవనున్నట్లు తెలియగానే, నా అభిప్రాయములతో నేకీభవింపనివారు కూడ నాకు గౌరవము చూపుటలో నొక్కటిగాచేరి, తమ విషాదమును తెలుపుచు సభలలో ప్రసంగములు చేసియు, నా పైని పద్యములు వ్రాసియు, నాకు విందులు చేసియు బహు విధముల ఆదరము చూపిరి. అనేక సమాజములవారు నన్ను నడుమ కూర్చుండ బెట్టుకొని ఛాయా చిత్ర ప్రతిమలను తీయించిరి. నా స్తోత్ర పాఠములను వార్తా పత్రికలకు పంపిరి. కాకినాడ పురవాసులను సభచేసి ఈ ప్రకారమే నన్ను సత్కరించి వీడికోలిచ్చిరి. 1897 సంవత్సరాంతమున నేను సకుటుంబముగా చెన్నపురి చేరితిని.

నేను రాజమహేంద్రవరము విడుచునప్పటికి 27 స్త్రీ పునర్వివాహములు జరిగినవి. వీనిలో 20 వ వివాహము ఆదిపూడి సోమనాధరావుగారిది. ఈయన వివాహమాడిన బాలవితంతువు గంజాము మండలములోని ఆసికో (అస్కా) గ్రామములోనిది. ఆ చిన్నది రాజమహేంద్రవరములో వితంతు వులకు వివాహములు చేయుచున్నారని అన్నగారు పత్రికలలో చదువగా విన్నదట! ఆమె మాటల ధోరణిని మెల్లగా తన వదినెగారితో, "రాజ

మహేంద్రవరములో బాలవితంతువులకు వివాహము చేయుచున్నారట!" అని నోరు జారవిడిచెనట. "ఆ మాట అనకూడదు. తప్పు," అని వదినెగారు మందలించెనట. ఆమె మనస్సెరిగినదయి ఆ చిన్నది మరి ఎప్పుడును వివాహము పేరు తలపెట్టక, తనవలెనే పసితనములో పతిని కోలుపోయిన మరియొక బాలవితంతువును గలసి యాలోచించుకొని, రాజమహేంద్రవరమునకు పోవ నిశ్చయించుకొని, ఒకనాడెవ్వరికి తెలియకుండ గ్రామము విడిచి, విజయనగరమునకు వచ్చునప్పటికి రెండవ చిన్నదాని ధైర్యము చెడి, ముందుకు సాగ సాహసింపలేక, అక్కడనే నిలిచిపోయెనట. ఆ చిన్నది మాత్రము వెనుకడుగుపెట్టక, ఒక్కతెయు బైలుదేరి, చేతిపెట్టెలలోని బంగారము సహితము అమ్ముకొని, కొంత దూరము బండి చేసికొని, కొంతదూరము నడచి నిరంతర ప్రయాణములుచేసి, తుదకెట్లో రాజమహేంద్రవరము చేరి, మా యింటపడి లబ్ధమనోరథ అయ్యెను. చిరుత ప్రాయముగల అనాథ కాంత ఒంటిగా బైలుదేరి, మండలములు దాటి, నూరుల కొలది ప్రయాణము చేయగల్గుట శ్లాఘాపాత్రముకాదా! ఈమెను సోమనాథరావుగారు 1893 జూను 28 న పరిణయమయిరి.

నేను 1897 డిసెంబరులో చెన్నపట్టణము చేరి, పరశువాకములోని స్వగృహమందు ప్రవేశించి, అందే చింతామణీ ముద్రా యంత్రమును స్థాపించి, నా పుస్తక ముద్రణ కారంభించితిని. పని ముగియునప్పటికి రెండు సంవత్సరములయినది. నా పుస్తకములన్నియు పది పెద్ద సంపుటములయినవి. నా శరీరము మరింత దుర్బల పడినందున, సంవత్సర కాలము నడపిన తరువాత 'చింతామణి' పత్రికను నిలుపు చేయవలసినవాడనైతిని.

సంఘ సంస్కరణ సమాజమునకును, దక్షిణ హిందూస్థాన బ్రహ్మ సమాజమునకును అధ్యక్షుడను చేయబడితిని. చెన్నపురి పాఠశాలా పుస్తక దేశభాషా సంఘమువారు తమ కార్యనిర్వాహక సంఘ సభ్యులలో నన్నొక సభ్యునిగా చేసిరి. దొరతనము వారు తమ పఠనీయ గ్రంథ సభ (Text Book Committee) లో నన్నొక సభ్యుని చేసిరి. సర్వకళాశాల వారు తమ ద్రవిడభాషాధ్యయన సభలో నన్ను సభ్యుని గావించిరి. కట్టికడపట, ప్రభుత్వమువారు ఉపకర గ్రాహులు మొదలైనవారు చేయు తెలుగు పరీక్షలలో నన్నొక పరీక్షకునిగా నియమించిరి.

నేను చెన్నపురికి పోవునప్పటికి, సంఘ సంస్కరణ సమాజమువారిచే ఏర్పరుపబడిన సంస్కారభోజనములు శ్లాఘింపబడుచు వచ్చినవి. సంస్కార భోజనముల కాహూతుడనయి ఒకసారి పోయితిని. ఈ భోజనములు పుర మందిరములోని ఒక గదిలో ఏర్పాటు చేయబడెను. దక్షిణాత్య బ్రాహ్మణు డొకడు వంట చేసి వడ్డింపగా నెనమండ్రుగురు భోజనము చేసిరి. వారిలో ఇద్దరు బ్రాహ్మణేతరులుండిరి. దాక్షిణాత్య భోజనము సరిపడనందున నే నింటికాకలితో వచ్చి, మరల భోజనము చేయవలసిన వాడనైతిని.

సావకాశముగా ఆలోచింపగా సంస్కార భోజనము యొక్క ఆధిక్యము నాకు బోధపడినది కాదు. మరల సంస్కార భోజన దినము వచ్చినది. ఈ సారి ఇంట భోజనము చేసి మరి పోయితిని. తక్కినవారు ఆకలి తీర్చుకొను చుండగా కడుపు నిండిన నేను మాటల కారంభించి నా సంశయముల తీర్చుకొంటిని. ఈ భోజనములలో విశేషమేమని అడిగితిని. బ్రాహ్మణు లును, బ్రాహ్మణేతరులును సహపంక్తిని భోజనము చేయుట అని చెప్పిరి. ఈ వచ్చి భోజనములు చేసిన వారి పేరులను పత్రికలలో ప్రకటింతురా అని మరల అడిగితిని. పేరులు ప్రకటించిన యెడల ఈ భోజనములే యుండవని ఒకరు బదులు పలికిరి. మాయా వేషములందు స్వభావ ద్వేషము గల నేను, "పేరులితరులకు తెలియుట కిష్టములేని కార్యభీరులు మహా శూరులవలె, నేటి సంస్కార భోజనము బహు జయ ప్రదముగ జరిగినదని పత్రికలలో ప్రకటించి దూరపు వారిని మోసగించుట ఏమి పౌరుషము?" అని తూల నాడితిని. నన్ను మరల సంస్కార భోజనములకు పిలువలేదు: సంస్కార భోజన ప్రశంసను పత్రికలలో నేనెప్పుడు చదువనులేదు.

చెన్నపురి చేరిన శీఘ్రకాలములోనే సంఘ సంస్కరణ సభా సమావేశ మయినప్పుడు పయి పయి వేషములతో ప్రయోజనము లేదనియు, స్థిరముగా నుండెడు పనిని చేయవలెననియు చెప్పితిని. సభవారు వితంతు శరణా లయమును స్థాపింతుమని మహోత్సాహముతో నిశ్చయించిరి. దానికిల్లు కొనుటకై తాను పెట్టుబడి పెట్టెదనని, ఎస్. కే. రామస్వామయ్యగారు ఉదార మనస్సుతో సభలో చెప్పిరి. చందాలు పోగు చేసి, ఇంటికయిన సొమ్మును వ్యయ పెట్టవలెననియు, ఈ లోపల రామస్వామయ్యగారి వద్ద నూటికి నెలకు మూడు పావలాల వడ్డీకి కావలసిన ధనము బదులు పుచ్చు కొని ఇల్లు కొనవలసినదనియు నిశ్చయము చేసి, తగిన గృహమును

విచారించుకొనుటకయి నాకధికారమిచ్చిరి. నేనెంతో సంతోషించి, నేనున్న వెల్లాల వీధిలోనే 20 సంఖ్యగల గృహము అమ్మకమునకు రాగా, రు. 3,800 లకు బేరము నిశ్చయించి, ఇంటి స్వత్వ పత్రములను నా యొద్ద నుంచుకొంటిని.

ఋణము నిమిత్తమై రామస్వామయ్యగారి నడుగగా, ఆ సొమ్ము తన తమ్ముని వంతుతో చేరియున్నదనియు, తగిన ప్రాతి భావ్యము లేక బదులియ్య జాలననియు చెప్పెను. కొనబోయెడి ఇంటిని మాత్రమేగాక, నా యింటిని గూడ అధారముంచెదనని చెప్పితిని. నా మాటలాయన తలకెక్క లేదు. ఈ లోపల ఇంటివారు, నేను సొమ్మియ్యనందున న్యాయవాది చేత నాకు నివేదన పత్రము పంపిరి. సంఘ సంస్కరణ సమాజము వారి సభ సమకూర్పించి, నా స్థితినివేదింపగా, గృహస్వామిని వ్యాజ్యము వేసికో నియ్య వలసినదనియు, సంవత్సరములోపల తీర్పుకాదనియు, అప్పటి మాట చూచుకోవచ్చుననియు వారు సెలవిచ్చిరి.

నిష్కారణముగా సభల కెక్కుట నాకిష్టములేదు. ఇంటివారి న్యాయ వాదితో మాటాడి, ప్రస్తుతము 500 రూపాయలిచ్చునట్లును, తక్కిన మొత్తము 3 నెలలోపల యిచ్చి యిల్లు స్వాధీనము చేసికొనునట్లును, ఇయ్యలేకపోయిన 500 వందలు వదులుకొనునట్లును ఒడంబడిక చేసుకొని, పరీక్షకుడనుగా నాకు వచ్చిన మూల్యమునుండి 500 సంచి కరువు (advance) ఇచ్చితిని. మూడు నెలలలోపల 3,300 రూపాయలు చెల్లింప వలసియున్నందున మిత్రుల నడిగియు, వ్రాసియు ప్రయత్నము చేయనారం భించితిని. చెన్నపట్టణములో నున్న బుచ్చెయ్య పంతులుగారు 500, డాక్టరు సి. బి. రామారావుగారు 400, కాకినాడలో దుగ్గిరాల ప్రకాశరావుగారు 500, న్యాపతి సుబ్బారావు పంతులుగారు 500, పోలవరము జమీంవారు గారు 1000 రూపాయలును బదుళ్లిచ్చి నన్నాపదనుండి తొలగించిరి. నేను కృతజ్ఞుడనై, వారికి వందనములు సమర్పించుచున్నాను. పోలవరము జమీందారుగారు "Kindly accept this amount as a donation for the Widows' Home and oblige" అని వ్రాసిరి. ఈయన పాఠశాలలో నాయొద్ద చదువుకొనునప్పటినుండియు వినయ విధేయతలను, నా యెడ ఆదర గౌరవములును గలవారయియుండిరి. చమురు రంగుల (oil

colours) తో చేయబడిన నా చిత్రపటమును రాజమహేంద్రపుర మందిరమునకు బహుమానము చేసిరి.

నేను వితంతు శరణాలయమును మా యింటనే జరుపుచుంటిని. ఇద్దరో, ముగ్గురో, నలుగురో వితంతువులు మా యింట నుండుచునే వచ్చిరి. నేను వారికి జీతములిచ్చి చదువు చెప్పించుచు, అన్న వస్త్రాదులును పుస్తకములను ఇచ్చుచు, వ్యాధి సమయములయందు వైద్యము చేయించుచు వితంతు శరణాలయమును నడుపుచు వచ్చితిని. మా యింట పది వితంతు వివాహములు జరిగినవి. ఈ పదింటిలో మూడవదియు, నేను చేసిన ముప్పదవదియునైన వివాహమును గూర్చి ముఖ్యముగా ముచ్చటింప వలసియున్నది.

శ్రీ మహాలక్ష్మమ్మ అనునామె కాకినాడనుండి వచ్చి రెండు సంవత్సరములు చెన్నపట్టణములో నా యొద్ద నుండెను. ఆమె కొంత రూపవతియు, విద్యావతియు, ధీమతియు అయియుండెను. ఆమె పూర్వ చరిత్రమును గూర్చి కొన్ని ప్రవాదములుండెను. గాని నా యొద్ద నున్నపుడు సత్ప్రవర్తనముగలదిగానే యుండెను. ఆమె కప్పటికి 20 సంవత్సరములు దాటి యుండవచ్చును. పట్టపరీక్షయందు కృతార్థుడయిన వానిని గాని చేసుకోనని ఆమె నియమము చేసికొనెను. ఈ నియమమున కనుకూలముగా పట్టపరీక్షాసిద్ధుడైన విధురు డొకడామెను కామించి వివాహమాడుట కొప్పుకొనెను. ఇంచుమించుగా కార్య నిశ్చయమయిన తరువాత నాకు కొన్ని క్రొత్త సంగతులు తెలియవచ్చినవి. అవి విన్నవిమ్మట నేనా సంబంధమును మాన్పింపజూచితిని. రెండు మూడు ఉత్తర ప్రత్యుత్తరములు నడచినమీదటనే వరు డేవాగ్దానము జరుప నక్కరలేదని నాకు వ్రాసెను.

తరువాత శీఘ్రకాలములోనే, నాకు పరమ మిత్రులయి యుండిన న్యాపతి సుబ్బారావుగారి తమ్ముడు, నలువదేండ్లు దాటి విధురుడయిన శేషగిరిరావు పంతులుగారు నా యొద్దకు వచ్చి, తనకు వితంతువును వివాహ మాడవలెనని ఇచ్ఛగలదనియు, తగినవారిని తెలుపవలెననియు కోరిరి. అప్పుడు నా యొద్ద నున్న ఇద్దరిలో నీమె నాతడు వరించెను. నే నేమియు మరుగుపెట్టక, నేను విన్న ప్రవాదములను, చెడిపోయిన వివాహ వృత్తాంతమును సవిస్తరముగా తెలిపి, నా యొద్దనున్న ఉత్తరముల నాతని కిచ్చితిని. వధూవరులు ఒండొరులతో మాటాడుకొని, పరస్పరానురాగము గలవారయి, వివాహమున కొప్పుకొనిరి. నేనును కార్య నిశ్చయము

చేసితినిగాని, ముందీ విషయము సుబ్బారావు పంతులుగారికి తప్పక తెలుపవలెనని చెప్పితిని. ఆయన తప్పక ఒప్పుకొందురని నా నమ్మకము. శేషగిరిరావు పంతులుగారు తానొకసారి వితంతు వివాహమును గూర్చి ప్రస్తావింపగా, అందులో కష్టములున్నవనియు, అట్టి వివాహము కర్తవ్యము కాదనియు నిరుత్సాహపరచెననియు, వివాహమునకు పూర్వ మాయనకు తెలియనిచ్చుట యుక్తము కాదనియు నాతో చెప్పిరి. పంతులు గారికి తెలియకుండ వివాహము జరగనేరదనియు ఈ వివాహమునకాయన తప్పక సమ్మతించుననియు, సమ్మతింపక పోయినను నేను వివాహమును జరిపెదననియు నేనాయనకు వ్రాసెదననియు చెప్పితిని. రాజమహేంద్ర వరము పోయి అన్నగారితో చెప్పి తానుత్తరము వ్రాసెదననియు, నన్ను ఉత్తరము వ్రాయవలదనియు ఆయన వేడెను. ఇంతలో శేషగిరిరావుగారి సెలవు దినములయిపోవచ్చినవి. ఆయన బొబ్బిలికి పోయి పనిలో చేర వలెను. చెప్పినట్లు రాజమహేంద్రవరమునుండి ఉత్తరము వ్రాయలేదు గాని, వధువును తీసికొని రావలసినదని ఆయన బొబ్బిలి నుండి తంతి పంపెను.

తమ్ముడన్నగారి అనుమతి పొందెనని యూహించి, వధువును వెంట గొని, భార్యా సహితముగా అయో మార్గమున విజయనగరము చేరితిని. శేషగిరిరావుగారి భటులు నన్ను గజపతి నగరమునకు బండ్లమీద కొని పోయిరి. శేషగిరిరావుగారావరకే అచ్చటికివచ్చి, వివాహ సన్నాహముల నన్నిటిని చేయించిరి. నేనాయనను చూడగానే, "మీ అన్నగారు సమ్మతించి నారా?" అని అడిగితిని. తానాయనతో చెప్పలేదనియు, వివాహానంత రము వ్రాయవచ్చుననియు ఆయన చెప్పినప్పుడు నాకు కలిగిన విచారము చెప్పనలవికాదు. అంత దూరము వచ్చి, వివాహము జరపకుండ పోవుట ఉచితముకాదని తలచి, 1900 ఫిబ్రవరి 26 న కార్యమును జరిపి, నేనును నా భార్యయు రాజమహేంద్రవరము వచ్చితిమి. వచ్చిన దినము సాయం కాలము పురమందిరమునకు పోయి, సుబ్బారావు పంతులుగారితో తమ్ముని వివాహ వార్తను నేనే మొట్టమొదట నివేదించితిని. ఆయన మొగమునందు కొంచెము వైవర్ణ్యము కనబడెనుగాని, కోప చిహ్నము లేవియు కానరాలేదు. ఆయన ఇక అక్కడ నుండక, వెంటనే బండి యెక్కి ఇంటికి పోయిరి. మరునాడు నేను సుబ్బారావు పంతులుగారి యింటికి పోయినప్పుడు ఆయన

నన్నేమియు పరుష భాషణము లాడకపోయినను, కోపమును, అనాదర మును చూపిరి. నేను వెంటనే సెలవు పుచ్చుకొని, ఆయనకు వివాహమునకు ముందు చెప్పకపోవుటయే మంచిదయ్యెనని నాలో నేననుకొనుచు ఇంటికి నడచితిని. మొదటినుండియు వితంతు వివాహ కార్యములయందంత అభి మానము కలవారయి, నాకెన్నియో విధముల సహాయపడు చుండిన సుబ్బారావు పంతులుగారికి, తమ్ముడు వితంతువును వివాహము చేసి కొన్నంత మాత్రమున నంత ఆగ్రహమేల కలుగవలెనో ఊహింపలేక, అల్పకాలములోనే ఈ కోపాగ్ని చల్లారి, మా యిరువురి మైత్రి యథాపూర్వక ముగా నుండుననుకొంటిని. కాని ఆపని జరుగుటకు బహు సంవత్సరములు పట్టినది. మిత్రులందరి కంటెను పరమ మిత్రుడయిన ఈశ్వరుని యాజ్ఞను నిర్వహించినప్పుడేమి జరిగినను జరుగనిమ్మని యూరకుంటిని. ఆకస్మిక ముగా నా పయిని కలిగిన కోపము ఆయనను నేను పూనిన సంఘ సంస్క రణ కార్యమును కూడ కొంత ద్వేషించునట్లు పురికొల్పినది.

కాల మహిమచేత బాహ్య పదార్థములలోని మార్పులమాట అటుండగా, అంతరంగములు సహితము అత్యంత కఠినములగునవి క్రమక్రమముగా మృదువులగును. సుబ్బారావు పంతులుగారును, నేనును కొంతకాలము పర స్పర సంభాషణము లేనివారమయి యుండినను, చెన్నపురిలో సర్వకళా శాల సభ్యుల సభ జరుగుచున్నప్పుడు పంతులుగారే నేను కూరుచున్నచోటికి వచ్చి పలుకరించి, ఆదరపూర్వకముగా నా యోగ క్షేమములను విచా రించిరి. అటుతరువాత మా మైత్రి క్రమముగా పూర్వరీతికి వచ్చెను. రాజ మహేంద్రవరము వచ్చిన తరువాత కూడ వారు రెండు, మూడు పర్యాయ ములు మా తోటకు వచ్చి నన్ను చూచిరి.

వారి హిందూ సమాజము యొక్క ఒక సభాదినమునందు నన్నాహ్వానము చేసి, "యీ దినమున మన సభకొక ప్రసిద్ధ పురుషులు వచ్చినారు," అని సభవారితో పలికి నన్ను పీఠుకొల్పిరి. ఈ హిందూ సభ ఎప్పుడు, ఏల వచ్చినదని అడుగవచ్చును. పంతులుగారికి నా మీద కోపము వచ్చిన కాలములో సంఘ సంస్కరణ సమాజమునకు ప్రతిపక్షముగా హిందూ సమాజమును స్థాపించి Indian progress అను నామమున ఒక పత్రికను ప్రారంభించిరి. ఈ హిందూ సభోద్దేశము దేశీయ పద్ధతులమీదనే సంస్కా రము మెల్లమెలగా జరుపవలెననుట. జననీజనకు లంగీకరించినవారినే

వివాహములు చేయవలెనని కొందరి అభిప్రాయము: వితంతు వివాహము లసలే మాని వేయవలెనని కొందరి అభిప్రాయము: బాల్య వివాహములు లేనియెడల బాల విధవలుండరు కనుక రజస్వలానంతర వివాహములు ప్రోత్సహించవలెనని కొందరి అభిప్రాయము. ఈ సభ రాజమహేంద్ర వరమునుండి చెన్నపట్టణమువరకును ప్రాకి, అనీబెసెంటు దొరసానిగారి అధ్యక్షత క్రింద చేయబడిన మహాసభలో మహాఘోషము చేసి, అక్కడ విశ్రాంతి నొందెను. ఆ సభాకార్యదర్శి, వితంతు వివాహములతో పనియే లేక పోవును గావున రజస్వలా వివాహములను ప్రచారమునకు తెచ్చుట విద్యాధికుల కెల్లరకును ప్రథమ కర్తవ్యమని ప్రసంగము చేయుచు, ఎనిమిదేండ్లు దాటని తన కొమారితకు ప్రౌఢ వివాహము చేయగానే జనులకా సభవారి శుద్ధమనస్కత యందే సందేహము కలిగెను!

విశాఖ పట్టణములోని మహారాజా గోడే గజపతి రాయనింగారు దక్షిణ హిందూ స్థాన బ్రహ్మసమాజమునకు సంవత్సరమునకు 50 రూపాయలు ఇచ్చుచుండెడివారు. అది యే హేతువుచేతనో నిలిపివేసిరి. సమాజము వారెన్ని విన్నపములు పంపుకొన్నను కార్యము లేకపోయెను. వెంకట రత్నము నాయుడుగారు మొదలయిన ప్రతినిధులను విశాఖపట్టణము పంపినను ఫలము కలుగలేదు. నేను బ్రహ్మసమాజమున కధ్యక్షుడనయిన తరువాత నేను వ్రాసిన పిమ్మట మహారాజాగారు 500 రూపాయలు నా యొద్దకు పంపి, ఏటేట 500 రూపాయలు నా యొద్దకే పంపుచు, స్థిరమైన ఏర్పాటు చేయవలసినదని నేను కోరిన మీదట తమ మరణ శాసనములో నీ దానము శాశ్వతముగ ఏర్పాటు చేసిరి.

మహారాజా గజపతిరాయనింగారికి నాయందత్యంత గౌరవముండెను. నేనొకసారి నవరాత్రములలో కుటుంబ సహితముగా విశాఖపట్టణము వెళ్లుట తటస్థించెను. నేనప్పుడు వారి బంగాళాలోనే యుండి వారి అతిథి సత్కారమును పొందవలసిన వాడనైతిని. విజయదశమినాడు నాకును, నా భార్యకును బహుమానము చేయుటకు మిక్కిలి విలువగల బట్టలు మొదలగునవి తెప్పించిరి. నాకవి వలదని ఎన్ని విధముల ప్రార్థించినను వారు నా మాట విననందున, విజయదశమినాడు ప్రాతఃకాలమున వారి వద్ద సెలవుగైకొనకయే ఆవిరి బండి నెక్కి భార్యా సహితముగా రాజ మహేంద్రవరమునకు వచ్చితిని. నేను తమ బహుమానము స్వీకరింప నొల్లక

రాజమహేంద్రవరము పోయితినని విని విచారపడి, 200 రూపాయలిచ్చి మరునాటి ఆవిరి బండిలోనే ఇద్దరిని నాయొద్దకు పంపిరి. సాధనాంతరము లేక 200 రూపాయలు పుచ్చుకొని పురమందిరములో నున్న జూబిలీ రీడింగు రూము వారికిచ్చితిని.

రాజమహేంద్రవర పాఠశాలలో పనిమానుకొని, వచ్చినంత ఉపకార వేతనము నొంది చెన్నపట్టణములోనే నిలిచిపోయి, జీవితాంతము వరకు సంఘ సంస్కార విషయములో పనిచేయ సంకల్పించుకొంటినిగాని దానికి వికల్పము సంభవించెను. అప్పటి విద్యావిచారణాధికారియైన డంకనను దొరగారు నాయందధికారము గలవారయి, సర్వకళాశాలా సభా సమయములయందు తప్పక నావద్దకు వచ్చి, నా క్షేమము విచారించుచుండిరి. ఇట్లు కలిసికొన్నప్పుడొకసారి ఆయన, నీకిక్కడ పనిలో నుండుట కిష్ట మున్నదా అని అడిగెను. నేను మరల రాజమహేంద్రవరమునకు పోక ఇక్కడనే నిలచి పనిచేయదలచుకొన్నానని చెప్పితిని. ఒకనాడు ఉత్తరములు తెచ్చు భటుడు విద్యావిచారణాధికారి కార్యస్థానమునుండి వచ్చిన ఆచ్ఛాదన పత్రమును నా చేతిలో పెట్టెను. అందులో, రాజమహేంద్రవరమునుండి నన్ను రాజధానీ కళాశాలకు మార్చినట్లును, నా స్థానమున కొక్కొండ వేంకటరత్నము పంతులుగారిని రాజమహేంద్రవరమునకు వేసినట్లును ఉండెను. డంకన్ దొరగారు నన్నేలాగుననైన చెన్నపట్టణము రప్పింపవలెనని, కొక్కొండ వేంకటరత్నము పంతులుగారికింగ్లీషు రాదన్న మిషమీద నన్నక్కడకు వేసి, ఆయన నిక్కడకు (రాజమహేంద్రవరమునకు) వేసిరి.

నేను పనిలో చేరులోపల రాజధానీ కళాశాలాధికారియైన స్టూఆర్టు దొరగారు పనిలో ఎప్పుడు చేరెదవని అడిగెను. నా సెలవు దినములయిన తరువాత చేరెదనని చెప్పితిని. కొక్కొండ వెంకట రత్నముగారు తన్నిక్కడనే మద్రాసులో ఉంచవలసినదని విన్నపము పంపెననియు, తాను దానిని విద్యా విచారణాధికారికి పంపదలచుకోలేదనియు, తక్షణమే పనిలో చేరవలసినదనియు చెప్పెను. తన స్థానభ్రంశమునకు నేనే కారకుడనని భావించి కొక్కొండ వేంకట రత్నము పంతులుగారు తరువాత, "మీ యనుగ్రహము వలన నాకు గోదావరీ స్నాన పుణ్య ఫలము లభించినది," అని రాజమహేంద్రవరము నుండి ఉత్తరము వ్రాసిరి.

మా యిల్లు పాఠశాలకు మూడు మైళ్ల దూరములో నుండుట చేత మొట్టమొదట చిన్న గుఱ్ఱపు బండిని కొంటినికాని, తరువాత దాని నమ్మివేసి పెద్ద గుఱ్ఱమును, పెద్ద బండిని కొని యుంచితిని. ఈ పెద్ద గుఱ్ఱమును విక్రయించి వేయుటకయి శేషగిరిరావుగారు బొబ్బిలికి పోవునప్పుడు నా యొద్ద విడిచిరి. తమ ప్రథమ భార్య మరణమునకీ గుఱ్ఱమే కారణమని శేషగిరిరావు పంతులుగారు తలచిరి. దాని సుడులు మంచివి కాకపోవుటచే దాని నెవ్వరును కొనకుండిరి. నే నెన్నిసారులు ఏలమునకు పంపినను సుళ్లు చూచి 50, 60 కంటె ఎక్కువ పాడకుండిరి. నే నొకసారి స్వయముగా పోయి 100 రూయపాలకు పాడగా పయి పాట రాక కట్టుపడిపోయెను. సుళ్లు మంచివికాక పోవుటచేత దుష్ఫలితమేమి కలుగునో చూడవలెనన్న అభిలాషచేతనే కొంతవరకు నేనీ గుఱ్ఱమును కొంటిని. నేను చెన్నపట్టణము విడిచి రాజమహేంద్రవరము వచ్చువరకును ఈ గుఱ్ఱము నా వద్ద నుండి చక్కగా పని చేసినది. మిక్కిలి సాధువుగా నుండినది.

హైందవ దేశీయ మహా సభలో 1898 లో మద్రాసులో జరిగెను. ఆ సభతోపాటుగా హైందవ దేశీయ సాంఘిక మహాసభ కూడ జరిగెను. దానికి నన్ను అగ్రాసనాసీనుని చేసిరి. ఆ సభలో మహాదేవ గోవింద రనడె గారు 'దక్షిణ హిందూదేశ విద్యాసాగరుడు' అని నాకు నూతన నామ కరణము చేసిరి. తరువాత 1902 జూన్ 14 న కాకినాడలో జరిగిన చెన్నరాజధాని దేశీయ సాంఘిక మహాసభకు నన్నగ్రాసనాధిపతిగా చేసిరి. నే నప్పుడు చేసిన ఉపన్యాసములోని భాగములను రివరెండు మర్డాదు దొరగారు తమ గ్రంథములో నుదహరించిరి.

1902 లో గుంటూరు నందు ప్రథమ వితంతుద్వాహము జరిగినది. వివాహమును జరిపించి పోవలసినదని అక్కడి ప్రాడ్వివాకులైన విశ్వనాథ శాస్త్రిగారు నన్ను కోరిరి. నేను భార్యా సహితముగా వెళ్లి, విశ్వనాథ శాస్త్రిగారి గృహముననే దిగితిని. నే నక్కడికి పోగానే పెద్ద సంక్షోభమారంభ మయ్యెను. విశ్వనాథ శాస్త్రిగారి వంట బ్రాహ్మణుడు లేచిపోయెను. వివాహము తమ యింట జరుపవలదని ఆయన భార్య పట్టుబట్టెను. నా కాశాభంగము కలిగించుట యుక్తము కాదని ఆయన దృఢ చిత్తుడయి నిలిచెను. అక్టోబరు 11 న వితంతు వివాహము వారి ఇంటనే నడచినది. వరుడు బేతపూడి జోగీ ప్రకాశరావుగారు, వధువు రాజమహేంద్రవర

నివాసిని అయిన వేంకట రమణమ్మ. ఉన్నవ లక్ష్మీ నారాయణగారి వివాహములో భోజనమునకు వచ్చి, ఈ పక్షమున చేరిరి. తరువాత గుంటూరులో జరిగిన స్త్రీ పునర్వివాహము లన్నియు లక్ష్మీనారాయణగారి చేతనే చేయబడినవి. మరునాటి రాత్రి నా గౌరవార్థము గుంటూరు నాటక సమాజమువారు మద్విరచితమైన శాకుంతల నాటకమును ప్రదర్శించిరి. ఆ రాత్రి నాటకము చూచి, మరునాడు ఇంకొక వివాహము చేయించుటకు కుటుంబ సహితముగా రాజమహేంద్రవరము పోయితిని.

1902 అక్టోబరు 14 న రాజమహేంద్రవరములో వితంతు వివాహము జరిగినది. వరుడు రాజమహేంద్ర పురవాసియు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి పాఠశాలలో సహోపాధ్యాయుడైన తిరుమెళ్ల వేంకట సుబ్బారావు గారు, వధువు తిరువళ్లూరు సమీపములో అవిచ్చేరి వాసియైన తిరుమలాచార్యులు గారి పుత్రిక వేంకట లక్ష్మమ్మ. ఈ ఆచార్యులుగారు మొట్టమొదట వరుడు శ్రీవైష్ణవుడే కావలెనని పట్టుపట్టి, తగినవాడు దొరకనందున, నా హితోపదేశమునకు లోనయి కన్యను వైష్ణవేతరునకిచ్చుట కొప్పుకొనెను. ఈ వివాహము చేసి నా భార్యతో నేను మరల చెన్నపట్టణమునకు పోయితిని.

రాజమహేంద్రవరములో పురమందిరమును, చెన్నపట్టణములో సంఘ సంస్కార సమాజ మందిరమును కాక నేను చెన్నపురిలో నున్న కాలములో 1200 రూపాయలు ఖర్చు పెట్టి రాజమహేంద్రవరములో స్త్రీలకు ప్రార్థనా మందిరమును కట్టించితిని. 1907 వేసవిలో నా భార్యతో కలిసి బెంగుళూరు పోయితిని. అప్పుడు అరుళపేట బ్రాహ్మసామాజికులు నన్నును, నా భార్యను ఆహ్వానము చేసిరి. పగలు మగ్గములువేసి నేత నేసిన యింటిలో మగ్గములెత్తిపెట్టి రాత్రి ఉపాసనము జరిపిరి. వారు చదువుకొన్న వారును, ధనవంతులును కాకపోయినను నిక్కమయిన భక్తిపరులుగా మాకు కనబడిరి. నేనును, నా భార్యయు వారికొక మందిరముకట్టించి యిచ్చిన బాగుండునని ఆలోచించితిమి. 1908 లో ఒక యిల్లు 500 రూపాయలకు అమ్మకమునకు వచ్చినదని వారు వ్రాయగా వెంటనే సొమ్ము పంపి, ఆ యిల్లుకొనునట్లు చేసితిని.

చెన్నపట్టణములో మా యింట నుండిన వితంతువులను ఎగ్మూరులో నున్న స్త్రీ పాఠశాలకు పంపుచుంటిని. అక్కడకు పోవు వితంతువులు

కొందరు సాయంకాల మింటికి ఆలస్యముగా వచ్చుచుండిరి. ఏలయని అడిగిన వారు పలు సాకులు చెప్పిరి. ఈలోపల ఒక చిన్నది జ్వరము వచ్చుచున్నదని ముక్కుచు మూలుగుచు నుండగా మందులిప్పించితిని. ఎన్నాళ్లు మందులిచ్చినను ఆమె స్వస్థ పడలేదు. నేనామెను lady doctor వద్దకు పంపి, వ్యాధి స్వభావము తెలుప గోరితిని. ఈమె సుఖరోగములచే బాధ పడుచున్నదని ఆమె వ్రాసెను. నా మనస్సులో విషాదఖేదములు కలిగి, బాల వితంతువుల నాపాఠశాలకు పంపుట క్షేమకరము కాదని తలచితిని. నాకున్న రెండిండ్లలోను పాఠశాల నుంచుటకు తగిన తావులేదు. కిల్పాక ములో ఒక సరుకుడు తోట అమ్మకమునకురాగా రు. 900 లకు దానిని నా భార్య పేరిట కొంటిని. చవుకు చెట్లను కొట్టించి పాఠశాలకు తగిన ఇల్లొకటి కట్టించితిని. తొందరపడి ఇల్లు కట్టించితినిగాని, వితంతువుల నక్కడ ప్రవేశ పెట్టినప్పుడు, వారిని పయినుంచి విచారించు వారు కావలెను. సాంఘిక సమాజ సభ్యులలో ఎవ్వరి నడిగినను ఆ పని తమ చేత కాదనిరి. చెదలు పట్టియు, కుక్కలును, గాడిదలును నివాస మేర్పరచుకొనియు ఇల్లు పాడగు నట్లు కనబడెను. అందుచేత మా యింటనున్న వితంతువులలో 40 ఏండ్లు దాటిన ఇద్దరి నక్కడకు పంపి ప్రతిదినమును పోయి చూచుచుంటిని.

సాయము చేయువారు లేకపోయినను, వితంతువుల నక్కడ ఒంటరిగా నుంచితినని తప్పులు పట్టువారు మాత్రముండిరి. ఈ హేతువు చేత నాకు చెన్నపట్టణ నివాస మెత్తివేయవలెనని బుద్ధిపుట్టినది. నా కక్కడ ధన సాహాయ్యమేమియు లేదు: మనుష్య సాహాయ్య మంతకుమునుపే లేదు. వచ్చిన రూపాయలను సమాజము మ్రింగివేసినది. కార్యములలో నాకు తోడుపడు బుచ్చయ్య పంతులుగారును స్వర్గస్థులైరి. వితంతు శరణాలయము లోనికి వచ్చెడు వారు తెలుగువారేకాని, చేరువనున్న అరవ దేశము నుండి ఒక్కరును కనబడలేదు. రాజమహేంద్రవరము మరల చేరినచో ఎక్కువ పని జరగవచ్చునని తోచినది.

రాజమహేంద్రవరము వెళ్ళినను, వెళ్ళకపోయినను, వచ్చినంత ఉపకారవేతనము నొంది, పని చాలించుకొనుటకు నిశ్చయించుకొంటిని. నా కాలమంతయు పనిలోనే పోవుచుండెను. పాఠశాల 10 గంటలకు పోవుటకు ఇంటివద్ద 8 గంటలకే భోజన ప్రయత్నములో నుండవలసి వచ్చెను. ఇక సాయంకాలమైదు గంటలకుపైన గాని ఇల్లు చేరలేకుండుటచే

అటుపై నేమియు చేయలేకుంటిని. నాలుగు తరగతులకు పరీక్షా గ్రంథములు కాక, భాషాంతరీకరణము కూడ నేనే నేర్పవలసియుండుట చేత వారు వ్రాసిన దానిని ఇంటికి తీసుకొనివచ్చి, దిద్దవలసి వచ్చెను. వ్యాధిపీడితమైన నా శరీర దౌర్బల్యమునకీ పనులు తోడ్పడి నన్ను లోకమునకంతగా ఉపయోగపడకుండ చేసెను.

నేను కొలువు సాధ్యమయినంత శీఘ్రముగ వదులుకో దలచుకొన్నందున డాక్టరు వద్దకు పోయి, నేను కొలువునకు పనికిరానన్న నిర్ణయ పత్రమును సంపాదించితిని. అధికారులు నన్నిక విడువకుండుట కవకాశము లేక పనినుండి విముక్తుని చేసిరి. ఉపకార వేతనము పొందిన తరువాత దాదాపు సంవత్సర కాలము చెన్నపట్టణములోనే యుండి, యిండ్లు మొదలయిన వానిని వచ్చిన వెలల కమ్మి, 1905 లో మరల స్వస్థలమయిన రాజమహేంద్రవరము చేరితిని.

# 2. గ్రంథకర్తృ దశ - 1870-1900

నేను పాఠశాలలో నాలుగవ తరగతి చదువుకొనుచుండి నప్పటినుండియు తెలుగులో తెలివిగలవాడనని యొక వాడుకయుండెను. మా ఆంధ్రోపాధ్యాయులైన పులిపాక గురుమూర్తి శాస్త్రులుగారికిని నాపై అట్టి అభిప్రాయమే యుండి, మా తరగతి తెలుగు పాఠములను నా చేతనే బాలురకు తరచుగా చెప్పించుచుండెడివారు. చదువులేని వారిలోనే పండితుడనయి, నా అల్ప పాండిత్యమును వెల్లడించుటకయి ఏదైన వ్రాయవలెనని తలచితిని. ఆ కాలమునందు పద్యములు చేసిన వారికేగాని వచనము వ్రాసినవారికి గౌరవము లేదు. ఛందస్సు నేర్చుకొని పెద్ద పెద్ద మాటలతో పద్యములల్ల నారంభించితిని. అప్పటి నా మూఢ భక్తి ననుసరించి నేను చేసినవి మార్కండేయ శతకము, గోపాల శతకమును.

ఈ శతకములను చదివిన అప్పటి నా మిత్రులు నాకవనమును మెచ్చుకొనిరి. వారి శ్లాఘనల వలన కొంత యుత్సాహము గలవాడనయి మరింత కఠినమైన కావ్యమును రచించుట కున్ముఖుడనయి, శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమను పేర గ్రంథరచన కారంభించి ముగించితిని. సర్వకళాశాల వారు దీనిని పట్టపరీక్షకు పఠనీయ గ్రంథముగా నిర్ణయించి యున్నారు. ఈ గ్రంథము నారంభించినప్పుడే రసికజన మనోరంజనమను పేర 5 ఆశ్వాసముల శుద్ధాంధ్ర ప్రబంధమును చేసితిని. దీని నిప్పటికి పండితులు మొదలైనవారు మెచ్చుచున్నారు. ఐనను నే నిటువంటి శృంగార ప్రబంధముల కామోదింపను. ఇప్పుడు నే నిట్టి శృంగార కావ్యమును రచించి యుండను.

ఈ పుస్తకమును శ్లాఘించినట్లే, దీని తరువాత నేను చేయనారంభించిన శుద్ధాంధ్రోత్తర రామాయణమును సహితము పత్రికాధిపతులును, పండితులును శ్లాఘించుచు వచ్చిరి. "పురుషార్థ ప్రదాయిని" 1872 మే పత్రిక అభిప్రాయము :

". . . . The beautiful verses composed with propriety and taste . . emanated from the poetical genius of Kandukuri Viresalingam . . . are worthy of praise from all who have any taste for poetry."

కోరంగిలో నున్న కాలములో నేను 'సంగ్రహ వ్యాకరణము' ను, పద్యరూపమున 'నీతిదీపిక'ను చేసి ముద్రింపించితిని. అవరకు పాఠశాలలలో బాలురకు సులభముగా తెలిపెడు తెలుగు వ్యాకరణము ఏదియు లేదు. ఉన్నవి పురాతన పద్ధతిన వ్రాయబడినవయి యున్నవి.

అప్పుడు బ్రాడా దొరగారు ఉత్తర మండలముల పాఠశాలా పరీక్షకులు. ఆయన కోప స్వభావులయి తన క్రింది యుద్యోగస్థుల మీదను, ఉపాధ్యాయుల మీదను కేకలు వేయుచుండెడివారు. నేను ప్రధానోపాధ్యాయుడనైన కొంత కాలమునకు ఆయన ధవళేశ్వరము పాఠశాలను పరీక్షించుటకు వచ్చిరి. ద్వితీయోపాధ్యాయుడు క్షేత్రగణితము నేర్పుచున్న తరగతికి పోయి, ఒక ప్రతిజ్ఞనిచ్చి, దానిని పలకల మీద వేసి చూపుడని విద్యార్థుల నడిగెను. వారది చేయలేక పోయిరి. నల్లబల్లమీద దానిని వేసి చూపుమని దొరగారు నన్నడిగిరి. చూపవలసిన వాడు ద్వితీయోపాధ్యాయుడని నేను చెప్పితిని. "కాదు, నీవే చూపవలసినది" అని నన్నాయన నియమించెను. నేను నిర్భయముగా నిరాకరించితిని. ఈ సంగతి నాయన తన స్మరణ పుస్తకములో వ్రాసికొనెను. అంతకుమునుపే ఇంకొక వ్యతిక్రమము జరిగినది. పాఠశాలలో దొరగారొక్కరు కూరుచుండుటయు, ఉపాధ్యాయులు నిలుచుండుటయు ఆచారము. నేనా ప్రకారము చేయక, కుర్చీ తెప్పించుకొని వేయించుకొని ఆయన సరసనే కూరుచుంటిని. నా వర్తనమును బట్టి దొరగారికి నా యందు కొంత అనిష్టము కలిగినను, నా స్వతంత్ర స్వభావమునకు సంతోషించి, నా వ్యాకరణమును పాఠశాలలలో పెట్టుట కుత్తరువు చేసెను. అందుచేత నా వ్యాకరణము మొదటి కూర్పు అల్పకాలములోనే అమ్ముడు పోయెను.

శుద్ధాంధ్ర మహాభారతమను పేర భారతము నంతయు అచ్చ తెనుగున రచింపవలెనని యెంచి, సభా పర్వము నారంభించి, కొంతభాగము "ఆంధ్ర భాషా సంజీవని" లో ప్రకటించితిని. కాని ఇంతలో నా బుద్ధిమారి ఇంకొక వంకకు మరలినది. తెలుగులో వచన కావ్యమని చెప్పదగినది చిన్నయ సూరిగారి నీతిచంద్రిక ఒకటి యున్నది. అదియు పూర్తికాక అర్ధమే సగమే అయియున్నది. పద్యకావ్యముల కంటె వచన కావ్యములను వ్రాయుట ఎక్కువ ఉపయోగకరమని నాకు తోచినది. 'నీతి చంద్రిక' ఉత్తరార్థమును పూరించుట కుపక్రమించి, పూర్తిచేసి 1874 లో ప్రచురించితిని.

చెన్నపురి క్రైస్తవ కళాశాలలో గణిత శాస్త్రోపన్యాసకుడు సమర్థి రంగయ్య శెట్టి బి. ఏ. గారు నేను కోరకయే నా పుస్తకమును తమ కళాశాలలో పాఠ్యపుస్తకముగా పెట్టిరి. అవరకు నాకాయన తోడి పరిచయము లేదు. నాకు ప్రోత్సాహమును కలిగించినందుకు కృతజ్ఞతా పూర్వక వందనముల నర్పించుచు ప్రథమ లేఖను వ్రాసితిని. 1875 ఫిబ్రవరి 8 న చెన్నపట్టణమునుండి రంగయ్య శెట్టిగారు నా కిట్లు వ్రాసిరి:

"You are under no obligation to me for I introduced the book not out of any favour, but on its real merits I feel very proud to have such a masterpiece in the Telugu literature . . can you not undertake the writing of an original novel in Telugu?"

ఈ పుస్తక రచనను చూసి సంతోషించి చెన్నపురిలోని పండితులు నన్ను అచ్చటికి రప్పించి ఆదరించి, నా కొక వెండి పాత్రమును బహుమానము చేసి సత్కరించిరి. సర్వ కళాశాల వారీపుస్తకమును ప్రవేశ పరీక్షకు పఠనీయముగా నిర్ణయించిరి. అందుమూలమున నాకా సంవత్సరము వేయి రూపాయలు చేతిలో పడినవి.

తెనుగులో నొక వచన ప్రబంధమును (novel) వ్రాయుటకు మీరు పూనుకొనలేరా యని రంగయ్యశెట్టిగారు వ్రాసినప్పుడే ఆ పనికి పూనుకొనవలెనని నాకుద్దేశము కలిగినది. మొదట నొక ఇంగ్లీషు ప్రబంధమును తెనిగించి, కుదురుపరచుకొని, తరువాత స్వకపోల కల్పితమైన వచన ప్రబంధమును వ్రాయవలెనని తలచి, Goldsmith చేసిన Vicar of Wakefield ను తెనిగింప నారంభించి, రెండు మూడు ప్రకరణములు వ్రాసితిని. విదేశ కథయు, దాని భాషాంతరమును మనవారి కింపుగానుండవని తోచి, చేసిన భాగము నా మనస్సునకే తృప్తిగా నుండనందున దానిని మానివేసి, 'రాజశేఖర చరిత్రము' ను వ్రాయ నారంభించితిని. ఇంగ్లీషు కథకును, దీనికిని విశేష సంబంధము లేదు. మనలో గల మూఢ విశ్వాసములను పోగొట్టవలెనన్న ముఖ్యోద్దేశముతో దీనిని వ్రాసితిని. దీనిని మొట్టమొదట 1878 లో "వివేకవర్ధని'' లో భాగ భాగములుగా (serial) ప్రకటించి, తరువాత పుస్తకముగా ప్రకటించి అప్పటి విద్యా విచారణాధికారి అగు కర్నల్ మెక్డొనల్డు దొరగారి కంకితము చేసితిని. మెక్డొనల్డు దొరగారు నాయందు మంచి

అభిప్రాయము గలవారయి, ప్రెసిడెన్సీ కాలేజీలోని రెండవ పండిత పద మును నాకిచ్చెదమని వ్రాసిరి, కాని నేనంగీకరింపలేదు.

'రాజశేఖర చరిత్రము' పత్రికాధిపతులచేతను, తదితరులచేతను బహు విధముల పొగడబడెను. ఈ పుస్తక విషయమయి ఇంగ్లండునుండి 1881 డిసెంబరు 23 న నాకిట్లు వ్రాసిరి.

"My dear sir, Miss Manning, Secretary of the National Indian Association, proposes publishing serially in the journal translation of good Indian fiction . . . I have suggested to Miss Manning that a translation of your Rajasekhar might perhaps be found suitable. I write therefore to ask whether you would like your novel to be published in the journal and whether you would send an English translation of it."

ఆ కాలమునందు నేను వితంతు వివాహ కార్యభారముతో మునిగి యుండి, రాజశేఖర చరిత్రమును ఇంగ్లీషు భాషాంతరము చేయించుటకును, ఇంగ్లండులోని పత్రికకు పంపుటకును ప్రయత్నము చేయలేదు. అమెరికా క్రైస్తవ మతాచార్యులైన రివరెండు హచిన్సనుగారు నా అనుమతిపైని దీని నింగ్లీషుచేసి, చెన్నపురి క్రైస్తవ కళాశాలా పత్రికయందు 1886 సం. న భాగములుగా ప్రకటించి, 1887 నందు "Fortune's Wheel" అను పేరుతో పుస్తకరూపమున చిత్రపటములతో లండను నగరమునందు ప్రక టించిరి. దీనికి జనరల్ మెక్డానల్డు దొరగారు ఉపోద్ఘాతము వ్రాసిరి. 1887 సెప్టెంబరు 30 న London Times పత్రిక యీ పుస్తకమును గూర్చి ఇట్లు వ్రాసెను.

"Fortune's Wheel" is an almost unique example of a Hindu novel .. the picture of Hindu domestic life, religious ideas, modes of worships and superstitions and the condition of women are so well drawn and illustrated that the book will have a charm for all readers, who concur in the author's desire for an amelioration in the social status of the native race generally."

1878 సంవత్సరమున, చెన్న పట్టణములో ప్రకటింపబడుచుండిన "హిందూ" పత్రికల అభిప్రాయములలో కొంత భాగము :

"The author of Rajasekhara is at home with his theme and has the knack of adapting his surroundings to his subject . . we may

well say the Rajasekara marks an era in the annals of Telugu literature. It is the first Telugu novel and as an attempt in a new direction we must consider it a success . . . we picture to ourselves a period in the history of Telugu litrature when the country will look back with pride to the man who in the midst of an ignorant multitude and indifferent public, stood alone, laid the foundation stone of Modern literature and led the way in developing the latent powers of the language . . ."

రాజశేఖర చరిత్ర రచనానంతరము రెండు మాసములలో భారత సంగ్రహమును వ్రాసి ముగించి చెన్నపురికి పంపితిని. సర్వకళాశాలవారు దీనిని ప్రథమ శాస్త్ర పరీక్షా గ్రంథముగా నిర్ణయించిరి.

'నీతిచంద్రిక' లోని 'విగ్రహము' ను చేసిన తరువాత 'సంధి' ని కూడ విగ్రహ తంత్రము శైలినే చేసి, దానిని మెట్కాఫు దొరగారి కంకితము చేసితిని. దీనిని కూడ సర్వకళాశాలవారు పలుమారు పఠనీయ గ్రంథముగా నిర్ణయించుచు వచ్చిరి.

భాష వలని ప్రయోజనమేమి ? జనులు తమ అభిప్రాయములను ఒండొరులకు తెలుపుకొనుట. భాషలోని గ్రంథముల వలన ప్రయోజనమేమి ? తమ భావములను దూరమున నున్నవారికిని, రాబోవు తరముల వారికిని సులభముగా తెలుపుట. అట్టి సౌలభ్యము "విగ్రహము" వంటి పుస్తకముల వలన కలుగదు. అందలి అర్థమును తెలిసికొనుటకు నిఘంటువుల యొక్కయు, పండితుల యొక్కయు సాయముకావలెను. గ్రంథములు సులభముగా నుండవలెను. ముందు వ్రాసెడు పుస్తకములను సుగుణముగా నుండునట్లు వ్రాయ నిశ్చయించుకొని నా అభిప్రాయమును పత్రికా ముఖమున తెలిపితిని. పండితులు నాతో నేకీభవింపక, అట్లు చేసినచో భాషయొక్క గౌరవమే పోవుననియు, పేలవముగా నుండుటచేత రసికులకు రుచింపక చప్పిడి పాకమువలె నుండుననియు ఎకసక్కెములాడ జొచ్చిరి.

నా దారినే నేను నడచువాడ నగుటచేత ఇతరుల మాటలు పాటిచేయక సులభ వచన, రచనా మార్గమున సంభాషణ రూపమున "బ్రాహ్మ వివాహము" వ్రాసి హాస్య సంజీవని మొదటి పత్రికలో కొంత భాగమును ప్రకటించితిని. అవరకు సంభాషణ రూపమున పుస్తకములు లేకపోవుట చేతనో, విషయ నూతనత్వము చేతనో పురుషులును, స్త్రీలును, పండితులును

పామరులును, బాలురును, వృద్ధులును దాని నత్యాసక్తితో చదువ జొచ్చిరి. పుస్తకము వెలువడిన కొన్ని దినముల వరకును జనుల గుంపులు వీధి అరుగుల మీద కూర్చుండి, దానిని చదివి పక పక నవ్వుచుండిరి. మొదటి సంచిక తరువాత రెండవ సంచిక వెలువడు లోపల వచ్చిన చందాదారుల పేరులను పత్రికానుబంధముగా ముద్రింపవలసిన వాడనయితిని. ఈ గ్రంథమును నేను కేవలము వినోదము కొరకు మాత్రమేకాక, అతి బాల్య వివాహము, వృద్ధ వివాహము, కన్యాశుల్కము మొదలయిన దురాచార ముల నుండి జనులను విముఖులను చేయు తలంపుతో కూడ వ్రాసితిని.

హాస్య సంజీవనిలో 'బ్రాహ్మ వివాహము' ముగిసిన తరువాత 'వ్యవహార ధర్మబోధిని' అను పేర మరి యొక గ్రంథమును గ్రామ్య భాషలో వ్రాసి ప్రచురించితిని. బ్రాహ్మ వివాహము నందువలెనే ఇందలి పాత్రములనేకములు నిజమైనవి: విషయములనేకములు నిజముగా జరిగినవి. దీనిని కూడ జనులు విశేషముగా చదువుచు ప్లీడరు నాటకమని పిలుచుచు వచ్చిరి. 'వ్యవహార ధర్మబోధిని' మొట్టమొదట వినోదార్థముగా బాలికా పాఠశాలలో ప్రదర్శించబడినప్పుడు నూరుల కొలది జనులు వచ్చుటయే గాక, అందులో వర్ణింపబడిన న్యాయవాదులు సహితము కొందరు వచ్చిరి. ఒక న్యాయవాది యొక్క మేనల్లుడు ఆ న్యాయవాది వస్త్రములనే ధరించి వచ్చి కథ వినిపించుచుండగా, జనులా న్యాయవాది వంక చూచి పక పక నవ్వజొచ్చిరి.

చెన్నపురిలో నున్న దివాన్ బహదూర్ వల్లూరి జగన్నాథరావు పంతులుగారు 1880 ఆగష్టు 3 న నా పేర ఇట్లు వ్రాసిరి.

"I see you are mercilessly exposing the faults of the young Rajahmandrians. Harsh expositions will sometimes do more harm than good. Thnk not that vernacular papers are left unnoticed by the authorities. You have overdrawn the picture altogether. The plot and design are no doubt good".

పుండు పుట్టినప్పుడు దానిని కోసి చికిత్స చేసి మాన్పింపక, పుండే లేనట్టు నటించుటలో లాభమెప్పుడును కలుగనేరదని నా అభిప్రాయము. ఇటువంటి నా చికిత్సలు విశేష ప్రయోజనమును కలిగించిన వనియే నా నమ్మకము.

1880 లో ధార్వాడ నాటక సమాజమువారు మా పట్టణములో గొప్ప

పాక వేసి, దానిలో తమ నాటకముల నాడిపోయిన తరువాత, ఆ నాటక శాలలో ఆడింపవలెనన్న తలంపుతో, శ్రీ హర్షదేవ విరచితమైన "రత్నావళీ" నాటకమును, షేక్స్పియరు మహాకవి విరచితమైన నాటకమును అత్యంత శీఘ్రకాలములో తెనిగించి ఆ నాటకశాలలో జయప్రదముగా ప్రదర్శింపించితిని.

1880 లో 'వివేక దీపిక' అను పేరుతో స్త్రీ పునర్వివాహమును గూర్చిన నాటకములో మూడంకములను ప్రకటించితినిగాని, వానిని తరువాత ముగింపలేదు.

1875 నందు కాళిదాసు 'అభిజ్ఞాన శాకుంతలము' తెనిగింప వలెనని తలచి, కలకత్తా, బొంబాయి మొదలగు బహు స్థలములనుండి ముద్రిత పుస్తకములను, ఒక పండితుని వద్దనుండి లిఖిత పుస్తకమును సంపాదించి చదువ నారంభింపగా శ్లోకములలో పాఠ భేదములుండుటయే కాక, కలకత్తా ప్రతిలో క్రొత్త శ్లోకములు కొన్ని సహితము కానబడెను. ఇంతలో శాకుంతల నాటకము తెలుగు లిపిలో చెన్నపురిలో ముద్రింపబడినందున నేనా ప్రతిని తెప్పించుకొని భాషాంతరీకరించి 1883 లో పుస్తక రూపమున ప్రకటించితిని.

"కావ్యేషు నాటకం రమ్యం, నాటకేషు శకుంతలా" అని మన పూర్వులు చెప్పియున్నారు. అంతటి రమణీయమైన నాటక రాజమును తెనిగించుటకు నా వంటి అప్రౌఢుడు సమర్థుడు కాజాలడు. అట్లయ్యును బుద్ధి చాపల్యమును మరలించుకోలేక దీని ఆంధ్రీకరణమును నాచేత నైన ట్లట్లో నిర్వహింపగలిగినాడను. నా పుస్తకమును చదివినవారు నా భాషాంతరము మనోహరముగా నున్నదనియే చెప్పుచువచ్చిరి. నా పుస్తకము పెక్కుతడవలు ముద్రింపబడవలసిన దయ్యెను.

నేను తరువాత తెనిగించిన సంస్కృత నాటకము కాళిదాస "మాళవికాగ్నిమిత్రము" దీనిని 1885 న ముద్రించి ప్రకటించితిని. "ప్రబోధ చంద్రోదయ" నాటకమును 1891 నందు ముద్రింపించితిని. ఇది అద్వైత మత సిద్ధాంతమును ప్రతిపాదించు వేదాంత నాటకము. ఈ పుస్తకమునకు పూర్వమే ఒక నాటక సమాజము వారి "ప్రహ్లాద" నాటకమును వ్రాసి ముద్రింపించితిని. ఈ నాటకము తరువాత చేయబడిన నాటకము "రాగ మంజరి" ఇది షెరిడన్ రచించిన "డ్యూయానా" అను నాటకము నను

సరించి చేయబడినది. 1885 నందే భారత విరాట పర్వములోని దక్షిణ గోగ్రహణ కథను నాటకముగా రచించి ముద్రింపించినాడను. హరిశ్చంద్రో పాఖ్యాన నాటకమును మొదట 'వివేకవర్ధని' లో ప్రకటించి, 1889 లో పుస్తక రూపమున ముద్రింపించితిని. నా "సత్యహరిశ్చంద్ర" నాటకమును సర్వకళాశాలవారు పఠనీయ గ్రంథముగా నిర్ణయించిరి. ఈ పుస్తక మీవరకు ఆరేడు తడవలు ముద్రింపబడినది.

1889 నందు నేను 'తిర్యన్విద్వన్మహాసభ,' 'మహారణ్య పురాధి పత్యము' అను రెండు పుస్తకములను చేసితిని. మొదటి నా మిత్రులైన బసవరాజు గవర్రాజుగారు మరణము నొందినప్పుడు వారి బంధువులు మొదలయినవారు పెట్టిన బాధలను చూచి, వారి దుశ్చర్యలను వెల్లడి చేయవలెనని చేసిన ఆక్షేపగర్భ సంభాషణము. ఇది భారతములోని గృధ్రజంబుకోపాఖ్యానము మూలాధారముగా కొని చేయబడినది. ఇది యును, "మూషకాసుర విజయము" ను ఒకటిగా చేర్పబడి, జంతు పాత్రముల చిత్ర పటములతో ముద్రింపబడినది. ఏలూరు లక్ష్మీనర సింహముగారు నాపై తెచ్చిన అభియోగములో కొందరు విద్యాంసులీ చిన్న గ్రంథములోని ఆయా పాత్రములు తమ్ము ఉద్దేశించినవని సాక్ష్యము చెప్పిరి.

"మహారణ్య పురాధిపత్యము" ఆక్షేపగర్భ నాటకమే. పంచ తంత్రము లోని కథ దీనికి మూలాధారము. సంఘములో గల వివిధ దురాచారము లను మాన్పింపవలెనన్న ముఖ్యోద్దేశముతో వినోదకరముగా వ్రాయబడి నది. ఇది తమ్ము ఉద్దేశించి వ్రాయబడినదని ఏలూరు లక్ష్మీనరసింహము గారు నాపై అభియోగములు తెచ్చిరి.

నా చేత రచించిపబడిన నాటకములలో కడపటిది "కల్యాణ కల్పవల్లి." ఇది షెరిడన్ రచించిన నాటకమునకు తెలుగు. దీనిని 1894 లో ముద్రింపించి ప్రకటించితిని.

నాకు స్త్రీ విద్య యందును, స్త్రీల యభివృద్ధియందును విశేషాభిమానము. స్త్రీలను ప్రస్తుత పరిస్థితిలోనే యుంచి తాము పైకి లేచుట పురుషుల కెన్నడు సాధ్యము కాదనియు, తాము బాగుపడవలెనన్నచో వారిని కూడ మంచి స్థితిలోనికి తెచ్చి వారితో గలిసి ఉన్నతపదవికి లేవవలయుననియు నేను తలంచుచుండెడివాడను. వారు చదువుటకు మంచి పుస్తకములు లేకుండుట

తలపోసి, 1883 లో 'సతీహిత బోధిని' అను మాస పత్రికను ప్రచురించుట కారంభించితిని. ఆ సంవత్సరమే "సత్యవతీ చరిత్రము" అను చిన్న ప్రబంధమును చేసితిని. దానిని చదివి ఆనందించిన వారనేకులు తమ స్త్రీ శిశువులకు సత్యవతి పేరు పెట్టిరి. ఈ పుస్తకము అరవము లోనికిని, కన్నడము లోనికిని, ఇంగ్లీషులోనికిని భాషాంతరము చేయబడినది.

1884 లో స్త్రీల నిమిత్తమయి 'చంద్రమతీ చరిత్రము' చేసితిని. 1887 లో స్త్రీల కొరకు 'సత్య సంజీవని' అను నీతిబోధకమయిన పుస్తకమును చేసితిని. దీనిలోని కథను నేనేదో ఇంగ్లీషు పుస్తకమునుండి గ్రహించితిని గాని నా కిప్పుడు స్మరణమునకు రాలేదు. ఈ పుస్తకమును చదివినప్పుడొక బాలిక తాను అవరకు ఆడిన అబద్ధము స్మరణకురాగా, పుస్తకమును క్రిందపెట్టి యేడువ దొడగెను.

1891 న, స్త్రీల విషయమున మనవారు చేసిన అన్యాయములు తేటపడునట్టుగా "సత్యరాజ పూర్వదేశ యాత్రలు" ప్రథమ భాగమును రచించి ప్రకటించితిని. Gulliver's Travels చదివినప్పుడు మూఢ విశ్వాసములను పరోక్షముగా ప్రదర్శించుచు అట్టి పుస్తకమును చేయవలెనని బుద్ధి పుట్టినది. మనలో ఇంగ్లీషురాని వారనేకులు కల్పిత కథకును, సత్యచరిత్రకును భేదము కనిపెట్టలేకున్నారు. ఈ పుస్తకము ప్రకటింపబడినప్పుడు సత్యరాజు విలాసము తెలుపవలసినదని బహుస్థలముల నుండి లేఖలు వ్రాసిరి. ఈ పుస్తకము ఇంగ్లీషు లోనికిని, కన్నడము లోనికిని భాషాంతరము చేయబడినది.

1897 లో స్త్రీల కొరకు విక్టోరియా మహారాజ్ఞిగారి చరిత్రమును పటములతో ప్రకటించితిని. అప్పటికి రాణిగారు సజీవులయి యుండుటచేత అంత్యదశ అందు చెప్పబడలేదు.

1893 లో 'నీతి కథామంజరి' చిత్ర పటములతో రెండు భాగములుగా ప్రకటించితిని. ఈ పుస్తకము ఈసపు కథల ననుసరించి చేయబడినది. 1889 లో స్త్రీలకత్యావశ్యకములైన శరీరారోగ్య ధర్మములను బోధించెడి 'దేహారోగ్య ధర్మ బోధిని' ప్రకటించితిని. 1889 న 'సతీహితబోధిని' పత్రికలోని ముఖ్య వ్యాసముల నేర్చికూర్చి పుస్తక రూపమున ప్రకటించితిని. అవరకే 'స్త్రీ నీతి దీపిక' అను శతకమును బాలికలకై చేసితిని. అటు

తరువాత "సత్యా ద్రౌపదీ సంవాదము", "మాతృపూజ", "పితృపూజ" అనువానిని స్త్రీల ఉపయోగార్థము ద్విపదములుగా చేసితిని.

స్త్రీలు వినోదకరముగా చదువుకొని ఆనందించుటకు, షేక్స్పియరు నాటకముల ననుసరించి Lamb వచన రూపములో రచించిన కథలలో 16 సులభశైలిని తెనిగించితిని. మునుపున్న పేరులను పెట్టి, సాధ్యమయినంత వరకు మనవారికింపుగా నుండునట్లు చేసితిని.

జనులలో గల మూఢ విశ్వాసములు పోవుటకు ప్రకృతి శాస్త్ర జ్ఞాన మావశ్యకమని తలచి, తెలుగులో అవిలేని లోపమును సాధ్యమైనంత వరకు పోగొట్టవలెనన్న యుద్దేశముతో నేను 1878 కి పూర్వమే పదార్థ వివేచక శాస్త్రమును ప్రశ్నోత్తర రూపమున తెనిగించి ప్రకటించుచుంటిని. ఆ కాలము నందుండిన The Social Reform Association సభ్యుడును, మన్మిత్రుడును పదార్థ వివేచక శాస్త్రమును తెనిగింప వలెనని వలయు పరికరములనెల్ల సమకూర్చుకొన్నట్లు తెలుపగా, ఆ సభవారు నా అనుమతి మీద ఆయనను నియమించి, నన్ను శరీర శాస్త్రమును చేయ నియ మించిరి. ఈ నియామకమయిన తరువాత నా మిత్రుడు 20 ఏండ్లు జీవించి నను తన పదార్థ వివేచక శాస్త్రమును చేయకయే స్వర్గస్థుడయ్యెను.

1888 సంవత్సరాంతరమున ప్రచురింపబడిన నా శరీర శాస్త్రము యొక్క ఉపోద్ఘాతములోని కొంత భాగము:

"తెనుగు భాషయందు ప్రకృతి శాస్త్రములు లేని లోపమును కొంత వరకు నివారించుటకయి ఈ శరీర శాస్త్రమును మొట్టమొదట నారంభించి ఒక విధముగా ముగింపగలిగినాడను. విద్యాశాఖవారును, మహాజనులును తగిన ప్రోత్సాహమును కలిగించిన యెడల, యితర శాస్త్ర శాఖలలో కూడ సులభ శైలిని ప్రతిమలతో క్రమక్రమముగా గ్రంథములు చేసి ప్రచురింప నుద్దేశించి యున్నాను. జ్యోతిశ్శాస్త్రమును ఈవరకే ఆరంభించి యున్నాను...... ఇంగ్లీషు భాషలోని శరీర శాస్త్రములను పెక్కింటిని చదివితిని. నిదర్శన పూర్వకముగా పరీక్షించిన గాని కొన్ని అంశములు పూర్ణముగా తెలిసికొనుట అసాధ్యముగా కనబడినందున, నా మిత్రుడైన వైద్యశాలా సహాయుడు మేక యొక్క హృదయము, శ్వాసాశయము మొదలయిన వాని భాగములు భేదించి చూపగా అంశములనేకములు గ్రహించితిని......"

కొంత ధన వ్యయము చేసి సంపూర్ణమయిన మనుష్య కంకాళమును సంపాదించితిని. మనుష్యుల హృదయ శ్వాసకోశాదులను పరీక్షించి చూచుట ఎక్కువ ఉపయోగకరమని భావించి, శవ పరీక్ష నిమిత్తమయి కొత్త శవము వచ్చినప్పుడు నాకు వర్తమానము చేసి కోసి చూపించునట్లు వైద్యశాలాధికారులతో ఏర్పాటు చేసితిని. వారొకసారి నన్ను పిలిపించి, నా ఎదుట శవమును కోయ నారంభింపగా నేను కన్నులు తిరిగి, వికారము వచ్చి మూర్ఛపోయితిని. వారు నా మొగము మీద చల్లనీళ్లు కొట్టి, తెలివి వచ్చిన తరువాత ఇంటికి పంపివేసిరి.

ఈ పుస్తకమునకు కావలసిన చిత్ర రూపములను విశేష ధన వ్యయము చేసి 22 కలకత్తాలో కర్రమీద చెక్కించి చెప్పించితిని. మొదటి కూర్పు 4 సంవత్సరములలో వ్యయమయ్యెను. రెండవ కూర్పునందు 15 ను, మూడవ కూర్పునందు 16 ను కొత్త పటములు ఇంగ్లండులో చేయించి తెప్పించి చేర్చి కొన్ని కొత్త విషయములను, మార్పులను పుస్తకమునందు పొందుపరచితిని. ఇప్పటిది నాల్గవ కూర్పు.

1895 నందు జ్యోతిశ్శాస్త్ర సంగ్రహమును పటములతో ప్రకటించితిని. మిక్కిలి పురాతనమగు గర్గసిద్ధాంతములో "మ్లేచ్ఛాహియవనాస్తేషు సమ్యక్శాస్త్ర మిదంస్థితమ్ ఋషివత్తేపి పూజ్యంతే కింపునః దైవకద్విజాః" అని వ్రాయబడియున్నది. ఇప్పటివారివలె తామే సర్వజ్ఞులమనియు, తమ పూర్వులు చెప్పినదే సత్యమనియు భావించుకొనక, అప్పటివారు కృషి చేసి శాస్త్రజ్ఞానమును వృద్ధిపరచియు, తమకు తెలియనిదాని నితర దేశస్థుల వలన గ్రహించియు నభివృద్ధిచెందుచు వచ్చినట్లు కనబడుచున్నది. తామే సర్వజ్ఞులమన్న గర్వమును, ఇతరుల వలన నేర్చుకొన్నచో గౌరవ లోప మను దురభిమానమును గలవారెప్పుడును వృద్ధినొందక క్రమముగా క్షీణదశకు వత్తురు. పైని చెప్పిన దురభిమానము మనదేశము నందు ప్రబలి, సర్వమును మన శాస్త్రములలోనే యున్నదనియు, మన మితరులవలన నేర్చుకోవలసిన దేదియు లేదనియు దురభిప్రాయము బలపడ నారంభించినది మొదలు శాస్త్రజ్ఞానము క్రమముగా క్షీణదశకు వచ్చుచు, ఇప్పటి హీన స్థితికి వచ్చినది.

ఈ గ్రంథమును రచించుటకయి నే నింగ్లీషు భాషలోనున్న జ్యోతిష గ్రంథములను చదువుటయే కాక, సంస్కృత భాషలోనున్న సూర్య

సిద్ధాంతము, సిద్ధాంత శిరోమణి, పంచసిద్ధాంతిక మొదలయిన గ్రంథములను సహితము చదివితిని. తెలిసినవారి సాయమువలన రాత్రులు గ్రహములు, నక్షత్రములు మొదలయిన వానిని చూచి, వాని రూపములను స్థానములను గ్రహించితిని. చెన్నపురికి పోయి యుండినప్పుడప్పుడు నక్షత్రశాలాధికారుల సాహాయ్యమున శనిగ్రహాదులను శనిగ్రహము యొక్క యుంగరములను (rings of saturn) దూరదర్శక యంత్రముతో చూచితిని. గ్రహ, నక్షత్ర, ధూమకేతు, సూర్య చంద్రోపరాగాదులను చూపెడు పటములను 50 కంటె ఎక్కువగా ఇంగ్లండు నుండి చేయించి తెప్పించి పుస్తకములో యుక్త స్థలముల యందు వేయించితిని.

ప్రకృతి శాస్త్రములలో నేను రచించిన మూడవది జంతుస్వభావ చరిత్రము. దీని ప్రథమ భాగము 1896 లో దాదాపు 60 జంతు పటములతో ప్రకటింపబడినది. పుస్తకము చదువువారికి మనోహరముగా నుండుటకయి అక్కడక్కడ వానిని గూర్చిన కథలను, మనుష్యులకు వానిని గూర్చి గల అభిప్రాయములను కూడ చేర్చియున్నాను.

సంగ్రహ వ్యాకరణము, కావ్య సంగ్రహము, అలంకార సంగ్రహము, ఆంధ్ర తర్క సంగ్రహము అనెడు నేను రచించిన గ్రంథములు శాస్త్ర సంబంధములైనవే గాని ప్రకృతి శాస్త్రముతో సంబంధించినవి కావు.

నెను చేసిన గ్రంథములలో కెల్ల "ఆంధ్ర కవుల చరిత్రము" ప్రధానమైనదని చెప్పవచ్చును. దీని ప్రథమ భాగమును 1887 లో ప్రకటించితిని. ఈ ప్రథమ భాగము పూర్వ కవులను గూర్చినది. 1450 వరకు గల కవులు పూర్వ కవులనియు, 1450 తరువాత 1650 వరకు గల కవులు మధ్య కవులనియు, 1650 తరువాత వారు అధునిక కవులనియు సంకేత మేర్పరచుకొంటిని. రెండవ భాగము మధ్య కవులను గూర్చినది. మూడవ భాగము అధునిక కవులను గూర్చినది. మూడు భాగము లందును చెప్పబడిన కవుల సంఖ్య 200 కంటె హెచ్చుగానున్నది.

మన దేశములో చరిత్రములు వ్రాసెడి ఆచారమంతగా లేదు. అందు చేత కవుల చరిత్ర వ్రాయుట ఎంతో కష్టసాధ్యమయ్యెను. గ్రంథకర్తలనేకులు తమ గ్రంథములను రాజుల కంకితము చేసి యుండుట చేత రాజుల కాలమును బట్టి కవుల కాలము కనుగొనవలసివచ్చెను. రాజుల కాలములను కనుగొనుటకైన మనలో చరిత్రములు లేవు. వారు భూదా

నాదులు చేసినప్పుడును, గుళ్లు గోపురములు కట్టించినప్పుడును శాసనములు వ్రాయించి, దానాదులు చేసిన కాలమును వ్రాయించుచు వచ్చుట చేత రాజుల కాల నిర్ణయమును, వారు కృతుల నందుటచేత కృతికర్తల కాల నిర్ణయమును చేయవలసి వచ్చెను. కృతి కర్తలలో అధిక సంఖ్యాకులు తమ గ్రంథములను దేవతల కంకితము చేయుచు వచ్చిరి. వారి కాలము కనుగొనుటకయి వారు పూర్వ కవులనుగా పేర్కొని స్తుతించిన వారి నామ ములు తక్క వేరాధారములు కనబడలేదు. కవుల కాల నిర్ణయమును చేయుటలో లక్షణ గ్రంథములు కొంతవరకు సాయపడినవి. లక్షణ గ్రంథములు చేసినవారు కొందరు తాము చెప్పిన లక్ష్యములుగా పూర్వ కావ్యములనుండి పద్యములనుదాహరించుచు వచ్చిరి. ఇట్లెన్నియో కష్టము లున్నను నేనెంతో శ్రమపడి కాలనిర్ణయము కొంతవరకు చేయగలిగి నాడను.

ఈ విషయమై దొరతనమువారిచే ప్రకటింపబడిన దక్షిణ హిందూదేశ శాసన పుస్తకములను మాత్రమేగాక, చెన్నపురి యందును, ఇతర రాజధాను లందును, మైసూరు నందును ప్రకటింపబడుచు వచ్చిన తామ్ర, శిలాశాస నాదులు గల పత్రికలను, పుస్తకములను, చరిత్రలను తెప్పించి చదివితిని. చెన్నపురి చిత్ర వస్తుప్రదర్శనశాలలో నున్న తామ్ర శాసనములను చదివి తిని. ముద్రితములు కాని తాళ పత్ర పుస్తకములను విస్తారముగా సంపా దించితిని. తంజావూరిలోని సరస్వతీ భాండాగారములో తెలుగు పుస్తకము లున్నవని విని, అక్కడకు పోయి, పుస్తకములు చదివి, నాకు కావలసిన భాగములను వ్రాసికొని వచ్చితిని. మూడు సంవత్సరములు వరుసగా వేసవి సెలవులలో చెన్నపట్టణము పోయి అక్కడి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము (Oriental Manuscripts Library) లో ప్రతిదినమును 10 నుంచి సాయంకాలము 5 గంటలవరకును తాళపత్ర లిఖిత పుస్తకము లను చదివి, కావలసిన భాగములను వ్రాసికొనుచుంటిని.

ఒకనాడు ట్రాము (tram) బండిలో నెక్కిపోయి సముద్రతీరమున దిగి, అక్కడ నుండి కోటకు నడిచిపోయి, కావలసిన పుస్తకమును పుస్తకభాండా గారమునుండి పైకి తీయించి వ్రాసుకోబోగా, నా చొక్కా జేబులో వ్రాత పుస్తకము (note book) కనబడలేదు. ట్రాము బండిలో దానిని విడిచి వచ్చితినని, వెంటనే మరల సముద్రతీరమునకు (beach) పోయి, మరి

యొక ట్రాము బండి నెక్కివెళ్లి, మొదట ఎక్కివచ్చిన బండివానిని కనుగొని అడుగగా, ఏదో వ్రాత పుస్తకము బల్లమీదనుండగ క్రింద పారవైచితినని అతడు చెప్పెను. అతని బండిలో మరల నెక్కి, అతడు పుస్తకమును పార వేసితినన్న స్థలమునకు వచ్చి దిగి, ఆ సమీపమున వెదకి, చుట్టుపట్టుల వారిని విచారించి, పుస్తకమిచ్చినచో సొమ్మిచ్చెదనని ఆశ పెట్టితినిగాని, పుస్తకము జాడ కానరాలేదు. పుస్తకము తెచ్చి ఇచ్చిన వారికి 25 రూపాయలు పారితోషిక మిచ్చెదనని ప్రకటించినను కార్యము లేక పోయెను. నేను నెల దినములు పడిన కష్టమంతయు నిష్ఫలమయ్యెను. అందుచేత నేను కోటకు పోయి చదివిన పుస్తకములనే మరల చదివి, వ్రాసిన దానినే మరల వ్రాసికోవలసి వచ్చెను. ఈ ప్రకారముగా నేను విశేష శ్రమపడి కవుల చరిత్రము వ్రాసి ముగించితిని. పునస్సం శోధనము చేసి దాని నిప్పుడు వృద్ధిచేసి బాగుపరచ వచ్చునుగాని, వృద్ధు డనయి దుర్బలుడనయి యుండుటచేత శక్తియు, ఓపికయు నాకు లేకున్నవి.

1650 కి ఈవలి వారు పూర్వ వర్ణనలనే తలలో కూర్చి ప్రయోగించుచు, వెనుకటి ప్రబంధముల ననుసరించి ప్రబంధముల నల్లజొచ్చిరి. అర్థ స్వారస్యమునంతగా పాటింపక, నిఘంటువులను వెదకి పదములేర్చి కూర్చి, బంధాములను చేసి, అవయవములు విరిచి తమ భాషా వధూటిని విరూపిని, శవప్రాయను చేసిరి. ఈ అభిప్రాయమును తేటపరచుటకయి నేనాకాలము నందు 'సరస్వతీ నారద విలాపము' అను నొక చిన్న పద్య పుస్తకమును చేసితిని. ఇది, నారదుడు తన తల్లియైన సరస్వతిని ఆనవాలు పట్టలేక కారణమడుగగా, ఆమె తన దురవస్థ చెప్పుకొని విలపించునట్లున్న, ఉత్తర ప్రత్యుత్తర రూపమైన సంవాద గ్రంథము.

ఇంగ్లీషు భాషలోని ప్రహసనముల ననుసరించి పది ప్రహసనములను తెలుగు వారికనుకూలముగ నుండులాగున మార్చి చేసితిని. (మరి నాలుగు) నా స్వకపోల కల్పితములైన ప్రహసనములు.

జన్మాంతరము, అతి బాల్య వివాహములు, విగ్రహారాధనము, ఈశ్వ రోపాసనము, ప్రార్థన, వర్గము, స్త్రీ పునర్వివాహ చరిత్రము, శంకరా చార్యులు, బసవరాజు గవర్రాజుగారి జీవిత చరిత్రము మొదలయినవి (about 30) నేను వ్రాసికొని వచ్చి సభలలో చదివిన ఉపన్యాసములు.

కేవల వాగ్రూపముగా సభలలో నేనిచ్చుచు వచ్చిన ఉపన్యాసములు వీని కంటె నాలుగురెట్లయినను కలవు.

ఆరంభ దశలో నా మిత్రులు, నేను చక్కగా వ్రాయగలను గాని మాటాడలేనని భావించుచుండిరి. నేను గంటల కొలది తడవుకొనకుండ ఉపన్యాసము చేయగలిగినను, నా వాగ్రూపములైన ఉపన్యాసములు నా లిఖితోపన్యాసములంత శక్తిమంతములుగా నుండకపోవుట సత్యమే. నాది పెద్ద గొంతుక కాదు. చెప్పునప్పుడు నాకు అభినయము లేదు. మూడవది, వినువారివంక చూడక నా ధోరణిని నేనే చెప్పుకొని పోవుట. ఇవి మంచి వక్తకుండవలసిన లక్షణములు కావు. అయినను నేను చెప్పెడిది యుక్తి యుక్తముగాను, హృదయాంతరాళము నుండి వచ్చినదిగాను వినువారికి తోచుచుండెను.

1894-95 లో నేను స్వదేశ సంస్థాన చరిత్రాదులను పుస్తక రూపమున చిత్ర పటములతో ప్రకటించితిని. 1894 ఎండకాలపు సెలవులలో తెలుగున జీసస్ చరిత్రమును వ్రాయనారంభించి ఆరు ప్రకరణములు చేసి 1913 ఏప్రిల్‌లో మిగిలియున్న రెండు ప్రకరణములు వ్రాసి ఏదో విధముగా ముగించితిని.

ఉత్తమ స్త్రీ చరిత్రములు మొదటి భాగము క్రొత్తగా ప్రకటించితిని. ఇందు గ్రేస్ డార్లింగ్, ఆర్లియన్స్ కన్య (Joan of Arc) ఎలిజబెత్ ప్రై, లేడీజెన్ గ్రే, మెరీకార్పెంటర్ అను ఇంగ్లీషు కాంతల చరిత్రములును, 'ఉత్తమ మాత' అను ఉపన్యాసము ఉన్నవి.

రాజారామమోహనరాయల చరిత్రమును బహు సంవత్సరముల క్రిందట నారంభించి కొంతవరకు వ్రాసి విడిచిపెట్టితిని. ఈశ్వరానుగ్రహము వలన దానిని గూడ ముగించి ప్రకటింప గలుగుదునేమో !

1892 లో, ఇంగ్లీషులో Goldsmith రచించిన Traveller పద్య కావ్యమును 'పధిక విలాసము' అను నామముతో పద్య రూపమున తెనిగించితిని.

నేను వ్రాసిన పుస్తకము లింకను కొన్ని కలవు. కర్నల్ మక్డానల్డు దొరగారు విద్యా విచారణాధికారిగా నున్న కాలములో దొరతనమువారి రెండవ పాఠ్య పుస్తకమును వ్రాసితిని. దానికి దొరతనమువారు 250 రూపాయలను నాకిచ్చిరి. మార్పుసన్ దొరగారి కోరికమీద మాక్మిల్లన్

కంపెనీవారికి నాల్గవ, అయిదవ, ఆరవ వాచక పుస్తకములను వ్రాసి ఇచ్చితిని. ఈ మూడు పుస్తకములకును నాకు వేయి రూపాయల నిచ్చిరి. ఈ వాచక పుస్తకములలో ఒకదానిని వారు ముద్రింపించుచుండినప్పుడు ముద్రా శాల వారి అజాగ్రత్తవలన కొంత భాగము తిరిగి వ్రాసి యియ్యవలసినదని అడిగిరి. చిత్తు వ్రాయుట నాకభ్యాసము లేదనియు, సొమ్మిచ్చినయెడల మరల వ్రాసెదననియు బదులు చెప్పవలసిన వాడనయితిని. వారా ప్రకార ముగా మరల సొమ్మిచ్చి పోయిన భాగమును నాచేత క్రొత్తగా వ్రాయించు కొనిరి. ఈశ్వరుడు నాకు వేగముగ వ్రాసెడు శక్తిని ప్రసాదించి యున్నాడు. పద్యమునుగాని, వచనమునుగాని నే నొక్కసారియే వ్రాయు చుందును. వ్రాసిన దానిని మరల దిద్ది వ్రాయుట నా కలవాటు లేదు. అందుచేత నా వ్రాత అంత మెరుగుగా నుండదనుకొనెదను. నేను వ్రాసిన పుస్తక మొకసారి పోయిన అది ఎప్పటికిని పోవలసినదే.

తెలుగు భాషను వృద్ధిచేయవలెనన్న అభిలాష మొదటి నుండియు నాకు విశేషముగా నుండెను. నేను నా కాలమంతయు భాషాభివృద్ధి నిమిత్తమే ఉపయోగించి పాటుపడిన పక్షమున కొంతవరకు నా అభిలాష నెరవేరి యుండునేమో! నేనొక్కపనితో తృప్తి నొందక ఎన్ని పనులు పైని వేసికొని నిర్వహింప జూచుచుండెడివాడనో మీకు విశదమయియుండును. ఇన్ని పనులు ఒక్కసారిగా పైన వేసికొనుటచే నేనేపనిని తృప్తికరముగా నిర్వ హించుటకు సమర్థుడను కాకపోతిని. ఇట్లయ్యును నేను కొంచెములో కొంచెము నా అభిలాష సిద్ధిని బడసితిననుకొందును. నే నారంభించిన కాలములో తెలుగులో ఏ విధమైన పుస్తకములు వచన రూపమున లేవనియే చెప్పవచ్చును. అన్నియు నూతన సృష్టి చేయవలెను. తెలుగులో మొదటి వచన ప్రబంధము నేనే చేసితిని. మొదటి నాటకమును నేనే తెనిగించితిని. మొదటి ప్రకృతి శాస్త్రమును నేనే రచించితిని. మొదటి ప్రహసనమును నేనే వ్రాసితిని. మొదటి చరిత్రమును నేనే విరచించితిని. స్త్రీలకై మొదటి వచన పుస్తకమును నేనే కావించితిని. అయినను ప్రథమ ప్రయత్నము లెప్పుడును ప్రథమ ప్రయత్నములే. అవి దోష బహుళములయి యుండుట స్వాభావికము. మనము వృద్ధి పొందగలుగుట చేసిన తప్పులను బట్టియే కాబట్టి మొదట చేయబడిన నా పుస్తకములను తరువాతి వారి గురుతర పుస్తక రచనకు కొంత తోడుపడవచ్చును.

నే నిట్లు క్రొత్త పుస్తకములను రచించుటయేకాక, ప్రాత పుస్తకములను ప్రకటించుటకు కూడా శ్రమ పడితిని. "శబ్ద రత్నాకర" కర్తయైన బహుజనపల్లి సీతారామాచార్యులవారు తమ నిఘంటువు యొక్క అవతారికలో కొన్నిపూర్వ పుస్తకముల పేరులు చెప్పి, వాని పేరులు వినబడుటయే గాని పుస్తకము లెక్కడను కానరావని వ్రాసి యున్నారు. వారట్లు వ్రాసిన పుస్తకములలో పదింటికంటె హెచ్చుగా నేను సంపాదించి, సంశోధించి, ముద్రింపించి ప్రకటించితిని. అపురూపములైన పుస్తకములను ప్రకటించుటలో గల కష్టము పనిచేసిన వారికేగాని ఇతరులకు దురవగాహముగా నుండును.

అముద్రితములయి యున్న వానిని సంస్కరించి నేను ముద్రింపించిన పుస్తకములు 20 కంటె ఎక్కువగా నున్నవి.

## 3. విశ్రాంతి దశ-1900 మొదలు 1910 వరకు

ఈ కాలమును నేను విశ్రాంతివశ అని పిలుచుచున్నను నాకు నిజమైన విశ్రాంతి ఎన్నడును కలుగలేదు. ఎప్పుడును నేనేదో పని చేయుచుండ వలసినవాడనేగాని, భోగము ననుభవించుచు సుఖముగా కూరుచుండుట నా స్వభావము కాదు. తన అపార కరుణచేత పరమేశ్వరుడు నన్నెల ప్పుడు కష్టజీవినిగా నుంచునట్లే తోచుచున్నది.

గోగులపాటి శ్రీరాములుగారు ప్రథమ వితంతు వివాహము చేసి కొన్నప్పుడు తనకు ప్రథమ భార్య వలన కలిగిన 4 మాసముల పురుష శిశువును పెంచుటకయి మా వద్ద విడిచెను. నాయందలి గౌరవము చేత శ్రీరాములుగారా శిశువునకు నా పేరే పెట్టిరి. అతనికి మేమే విద్యాబుద్ధులు చెప్పించుటచేత అతడు పట్ట పరీక్షయందు కృతార్థుడయ్యెను. 'అపుత్రస్య గతిర్నాస్తి' అన్న నమ్మకము నాకు మొదటినుండియు లేదు. నేను కొడుకును పెంచుకోవలెనని ఎప్పుడును తలచలేదు. నాకు గల స్వల్పమైన సొత్తును ధర్మకార్యములకు వినియోగింపవలెనని నేను నిశ్చయించుకొంటిని. వీరేశ లింగమునకు (The boy) తన మేన కోడలనిచ్చి వివాహము చేసి, అతనిని తనయొద్ద నుంచుకోవలెనని నా భార్య యుద్దేశము. కొంత కాలము జరిపి నా భార్య తమ్ముడు తన కూతురునిచ్చుట కిష్టపడక మరియొకరి కిచ్చి వివాహము చేసెను. వివాహ విషయమును వధూవరుల యిష్టమునకు విడువ వలసినదేగాని తదితరులందులో సంబంధము కలిగించుకొనరాదని నా అభిప్రాయము. అతడు (వీరేశలింగము "The boy") వితంతువును వివాహ మాడ నిశ్చయించుకొన్నట్లు నాతో చెప్పెను. వితంతు వివాహము చేసికొన్న యెడల చెన్నపట్టణములో నున్న యిండ్లలో నొకదానిని అతని కిమ్మని నా భార్య కోరగా నేనందుకు సమ్మతించితిని. వివాహము జరుగునట్లే కనబడెను. అతడొక పర్యాయము రాజమహేంద్రవరము వెళ్లి తన మిత్రులతో ఆలోచించుకొని వితంతు వివాహము తన కిష్టములేదని చెప్పెను. తరువాత, మైసూరులోని చెరుకుమిల్లి వేంకటరత్నముగారు తమ కొమారితను వీరేశ లింగమునకిచ్చి వివాహము చేయ తనకిష్టమున్నదని చెప్పితిని. ఆయన

దాని కంగీకరించి వరుని తన వెంటగొనిపోయెను. వీరేశలింగము బెంగుళూరిలో ప్రాయశ్చిత్తము చేయించుకొని వివాహమాడెను. వివాహా నంతరమతడు మరల మా యొద్దకు రాక వేరుగా నుండెను.

ఏడెనిమిది సంవత్సరములు చెన్నపట్టణములో నుండి 1905 ఆరంభ మున వచ్చుటచేత రాజమహేంద్రవరము కొంతవరకు నాకు క్రొత్తదిగా కనబడెను. మునుపటివలె నాకు విద్యార్థుల సాహాయము లేదు. ఉన్నవారు నా బోధనమును వినని వారగుటచేత వారిలో సంఘ సంస్కారోత్సాహము లేదు. పురములోని పెద్ద మనుష్యులలో కూడ సంస్కారోత్సాహము తగ్గి పోయినది. న్యాయవాదులు మొదలైనవారు అనేకులు క్రొత్తవారు. అయినను దేశిరాజు బాపయ్యగారు మొదలయిన కార్యశూరులు నాకు క్రొత్త మిత్రు లయిరి.

రాజమహేంద్రవరము రాగానే నేను మొట్టమొదట చేసిన పని 'శ్రీ విక్టోరియా బాలికా పాఠశాల' అను పేరుతో ఒక బాలికా పాఠశాలను స్థాపించుట: రెండవ పని 'సత్యవాదిని' అను పేరుతో మార్చి నెల మొదట తేదీనుండి ఇంగ్లీషు తెలుగు భాషలలో ఒక వార పత్రికను ప్రకటింపబూనుట. బాలికా పాఠశాల 1905 జనవరి 16 న మా స్వగృహమునందే యుంచబడినది. నేను కాపురమున్న కొంచెము భాగము తప్ప ఇల్లంతయు పాఠశాల నిమిత్తమే విడిచిపెట్టబడినది. ఈ పాఠశాల వితంతు శరణాలయ సంబంధముననే స్థాపింపబడినది.

నేను చెన్నపురిలో స్థాపించిన శరణాలయము, నేను కాలు కదపగానే అంతరించినది – నాతోనె బైలుదేరి రాజమహేంద్రవరము వచ్చినదని చెప్ప వచ్చును. స్త్రీలను పంపదగిన పాఠశాల ఇక్కడ నేదియు లేదు. కులాంగ నలకును, బాలికలకును కూడ ఉపయోగపడెడు విద్యాశాల ఏర్పడుట ఉచితమని దీనిని స్థాపించితిని. ఈ పాఠశాలలో చదువుకొనుటకు బాలికలను మాత్రమేకాక కొందరు గృహస్థులు తమ భార్యలను సహితము పంపిరి. వృద్ధుడైన ఒక ఉపాధ్యాయుని తోడను నలుగురు బాలికలతోడను పాఠశాల నారంభించితిమి. పక్షము దినములకు బాలికల సంఖ్య 49 అయినది. సంవత్సరాంతమున 90 అయినది. పయి సంవత్సరము దాదాపుగా 150 వరకు పెరిగినది. ప్రథమ సంవత్సరాంతమున ముగ్గురు ఉపాధ్యా యులును, ముగ్గురు ఉపాధ్యాయినులును పాఠశాలలో పనిచేయుచుండిరి.

మొదటి సంవత్సరములో నేను నా చేతినుండి రూ. 1708-9-9 లు వ్యయము చేసితిని.

నేను చెన్నపట్టణమునుండి వచ్చినది మొదలుకొని బ్రహ్మసమాజములో అనుష్ఠాన పరుడను కావలెనని తలచియుంటిని. నే చిరకాలము క్రిందటనే అనుష్ఠానిక బ్రాహ్మ్యుడనయి యుందునుగాని, వితంతు వివాహ కార్యమునకు భంగము కలుగునని అట్లు చేయ సాహసింపక కష్టముల కోర్చుకొంటిని. కష్టముల కోర్చుకొనుట ఏమని కొందరు సందేహ పడవచ్చును. మొదటి వివాహము చేయగానే శంకరాచార్యుల వారు నన్ను జాతినుండి బహిష్కరించిరి. నా పక్షమున చేరిన వారందరూ ఒక్కొక్కరే ప్రాయశ్చిత్తము చేయించుకొని నన్ను విడుచుచురాగా నేనొక్కడనే మిగిలితిని. ఈ విషమ దశలో నేను హిందువుడనుగా నుండినను నాతో భోజన ప్రతి భోజనాదులు చేయుచు హిందువులెవ్వరును నాకు సహాయులుగా నుండరు. వర్ణ భేదమును విడువని వాడనగుటచేత నేను మతాంతరులతో గాని, బ్రాహ్మణేతరులతోగాని భోజనము చేయుటకయినను వలనుపడదు. ఇటువంటి స్థితిలో ఒంటిగాడనైన నాకు కష్టములుగాక ఏముండును? నేను యజ్ఞోపవీతమును విసర్జించి, వర్ణ భేదమును విడిచి అనుష్ఠానిక బ్రాహ్మ్యుడనయిన పక్షమున శూద్రాదులతో మాత్రమే కాక క్రైస్తవ మహమ్మదీయాదులతో గూడ భోజన ప్రతి భోజనాదులు చేయగల వాడనగుదును.

క్రమముగా వివాహములాడిన వారి సంఖ్య అధికమగుచు వచ్చి, భోజన ప్రతి భోజనాదులు (inter-dining) జరపదగిన సంఘమేర్పడినది. పునర్వివాహములు చేసికొన్న వారి సంఖ్య ఎక్కువగుటచేత ఎవ్వరి ఇంటనైనను వివాహములు చేయుచుండ వచ్చును. వివాహము లొక్కొక్కరి యింట చేయుచు, వారి నలవాటు పరుపవలెనన్న యుద్దేశముతో కొతా శ్రీరామ శాస్త్రిగారి వివాహమును కూనూరి పురుషోత్తముగారి ఇంట జరిపించితిని. ఇంకొక వివాహమును తణుకు వేంకటాచలపతిరావు గారి యింట జరిపించితిని.

నేను వితంతు శరణాలయము నిమిత్తము, పాఠశాల నిమిత్తమును మా యింటి నంటియున్న మా పెదతండ్రిగారి భాగమును కొని మా యింటితో కలపవలెనని ప్రయత్నించుచుంటిని. ఇంతలో మంగుళూరు నుండి రామచంద్రరావుగారును, భార్యయు 1905 మే నెలలో నన్ను చూడవచ్చిరి.

ఒకనాటి విహారములో ఒక తోటలో నుండి నడచుచుండినప్పుడు, ఈ తోట వితంతు శరణాలయము కట్టుటకనుకూలముగా నుండునని ఆయన నాతో ప్రస్తావించెను. ఈ తోట నా మిత్రులైన చల్లపల్లి రంగయ్య పంతులుగారిది. రంగయ్య పంతులుగారి ఇంటికి పోయి, వితంతు శరణాలయ నిర్మాణార్థము తోట నాకిండని అడిగితిని. తోట నెవరో మూడు వేల రూపాయల కడిగినట్టును, సత్కార్యముకొరకు నేనడుగుచున్నాను, గనుక నాకు 2,500 రూపాయల కిచ్చెదమనియు వారు చెప్పిరి. అర్బత్తు కంపెనీలో నావి 2,000 రూపాయలుండెను. ఈ తోట కొనుటకయి యీ 2,000 రూపాయలను తెప్పించితిని. ఇందులో నా కీశ్వరుని సహాయము స్పష్టముగా కనబడుచున్నది. ఈ సొమ్ము నేను తెప్పించుకొన్న శీఘ్రకాలములోనే అర్బత్తునట్టు కంపెనీ దివాలా తీసెను. చెన్నపట్టణములో నున్న ఇండ్లనిప్పటికింకను విక్రయింప లేదు. ఆ యిండ్లను విక్రయించి, వచ్చిన ధనముతో క్రొత్తగా కొన్న తోటలో వితంతు శరణాలయము కట్టింపవలెనని యుద్దేశించుకొంటిని!

'సత్యవాదిని' అను ఇంగ్లీషు తెలుగు వార పత్రికకు చందాల మూలమున వచ్చినది పోగా దానికయ్యెడు మిగిలిన ఖర్చులన్నిటిని నేనే భరించవలసినవాడనయితిని. ప్రథమ భార్య వలన సంతానములేదన్న హేతువు చేతనో, మరి ఏ హేతువు చేతనో ప్రథమ భార్య జీవించి యుండగానే పోలవరము జమీందారుగారు రెండవ వివాహము చేసికొనిరి. హిందూ ధర్మ శాస్త్రానుసారము ఇట్టి వివాహము దూష్యము కాకపోయినను, విద్యాధికులైన ఇప్పటి వివేకుల దృష్టియందు దూష్యము కాకపోదు. ఈ వివాహ విషయమయి 1901 మార్చి 29 'సత్యవాదిని' సంచికలో ఇట్లు వ్రాసితిని:

"పోలవరము జమీందారుగారీనడుమ తమ వివేకమును విడిచి, విద్యుక్తముగా వివాహ మాడిన భార్య విలపించుచుండగా విడనాడి, పదేండ్ల పడుచును మరల వివాహ మాడిరని వినుట కెంతయు చింత నొందుచున్నారము. ఈయన ఆరంభ దశయందు సంఘ సంస్కారమునందాదరము గలవాడయి, వితంతు శరణాలయమునకు వేయి రూపాయల నిచ్చుటను చూచి, యీయన వలన నీ దేశమునకెంతో మేలు కలుగునని తలంచియుంటిమి. కాని ఈయన చదువుకొన్న చదువును, వయసుతో వర్థిల్ల వలసిన వివేకమును ఇట్లు పదట కలిసి, దేశమున కనర్థము కలుగు

నని మేమెన్నడును భావించి యుండలేదు. ఈమధ్య నీయన ఆర్యమతోద్ధార కులుగా మారి, 'ఆర్యమత బోధిని' కి ప్రధాన పోషకులైరని వినియుంటిమి. 'ఆర్యమత బోధిని' ఈ వివాహము నెట్లు వర్ణించి, శ్లాఘించునో చూడ వలసియున్నది.... ఎంత చదివిన వాడైనను నీతిలేని వాడైనచో మనుష్య నామమునకే అనర్హుడగును. తప్పు చేయుట వింత కాదు. చేసిన తప్పు తెలిసికొని, మించిన దానికి అనుతాపపడి, ముందు తన ప్రవర్తనమును బాగు చేసికొనుట బుద్ధిమంతుని లక్షణము. కాబట్టి, ఉత్తమురాలైన తమ ప్రథమ భార్యను మరల కొనివచ్చి, యింట నుంచుకొని ఆదరించి, కోరి తెచ్చు కొన్న ఈ క్రొత్త భార్య ఎదిగి కాపరమునకు వచ్చినప్పుడు, ఈ అగ్ర మహిషికి కలిగించిన సౌఖ్యమునే కలిగింపక, ఆ యబలను అర్ధాంగి యను టకు తగినట్లుగా ఆదరింతురని మా జమీందారుగారికి హితబోధ చేయు చున్నారము. ప్రథమ భార్య ఇట్లు పరితాప పడుచుండగా, నోరెరు గని తన కూతురును మరల నిచ్చి వివాహము చేయుటకీ క్రొత్త మామగారికి మనసెట్టు వచ్చినదో! లోకములో ఎటువంటి వారును ధనమున కాసపడి తమ కన్న కూతురులనైన బలియిత్తురు కదా!

ఈ 'ఆర్యమత బోధినీ' పత్రికాధిపతులు ముఖ్యముగా నన్నును, సామాన్యముగా సంఘ సంస్కర్తలను సర్వదా దూషించుటకయి అవత రించిన మహాపురుషులు. నేను వ్రాసిన పయి వాక్యములు పోలవరము జమీందారుగారికిని, ఆర్యమత బోధినీ పత్రికాధిపతిగారికిని మనస్థాపమును కలిగించినవి. ఆర్యమత బోధినీ పత్రికా విలేఖకులు మహాకుపితులయి నన్ను దూషించుచు తమ పత్రికలో ప్రకటించిరి. వారు వ్రాసినదాని కెల్ల నేను సమాధానములిచ్చితినిగాని, దీనితో సంబంధించినది మాత్రము కొంత ఉదాహరించుచున్నాను.

"ఈ నడుమనే వితంతు శరణాలయమునకు వేయి రూపాయలనిచ్చిన మహోపకారిని కృతఘ్నుడనయి నేనేమో తిట్టితినట! ఒకరి మేలుకోరి చెప్పిన హిత వాక్యములు తిట్లట! హితబోధచేయుట కృతఘ్నతయట! ఒకరి పోషకత్వములోనుండి, వారు తప్పుదారి త్రొక్కినప్పుడు చెనికి చేదుగా నుండు హితమును చెప్పు ధైర్యములేక ఇచ్చకములాడుట కృతఘ్నత!.. ఈ అపూర్వ విలేఖకుడు తన స్వభావమును నాకారోపించి తన బుద్ధిలక్షణమును వెల్లడి చేసికొనుచున్నాడు. వేయి రూపాయలు కాదు

కదా, మరి పదివేల రూపాయలయినను ఇచ్చకములాడుటకును, దుర్నీతిని పోషించుటకును ఇచ్చిన యెడల నేను తృణప్రాయముగా నిరాకరించెదను. నే నధిక ధనవంతుడను కాకపోయినను, నాకు జమీందారీ లేకపోయినను, నా భోగానుభవములకు తగ్గించి మిగిల్చి, ఈ ధర్మ కార్యమునకయి ఇంతకు పదిరెట్లు నేనిచ్చియుండుట లోక మెరుగును. జమీందారుగారిచ్చిన వేయి రూపాయలైనను వితంతు శరణాలయమున కిచ్చిరిగాని, నా ఉప యోగమునకయి కాదు.''

నేను తోటను కొన్న తరువాత అందు కాపురముండిన గాని తోట బాగుపడదని భావించి, అవరకు పాడు పడియుండిన యింటిని బాగు చేయించి, అక్కడకు కాపురము వెళ్లుదమని నా భార్యతో చెప్పితిని. మహారణ్యమువంటి ఆ తోటలో కాపురముండుట అపాయకరమనియు, దొంగల భయమనియు, శీతాకాలములో చలి ఎక్కువ అనియు నా భార్య నాకు హితము చెప్పెను. మనలను రక్షించు వాడీశ్వరుడుండగా సర్పాదు లకు భయపడవలసిన పని లేదనియు, దొంగల భయము లేకుండ కుక్కల నుంచు కొందమనియు, శీతాకాలములోమరల మన యింటికే వత్తమనియు చెప్పి, ఒడబరచి, తోటలోనికి కాపురమునకు వెళ్లితిని. అక్కడ నిర్మల వాయువువలనను నా దగ్గు కొంత తగ్గినది. నా భార్యకు దేహారోగ్యము హెచ్చినది.

ఇక నుయ్యి త్రవ్వింపవలసిన పని యొకటి యున్నది. నాయొద్ద నప్పుడు నూరు రూపాయలు మాత్రమే యుండెను. వేయి రూపాయలకు గాని నుయ్యి అగునట్లు కనబడలేదు. ఈశ్వరుని మీద భారమువేసి ఆ నూయి త్రవ్వింప నారంభించితిని. మిస్ మ్యానింగుగారు తమ మరణ శాసనములో 50 పౌనులు నాకివ్వవలసినదని వ్రాసినట్లు లండనులోని ఆమె మరణ శాసన నిర్వాహకులు ఇంతలో నాకు వ్రాసిరి. చెన్నపట్టణమునుండి బెన్నీ కంపెనీవారు రు. 659-1-0 లు నాకు పంపిరి. ఆ సొమ్ముతో నూతి పని పూర్తి అయినది. ఈ సాయము కేవలము భగవత్ప్రేరణమువలన వచ్చినదే కాని వేరుకాదు!

మొట్టమొదట మక్డానల్డు దొరగారు నా 'రాజశేఖర చరిత్ర' ను గూర్చి ఆమెతో మాటాడియుండును. తరువాత ఆమె చెన్నపట్టణము వచ్చినప్పుడు మా యింటికి వచ్చి, నా భార్యను కౌగలించుకొని, మా యింటనున్న

శరణాలయములోని వితంతువులను చూచి సంతోషించెను. ఆమె, రామమోహనరాయ లింగ్లండునకు వెళ్లిన కాలములో మిస్ కార్పెంటరు మొదలయిన వారితో కలిసి, వ్యాధి సమయము నందాయనకు ఉపచారములు చేసిన వారిలో నొకతె. మరణమునకు ముందు వైద్యుడు రామమోహనరాయల తల కత్తిరించినప్పుడు ఆ వెంట్రుకలను సంగ్రహించి దాచిపెట్టుకొన్న వాటిని నాకీమె ప్రేమతో బహుమానము చేసెను. ఆ బహుమానమును అమూల్యమైనదానినిగా గ్రహించి, ఇప్పటికిని నాయొద్ద పదిలముగా పెట్టుకొని యున్నవాడను.

1905 లో సాధారణ బ్రహ్మ సమాజ మత ప్రచారకులైన బాబూ హేమచంద్ర సర్కారుగారు రాజమహేంద్రవరమునకు వచ్చిరి. అప్పుడు నే నాయనతో మా తండ్రిగారి శ్రాద్ధ కర్మను బ్రహ్మసామాజిక విధుల ననుసరించి చేయనుద్దేశించుకొన్నట్లును, అప్పటినుండి అనుష్ఠానపరుడను కాదలచుకొన్నట్టును చెప్పితిని. తరువాత రెండు మాసములకు బాపయ్యగారు తాము యజ్ఞోపవీతాదులను విసర్జించి, అనుష్ఠాన బ్రాహ్మ మతావలంబుడయి, పితృ శ్రాద్ధమును బ్రాహ్మ పద్ధతిని జరుపవలెనున్నదని నన్ను ఆలోచన అడిగెను. నేనాయనను ప్రోత్సాహపరచి, భోజనమునకు వచ్చెదననియు, శీఘ్రకాలములోనే అనుష్ఠానపరుడయ్యెదననియు చెప్పి, కలకత్తా నగరమునకు నా మిత్రులయిన పండిత శివనాథ శాస్త్రిగారి పేర వ్రాసి, శ్రాద్ధ కర్మను నేనే నడపి, యితరులతో గలసి భోజనము చేసితిని. ఈ విషయమున కాయన మార్గదర్శకులయినందుకు మిక్కిలి సంతోషించితిని. అత్యల్పకాలములోనే పరలోకమునకు ప్రయాణము కట్టుకొనియున్న నా అనుష్ఠాన పరత్వముకన్న, లేబ్రాయపువాడును, నిరుపమాన పద్య కర్తనుడును, సంస్కార దీక్షాపరుడును అయిన బాపయ్యగారి అనుష్ఠాన పరత్వమువలన పరిశుద్ధాస్తికమత వ్యాపనకును, సంఘ సంస్కారాభివృద్ధికిని విశేష ప్రయోజనము కలుగునని నేను నమ్మియుంటిని.

1906 ఫిబ్రవరి 15 న మా తండ్రిగారి అబ్దికమును నేను బ్రాహ్మణధర్మ పద్ధతిని పెట్టి, నాడు మొదలుకొని వర్ణభేదమును త్యజించి, సార్వజన సాభ్రాత్రమును వహించి, అనుష్ఠాన బ్రాహ్ముడనగుచున్నానని ఘోషించి, ఆహ్వానము చేసిన క్రైస్తవులులోనుగాగల సర్వజాతుల వారితోను గలిసి సహపంక్తి భోజనము చేసితిని. అప్పుడు వితంతు శరణాలయము వేరుగ

లేకపోవుటచేత, మా యింటనే యుండిన ఇద్దరు ముగ్గురు వితంతువులు, నేనెవరితో భోజనముచేసినను సరే జందెము తీసివేయకుండిన యెడల మా యింటనే యుందుమని చెప్పిరి. వారి నిమిత్తమయి 15 దినముల వరకును నేను జన్నిదమునుంచుకొనెదననియు, వారిలోపల ఇష్టమున్నచో మరియొక చోటికి పోవచ్చుననియు, పోకుండెడు వారికి వేరొకచోట స్థానమేర్పాటు చేసెదననియు చెప్పితిని. బ్రాహ్మణ వితంతువులిద్దరును మా యిల్లు విడిచి పోయిరి. ఒక్క శూద్ర వితంతువు మాత్రమట్టేయుండెను. 13 దినము లుంచిన తరువాత యజ్ఞోపవీతమును తీసివేసి అందరితోను చెప్పితిని.

నేను కొన్న తోటకు అంటియున్న మరియొక తోటనుకూడ రు. 600 లకు చల్లపల్లి రామయ్యగారివద్ద కొంటిని. ఈ తోట రథ్యకు సమీపమున నున్నందున వితంతు శరణాలయము మొదలైన వానిని దీనిలోనే కట్టింప నుద్దేశించితిని. ములుకుట్ల అచ్యుతరామయ్యగారు నన్ను చూచుటకు వచ్చిరి. ఆయనకు నేను కొన్న తోటలు చూపి, క్రొత్త తోటలో అనాథ శరణాలయ మును, వితంతు శరణాలయమును కట్టనుద్దేశించినట్లు చెప్పితిని. నేను కోరకయే ఆయన తామా గృహములను కట్టించి ఇచ్చెదమని వాగ్దానము చేసిరి. అచ్యుతరామయ్యగారు రాజమహేంద్రవర కళాశాలలో నా శిష్యులు. నాయందు విశేష గౌరవము కలవారు. చెన్నపట్టణములో నున్న కాలములో నే నొకసారి రాజమహేంద్రవరమునకు వచ్చినప్పుడు నన్ను తమ యింటికి విందుకు పిలిచి, మా యింటినుండి తమ యింటికి వాద్యములతో కొనిపోవు టకు ఏర్పాటుచేయగా, అట్లు చేసెడు పక్షమున నేను రానని చెప్పితిని. ఆయన అంగీకరించి నన్ను గుఱ్ఱపుబండిలో తమ యింటికి కొనిపోయిరి. కతిపయ మిత్రసహితముగా విందుచేసిన తరువాత అభినందన వాక్యము లతో నా కంఠమునందు పుష్పహారమువేసి, తమతో గూడ నా ఛాయా చిత్రము తీయించి, ఇంటిముందు ఆకాశబాణములు మొదలయినవి కాల్పించిరి. నన్ను మరల మా యింటికి కొనిపోవునప్పుడు తమ యింటి సమీపమున నేమియు చేయక, నా బండి అంగళ్ల వీధికి వచ్చునప్పటికి బండి ముందు వాద్యములు నడచునట్లేర్పాటు చేసి, త్రోవపొడుగునను ఆకాశబాణము లను విడిపించి, మహతాబులను, చిచ్చుబుడ్లను కాల్పించిరి.

ఇట్లు చేసిన యీ మిత్రుని వాగ్దానమును కృతజ్ఞతాపూర్వకముగా అంగీక రించి, వందనములు సమర్పించితిని. వారు శీఘ్రకాలములోనే పని

ఆరంభించి, క్రొత్త తోటలో ఇప్పుడున్న వితంతు శరణాలయ భవనమును కట్టించి ఇచ్చిరి. అందు వితంతువుల వాసమునకు పది గదులును, నాలుగు వర్ణములవారికి నాలుగు వంట ఇండ్లును, శరణాలయ కార్యములు చూచువారు కాపురముండుటకు మూడు పెద్ద గదులు గల ఇల్లును ఉన్నవి. ఇవి కట్టించుటకు 5,000 రూపాయలయి యుండునని నేననుకొంటిని. నూతిని కట్టించుటకు, స్నానముల గదిని, మరుగుదొడ్డిని, ఆవరణపు తోటను కట్టించుటకు నేను మరి వేయి రూపాయలాభవనముపై వ్యయ పరచితిని.

నేననుష్ఠాన బ్రాహ్మడనయిన నాలుగు మాసములకు నన్ను తిట్టుట కయి మా పట్టణములో 'హిందూదేశాభివర్ధని' అను పక్ష పత్రిక బయలు వెడలినది. ప్రముఖుల ప్రోత్సాహముండిన గాని పత్రికాధిపతి అట్టి పత్రికను ప్రకటింప జాలియుండడు. అతడేడెనిమిది రూపాయలు సంపాదించుకొను వీధి బడిపంతులు. రాజమహేంద్రవరమునకు క్రొత్తగా వచ్చినవాడు. అతడు నన్నెరుగడు, నేనాతని నెరుగను. ఈ పక్షపత్రిక మొదటి సంచికయందు, అనగా 1906 జూలై 1 న, వితంతు శరణాలయములోని వితంతువులు వ్యభి చారిణులనియు, అందులోనే వ్యభిచారములు జరుగుచుండుననియు లోకులను కొనునట్లు ఉద్దేశించి వ్రాయబడినది.

ఈ దుర్వార్తలను చదివిన మీదట నేను న్యాయవాది చేత పత్రికాధిపతికి క్షమార్పణము చేయవలసినదనియు, చేయని యెడల దండవిధి ననుసరించి అభియోగము తేబడుననియు నివేదన పత్రికకు పంపితిని. అది పట్టుకొని అతడు న్యాపతి సుబ్బారావు పంతులుగారి వద్ద కాలోచనకు పోగా, ఆయన శ్యామారావును పత్రికాధిపతిని చీవాట్లు పెట్టి, క్షమార్పణము చేయవలసిన దని బుద్ధి చెప్పి పంపివేసిరి. అయినను అతనిచేత నాటకమాడించుచున్న మహానుభావులు ఆ హితవచనములను అతడు అనుసరింపకుండ చేసిరి.

నేనాతనిపైని సంయుక్త దండ విధాయకుని యొద్ద అభియోగము తెచ్చితిని. నా ప్రతిపక్షులారంభ దశలో నా ప్రతివాదికి 100 రూపాయ లిచ్చిరనియు, న్యాయవాది నేర్పరచిరనియు వినియుంటిని. వారు తరు వాత తమ పేరెక్కడ బైలుపడునోయని భయముచేత శ్యామారావును చిక్కులో తగిలించి తాము తప్పించుకొని తొలిగిరి. సంయుక్త దండ విధాయకుడు శ్యామారావుగారికి వేయి రూపాయలు కాబోలు ధన దండన

మును, 18 మాసములు కారాగృహ వాసమును విధించిరి. నిర్దోషిని ముందుకు త్రోసి నిజమైన దోషులు తప్పించుకొనిపోయిరి. అతడా తీర్పు మీద మండల న్యాయాధిపతి యొద్ద ఉపర్యభియోగము (appeal) తేగా ధనదండమును 300 రూపాయలకు తగ్గించి, కారాగృహ వాసము అవర కున్నదే చాలునని తీర్పు చెప్పిరి.

1906 డిసెంబరు 15 న, నా పని కామోదించు మిత్రులను సమావేశ పరచి, నేను పూనిన కార్యములను నెరవేర్చుటకయి హితకారిణీ సమాజము అనుపేర ఒక సంఘమును స్థాపించితిని. దానిలో అప్పుడు చేరిన వారు 36 గురు. ఈ సంఘము తరువాత లేఖ్యారూఢము (రిజిస్టరు) చేయబడినది. ఈ సంఘము యొక్క ముఖ్యోద్దేశము వితంతు శరణాలయములు, అగతిక శిశు సంరక్షణ శాలలు, పాఠశాలలు, శిల్పశాలలు మొదలగునవి స్థాపించి, వానిని జరుపుట. సభ్యులలో 9 మంది కార్యనిర్వాహక సంఘముగా ఏర్పరుపబడిరి. 1907 నందు సమాజ నిబంధనలు ప్రకటింపబడగానే నాస్తికులు కార్యనిర్వాహక సంఘములో నుండగూడదన్న నిబంధన యున్నందున టంగుటూరి శ్రీరాములుగారును, మరియొకరును సభ్యత్వము మానుకొనిరి. ఈ సమాజ కార్యము లవిచ్ఛిన్నముగా జరుగుటకయి, అల్పమయినను, నాకున్న సొత్తంతయు (worth about 43,500 rupees) సమాజమునకిచ్చితిని. ఈ సొత్తునకు నిక్షేప పత్రము (Deed of Trust) వ్రాసి, 1908 మే 2 న లేఖ్యారూఢము చేయించితిని. ఈ సొత్తు నా జీవితకాలములో సమాజ పక్షమున నా అధీనములో నుండవలెనని మాత్రము నిక్షేప పత్రములో వ్రాసితిని. నా జీవితకాలములో పుస్తక విక్రయము వలన వచ్చెడిది తప్ప సొంతమునకయి నేనేమియు నుంచుకో లేదు. చెన్నపట్టణములో నున్న ఇండ్లను సహితము అమ్మివేసి రొక్కముగా 3,500 ఇచ్చితిని.

ఇట్లుండగా ఆకస్మికముగా బంగాళా రాజ్యాంగ సముద్రమునుండి దేశీయ స్వపరిపాలన తరంగ మొకటి వచ్చి యీ దేశము మీద పడి, సమస్త ఇతర వ్యవసాయములను ముంచివేసినది. వంగదేశపు వక్తలలో ఒకరయిన విపిన చంద్రపాలుగారు రాజమహేంద్రవరమునకు వచ్చి, దేశీయ స్వపరిపాలన విషయమున కొన్ని ఉపన్యాసములు చేసి, యువజనుల, విద్యార్థుల మనస్సులలో ఒకవిధమైన ఉద్రేకమును, దేశాభిమానమును

కలిగించివోయెను. యువజనులు తాత్కాలిక వీరావేశము చేత తలలు విరియబోసుకొని, 'వందేమాతరం' అని కేకలు వేయుచు విచ్చలవిడిగా తిరుగజొచ్చిరి. పాఠశాలలలోని బాలురు సహితము ఈ అల్లకల్లోలములో పడి, పాఠములనుపేక్షించి, ఉపాధ్యాయులను తిరస్కరించి అనేకులు పాఠశాలల నుండి తరిమివేయబడిరి.

రాజ్యాంగ విషయములలో నాకును, మా తోటలో నున్న వారికిని తరచుగా వివాదములు జరుగుచు వచ్చెను. నాతో వారేకీభవించుట సాధారణముగా సంభవింపలేదు. కారుమూరి కామరాజుగారు, నే నింగ్లీషు వారి ప్రభుత్వము వలన హిందూదేశమునకు లాభములనేకములు కలుగు చున్నవని వాదించిన తప్పిదమునకయి నాతో మాటాడుటయే మాని వేసెను. మా సామాజికులలో మా తోటలలో నున్న వారి అభిప్రాయమే ఇట్లుండగా, తక్కిన యువజనుల అభిప్రాయము గూర్చి చెప్పవలసిన పనియే లేదు. వారు నన్ను దేశాభిమాన రహితునిగాను, తమతోడి సాంగత్య మునకు అనర్హుడనుగాను భావించి, సంఘ బహిష్కృతునితోవలె నాతో కలసిమెలసి యుండుట విసర్జించుచు వచ్చిరి.

రాజ్యాంగ విషయములలో నాకాదరము లేనట్టు భావింపవలదు. నేను 14 ఏండ్లు 'వివేకవర్ధని' కి విలేఖకుడనుగా నుండి, దానిలో రాజ్యాంగ విషయిక వ్యాసములు వ్రాసితిని. హైందవ దేశీయ మహాసభ 1887 లో మొదటితడవ చెన్నపురిలో జరిగినప్పుడు నేనొక ప్రతినిధిగా పంపబడితిని. మత, నీతి, కులాచార సంస్కారములు లేక ఒక్క రాజ్యాంగ సంస్కారము వలననే దేశమభివృద్ధి పొందునని నేనెన్నడును తలచిన వాడను కాను. దేశాభివృద్ధి కన్నిటిలోను సమానముగ పని జరగవలెనని నా అభి ప్రాయము. ఇంగ్లీషు వారి పరిపాలన నిరంతరముగా సాగుటచేతనే దేశ మభివృద్ధిగాంచునని నాకు దృఢమైన నమ్మకము. దీనియందేవిధమైన లోపములును లేవని నేను చెప్పదలచిన వాడను కాను. ఇంగ్లీషు ప్రభుత్వము నందు లోపములనేకములున్నవి.

పాలుగారి ఉపన్యాసము వలన కలిగిన దేశాభిమానము, ఇంగ్లీషు ప్రభుత్వ పక్షమున మంచి మాట చెప్పిన వారిని దూషించు వరకును వచ్చినది. ఇంగ్లీషు వారిని దూషించినవాడు విద్య లేనివాడయినను, సద్వర్తనము లేనివాడయినను దేశాభిమాన మాననీయుడుగా కనబడు

చుండెను. ప్రార్థన సమాజ ప్రముఖులలో నొకరైన నాళము కృష్ణారావు గారు, రాజద్రోహియు, నరహంతకుడునైన ఖుదీరాంబోసు యొక్క ఛాయా పటమును తెచ్చి, పురమందిరములో నా పేరిటనున్న పఠనమందిరములో వ్రేలాడదీయుటయేకాక, ఎవరు చెప్పినను తీసివేయక పోయెను. ఇది ఆధారముచేసికొని నా ప్రతిపక్షులు, రాజద్రోహుల సమూహమునకు నేను నాయకుడనని కరగ్రాహి మొదలయిన యూరపియనులతో చెప్పజొచ్చిరి. ఈ పటము నేల పఠన మందిరములో తగిలింపబడినదో తెలుపవలసినదని మండల కరగ్రాహి నా పేర వ్రాసెను. నాళము కృష్ణారావు యొక్క అవివేకము వలన పటమందు తగిలింపబడి తరువాత తీసివేయ బడినదనియు, నా పేరు పెట్టుటయే కాని ఆ పఠన మందిరమునకును, నాకును సంబంధ మేమియు లేదనియు నేనాయనకు ఉత్తరము వ్రాసితిని. ఇట్లు వ్రాసినందుకు నాళము కృష్ణారావుగారికి నామీద ఎంతో ఆగ్రహము వచ్చెను.

ప్రార్థన సామాజికులలో కొందరప్పుడు తామవలంబించిన మతసిద్ధాంత ములనే మరచిపోయిరి. ఆ సిద్ధాంతములలో నొకటి సర్వజన సహోదర భావము. ఈ సిద్ధాంతమును బట్టి ఇంగ్లీషు వారు మన సహోదరతుల్యు లయియుండగా, న్యాయముగానైనను, అన్యాయముగానైనను వారిని పరిహ సించినవాడును, హింసించినవాడును దేశాభిమాని అయిన మహాత్ముడని సామాజికులు భావించుట ఎంతయు శోచనీయము.

1908 ఏప్రిల్ 18 న నేనాంధ్ర పరిశుద్ధాస్తిక సభలో ఇట్లు చెప్పితిని: "నిజమైన దేశాభిమానమునకు మారుగా అనేకులలో ఒక విధమైన దురభిమానము వ్యాపించుచున్నది. మన దేశమందలి దురాచారములు సహితము సదాచారములుగా పొగడబడుచుండుటయు ఇతర దేశముల వారి సదాచారములు కూడ దురాచారములుగా తెగడబడుచుండుటయు సంభవించి, నిజమైన దేశాభివృద్ధికి భంగము కలుగుచున్నది... దురభి మానపూరితులైన వాక్శూరులు స్వార్థత్యాగము కావలసివచ్చినప్పుడు భీరువు లయి అదృశ్యులగుదురు... పరిశుద్ధాస్తిక మతావర్గలంబులమని చెప్పు కొనెడు మనమెప్పుడును దేశాభిమానము పేరు చెప్పికొని, మరి ఏ సత్క్రియ పేరు చెప్పిగాని అన్యులను ద్వేషింపగూడదు."

పయి మాటలు చెప్పినందుకు అనుష్ఠానిక బ్రాహ్మలలో ఒకరు. ఆ సభలో నాకు "పిరికిపంద" అని నూతన బిరుదాంకము ననుగ్రహించిరి.

సంస్కారాభిమానులు బృందావన పురములో విందు చేయుటకు ప్రయత్నించిరిగాని, భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి ఇంటిలోపల జరిగిన విందులో ఆతిథ్యకర్తయు, ముట్నూరి కృష్ణారావుగారును, రామాచారిగారును, పావకేశ్వరరావును, మరియొకరును పంచపాండవులవలె అయిదుగురు మాత్రమే నాతో గలిసి సోదర ప్రీతి భోజనమును గావించిరి.

వితంతు వివాహములు చేసికొన్న వారిలో రాజమహేంద్రవరములో నున్న కొందరు నేను అనుష్ఠానిక బ్రాహ్మడనగుట వలన లాభమును పొంది, తాము కీర్తి ప్రతిష్ఠలను సంపాదింపవలెనన్న ఉద్దేశముతో ఒక మాయోపాయ మాలోచించి, నాకు స్వస్త్యామంత్రణము నిచ్చు మిషమీదను వితంతు వివాహములు చేసికొన్నవారిని వివిధ స్థలములనుండి రాజమహేంద్రవరమునకు రావించి, 1907 డిసెంబరు 27 న నాటకశాలలో ఒక సభచేసిరి. అందరును సమావేశమైన తరువాత తిరుమెల్ల వెంకట సుబ్బారావుగారును, పుల్లాభట్ల గవరయ్య శాస్త్రిగారును నాయకులుగా నుండి, అందరితోను మాటాడి, వేరొక క్రొత్త సమాజమును స్థాపించుటకు ఒడబరచిరి.

ఆ రాత్రియే, బందరు నుండి వచ్చి మా యింట దిగిన వారు భోజనమునకు వెళ్లినప్పుడు, మా యింట దిగుటచే రాకూడదని పంపివేసిరి. నాకు గౌరవము చేయుటకని వేషమువేసి పిలిపించి మా యింట దిగినవారిని, తమ తోడి పంక్తి భోజనమున కర్హులుగారని పంపివేసిన అగౌరవమున కయి నాకెంతో కోపము వచ్చినది. వారు మరునాడు నన్ను తమ నడుమ కూరుచుండబెట్టుకుని ఛాయాపటమును తీయించుకొనెదము రమ్మని ఆహ్వానము చేయగా, నా మనస్సు నాకు స్వాధీనముకాక, ఇటువంటివారితో కలిసి ఛాయాపటము తీయించుకొనుట అవమానముగా భావించుచున్నాననియు, ఇటువంటి వారి సహపంక్తిని భోజనము చేయుట కంటె చండాలు రసహపంక్తిని భుజించుట ఎక్కువ గౌరవదాయకముగా పరిగణించుచున్నాననియు అందరి మొగముల మీదను చెప్పితిని.

వితంతు వివాహ సమాజము నేర్పరచినందుకు నాకు కోపములేదు. ఆ పని కెన్ని సమాజము లేర్పడి, వివాహము లెంత యెక్కువ జరిగిన నా కంత సంతోషము. ఆవరకు తిరుమెల్ల వెంకట సుబ్బారావుగారును, మరి యొకరును వచ్చి నన్నడుగగా, హితకారిణి సమాజములో చేరవలసి

నదనియు, వితంతు వివాహములు చేసికొన్న వారినొక ఉప సంఘముగా ఏర్పరచి, వారి చేతనే వివాహములు చేయించెదననియు చెప్పియుంటిని. నే నిచ్చిన సొమ్మంతయు తమచేత బెట్టిన ఒక ఆట ఆడవలెననియే కానీ వారు హితకారిణీ సమాజమువారి ఆదరణక్రింద వివాహ కార్యముల నభివృద్ధి చేయదలచుకోలేదు. అందుచేత హితకారిణీ సమాజములో చేరలేదు. స్వతంత్రముగా సమాజము నేర్పరచి, చందాలు పోగుచేసి, కాగితము లచ్చువేసి, రెండు సంవత్సరములు కొంత సందడిచేసిరి. ఇప్పుడా సమాజమేమైనదో, చందా లేమైనవో తెలియదు. వారీవరకొక్క వివాహమైనను చేసియుండలేదు. మా వితంతు శరణాలయములోనే వితంతువులు చేరుచున్నారు. ఏటేట నాలుగును, అయిదును, ఆరును వివాహములు జరుగుచునే యున్నవి.

పాఠశాలలో నలుగురు ఉపాధ్యాయినులను, ఒక ఉపాధ్యాయుని బెట్టి విశేష ధన వ్యయమును చేయుచుంటిని. అట్లయ్యును పాఠశాల వలన కలుగవలసినంత ప్రయోజనము కలుగకుండెను. పాఠశాలను స్థాపించిన యుద్దేశము నెరవేరినది కాదు. ఎంతో కష్టము మీద నిద్దరు పిల్లలు రెండవ ఫారమునకు వచ్చిరి. ఒకామె కన్యక, రెండవ యామె బాలవితంతువు. మొదటి యామెకు వివాహమయి, మామగారు బడి మాని పించిరి. రెండవ యామె, బంధువులు నిందించుచున్నారన్న హేతువు చేత మాన్పబడినది. వీరిని మాధ్యమిక పరీక్షకయినను పంపవలెనని ఆశ పెట్టుకొని యున్న నాకు ఆశాభంగము కలిగెను. ఈ పాఠశాలను క్రమముగా స్త్రీల ఉన్నత పాఠశాలను చేయవలెనన్న నా సంకల్పమునకు ప్రథమముననే వికల్పము సంభవించెను. ఈ పాఠశాలకు పెట్టెడు సొమ్మంతయు వ్యర్థమయ్యెననియు, యుక్త వయసు వచ్చిన బాలికలను తల్లిదండ్రులు చదివింపరానియు, ప్రాథమిక విద్య నేర్పుటకు పట్టణములో దొరతనము వారి బాలికా పాఠశాలలును, క్రైస్తవ సంఘ బాలిక పాఠశాలలు నుండగా దీని అవశ్యము లేదనియు, ఎప్పుడైనను స్త్రీల ఉన్నత పాఠశాల ఏర్పడవలెనన్న శరణాలయములోని వితంతువుల వలనను, అగతిక రక్షణశాల (orphanage) లోని బాలికల వలనను తప్ప వేరు విధముగా ఏర్పడదనియు తలచి, ఒక అగతిక రక్షణశాలను కూడ స్థాపించ నెంచితిని. సాధారణముగా సద్వర్తనము గల ఉపాధ్యాయినులు దొరకుట కష్టము.

మా పాఠశాలలోని ఉపాధ్యాయినులు కొందరు తగవులాడి, ఒకరి రంకు లొకరు బయల పెట్టుచు కాగితములు వ్రాసి పాఠశాలలోను, వీధిగోడల కును, దీపస్తంభములకును నంటింపసాగిరి. అందుచేత మా పాఠశాలను 1908 లో వేసవి సెలవుల తరువాత మా తోటలోని రామచంద్రరావుగారి ఇంటిలో పెట్టితిని. తగవులాడిన ఉపాధ్యాయినులను తీసివేసితిని. వితంతు శరణాలయములోని వితంతువు లీ యింటిలోనే యుండిరి. వారికి విద్య చెప్పుట కయి వయస్సు చెల్లిన ఉపాధ్యాయులను పెట్టితిని. అగతిక శిశు సంరక్షణ శాలను పిఠాపురపు రాజుగారు పెట్టబూనినందున నే నా ప్రయత్నము మానివేసితిని.

నేను చెన్నపట్టణము నుండి తిరిగి వచ్చిన తరువాత నా హృదయ క్షేత్రమున ఆస్తిక పాఠశాలా స్థాపన బీజము మరల అంకురించెను. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు పట్టణములో ఒక మాధ్యమిక పాఠ శాలను కొన్ని సంవత్సరములనుండి నడుపుచుండిరి. నేనా పాఠశాలను హితకారిణీ సమాజమున కిమ్మని కోరగా వారు సంతోషముతో అంగీక రించి, బల్లలు, పటములు మొదలయిన సమస్త సామగ్రితోను 1907 సెప్టెం బరులో దానిని మా అధీనము చేసిరి. ఇకదాని నున్నత పాఠశాలగా మార్చవలెను. ఈవిషయమై పాఠశాలా పరీక్షకులైన యేట్సుదొరగారితోను, రాజకీయ కళాశాలాధ్యక్షులైన హంటరు దొరగారితోను మాటాడి ఒప్పించి తిని. పాఠశాల మందిరమును కట్టించుటకయి 2000 రూపాయల కొక యింటిని కోట సమీపమున కొనుటయే కాక, దాని చుట్టుపట్ల నిండ్లను కొనుటకు కూడ బేరమాడుచుంటిని.

మా పట్టణములో ఉన్నత పాఠశాలలు రెండుండెను. ఒకటి క్రైస్తవ మతాచార్యులది, రెండవది దొరతనము వారిది. బోధనాభ్యసన (Teachers' Training) పాఠశాలోపాధ్యక్షులగు మల్లాది వేంకటరత్నముగారు, మా పాఠశాల తమ పాఠశాలకు ప్రతిస్పర్ధిగా నుండునని భయపడి, మా దానిని విద్యావిచారణాధికారి అంగీకరింపకుండ చేయవలెనని హంటరు దొరగారితో చెప్పిరి. రాజకీయ బోధనాభ్యసన పాఠశాలకు హంటరు దొరగారు అధ్యక్షులు. అందుచేత, మా పాఠశాలను ఉన్నత పాఠశాలగా అంగీక రించుటకు మేము విద్యా విచారణాధికారులకు ప్రార్థన పత్రమును పంపి

నప్పుడు, హంటరు దొరగారు వ్యతిరేకముగా వ్రాయుటచే వారంగీకరింపక, పాఠశాల స్థిరత్వమును గూర్చి ఏవేవో వ్రాసిరి.

అందుపైని నేను చెన్నపట్టణమునకు పోయి, పాఠశాలా స్థాపన నిమిత్తమయి నా యుద్దేశమును వారికి విన్నవించితిని. తాము చూపిన న్యూనతలను సరిపరచుకొన్న పక్షమున పయి సంవత్సర మంగీకరించెద మని చెప్పిరి. నేనా పాఠశాలను ధనము సంపాదింపవలెనన్న యుద్దేశముతోను, నా మనుష్యులకు అందు ఉద్యోగమియ్యవలెనన్న ఆలోచనతోను స్థాపించితిననియు, విద్యాశాఖ వారు ఆ పాఠశాలను అంగీకరించిన విద్యార్థులు చెడిపోవుదురనియు హంటరు దొరగారితో ఎవ్వరెవ్వరో ఏవేవో చెప్పిరి. నే నాయనను కలిసికొని మాటలాడి, ఆయనకు కలిగిన దురుద్దేశములను కొంతవరకు తొలగించి, పాఠశాలా కార్యనిర్వహణమునకయి ఉప సంఘము నేర్పరచెదననియు, దానియందు ఆయనను కూడ ఉంచెదననియు చెప్పితిని. దొరగారు కొంతవరకు నా పక్షమునకు తిరిగి, ఉప సంఘములో నుండుట కంగీకరించెను. శాస్త్రి పాఠశాలాధ్యక్షుడును, పాఠశాలా సహాయ పరీక్షకుడును, ప్రధానోపాధ్యాయుడును, నేనును, మరి యిద్దరు హితకారిణీ సామాజికులును, కాకినాడ కాలేజీ అధ్యక్షులయిన వేంకటరత్నము నాయుడుగారును గల ఉపసంఘము నేర్పాటు చేసి, వేంకటరత్నము నాయుడుగారు చేసిన విధులాయనకు చూపి, ఆయన అంగీకారము బడసితిమి. విద్యావిచారణాధికారి, మరుసటి సంవత్సరము నాల్గవ ఫారమును, తరువాతి సంవత్సర మయిదారు ఫారములను అంగీకరించి, మా పాఠశాలను సంపూర్ణ ఉన్నత పాఠశాలను చేసెను.

పాఠశాలా భవనమును గూర్చి కొంత వ్రాయవలసి యున్నది. ఈశ్వర ప్రేరణము వలన పిఠాపుర సంస్థానాధిపతులైన శ్రీ రాజా కుమార మహీపతి సూర్యారావు బహద్దరుగారు పాఠశాలా భవన నిర్మాణార్థమయి మొదటి అరువది వేల రూపాయల నిచ్చెదమని దయా పూర్వకముగా వాగ్దానము చేసిరి. వీరి సాహాయ్యముచేత నేను కొన్న స్థలములో పాఠశాలా భవనము కట్టుటకుద్యమించితిని. కట్టదలచిన భవనము యొక్క చిత్ర పటమును (plan) వ్రాయించి, పాఠశాలా పరీక్షకులైన యేట్సు దొరగారు ఆమోదించిన మీదట విద్యావిచారణాధికారికి పంపితిని. వారు దాని నంగీకరించినట్టే కనబడినది. అయినను క్రొత్త విఘ్నములు రా దొడగెను.

ఆ కాలమునందు "వందేమాతరము" కోలాహలము దేశమంతటను వ్యాపించెను. ఏమియు ఎరుగని బడి పిల్లలకును, మూఢులకును, యూరపియనులు వీథిన పోవునప్పుడు వందేమాతరమని కేకలు వేయుట ఒక యాటయ్యెను. గిట్టనివారు కొందరు మా పట్టణములోని ఉపకరగ్రాహియైన బ్రెయిడు వుడ్డు దొరగారితో, పాఠశాలా భవనమును ఆ స్థలములో కట్టి నిచ్చిన విద్యార్థులు గుమికూడి, యూరపియనులను గేలిచేయుదురని చెప్పి ఆయనకు నమ్మకము పుట్టించిరి. యూరపియనుల నివాసమునకు సమీప మునసున్న ఆ స్థలములో పాఠశాలా భవనము కట్టగూడదని వారు నాతో చెప్పిరి. ఆ దొరవారి నావరకు మా పాఠశాల ఉపసంఘములో ఉండవలసి నదని కోరియుంటిని. పాఠశాలనక్కడ కట్టకపోయిన పక్షమున తాముండె దమని వారు చెప్పిరి. మీరుండక పోయినాసరే, పాఠశాలనక్కడ కట్టక మాననంటిని. దొరగారు కడపటి ప్రయత్నముగా, పాఠశాలనక్కడ కట్టిన యెడల అంగీకారమియ్యవలదని వ్రాసి మండల కరగ్రాహిద్వారా విద్యా విచారణాధికారిగారికి పంపిరి. ఈ దొరగారు వ్రాసిన హేతువు చేత కాక, బాలుర ఆటలకు చాలినంత స్థలము లేదన్న హేతువుచేత ఆ స్థల మున పాఠశాల కట్టుట కంగీకరింపక విద్యావిచారణాధికారులు వేరు చోట విశాలమైన ఆటస్థలమున కట్టవలసినదని వ్రాసిరి.

ఇప్పుడు పాఠశాల నిమిత్తము క్రొత్త స్థలము వెదుకవలసి వచ్చెను. ఇన్నీసుపేటతో చేరియున్న ఆరెకరముల హుకుముపేట పొలమొకటి అమ్మక మునకు వచ్చెను. 1200 రూపాయలకు నేనా పొలమును కొంటిని. పొలము మధ్యనుండి ఇనుపదారి (Railway line) పోయినందున, దానికీవలనున్న ఎకరముపై చిల్లర మాత్రమే పాఠశాలా నిర్మాణకరమైనదిగా నుండెను. ఇనుపదారి కావలనున్న నాలుగైదెకరముల భూమి దారిలేకపోవుట చేత వ్యాయామ భూమిగా (playground) పనికిరాక వ్యర్థమయ్యెను. తరువాత, మొదటి పొలమునంటియున్న యెకరమున్నర భూమిని 950 రూపాయ లకు కొని మొదటిదానితో చేర్చితిని.

పాఠశాలా మందిరము కట్టించు పని నేనొక్కడనే పూని, ఇటుకలు, సున్నము, రాళ్లు, కర్రలు మొదలయినవి సాధ్యమైనంత చౌకగా కొని పనిచేయించితిని. మొట్టమొదట 20,000 రూపాయలతో గృహమును నిర్మింపవలె ననుకొంటిమి గాని, 40,000 లతో గాని సుందర విశాల

భవనము నిర్మాణము కానట్టు కనబడెను. మా కోరికలు సఫలము చేయుటకయి కల్పతరువువలె పిఠాపురపు రాజుగారు 40 వేల రూపాయలు నియ్య ననుగ్రహింపగా, 40 వేల రూపాయల ఇల్లు 60 వేల రూపాయల ఇల్లయ్యెను. ఈశ్వరానుగ్రహము వలనను, రాజుగారి దయవలనను మా యీ పాఠశాలా భవనము పట్టణమున కలంకారభూతమయినదని చెప్ప వచ్చును. ఈ భవనమును చూడవచ్చిన ఒక Executive Engineer, "దీని నిర్మాణమునకు 1,25,000 రూపాయలైనవా ?" అని అడిగెను.

ఈ పాఠశాలా భవనము రెండవ అంతస్థుమీద వేయేసి మంది పట్టు దగిన రెండు సభాసదనములున్నవి. విరామకాలములో వచ్చి కూర్చుండుట కయి ఒక విశాలమైన గది విద్యార్థినుల ఉపయోగార్థమై కట్టబడియున్నది. ఈ పాఠశాలలో రెండు విశేషములున్నవి. అందొకటి, పురుషులతో బాటుగ స్త్రీలను కూడ చేర్చుకొని ప్రవేశ పరీక్ష (School final) వరకును చదివించుట. బాలుర పాఠశాలలో బాలికలను చేర్చుకొనుట అనర్థదాయక మని కొందరు సందేహపడిరి. సందేహమునకు కొంత అవకాశమున్నను, స్త్రీలను గౌరవించెడు సద్గుణమును పురుషులకు చిన్నతనములోనే నేర్ప వలెనని స్త్రీలను కలిపి చదివించెడు పద్ధతికి దారి ఏర్పరచితిని. సాధారణ ముగా బాలికలు బాలురతో కలిసి మూడవఫారము వరకును చదువ వచ్చును. మా పాఠశాలలో స్త్రీలకందరికిని ధర్మార్థముగానే చదువు చెప్పు దుము. ఇట్లు మేము చూపిన మార్గమును అనుసరించి కాకినాడ కాలేజీ వారును స్త్రీలను తమ పాఠశాలలో చేర్చుకొనుట కారంభించియున్నారు.

మా పాఠశాలలో రెండవ విశేషము పంచమ బాలురను కూడ చేర్చు కొని చదువు చెప్పుట. కొన్ని సంవత్సరములనుండి అయిదారుగురు పంచమ బాలురు మా పాఠశాలలోని ఉన్నతవర్గములలో చదువుచున్నారు. తక్కిన బాలురును వారియెడల సౌభ్రాత్రమును చూపుచున్నారు. బాలిక లకు వలెనే, మొదటిఫారము మొదలు పయి తరగతులలో చదువు పంచమ బాలురకును జీతము కైకొనక ధర్మార్థముగా చదువు చెప్పుదుము. క్రైస్తవ పాఠశాలలో కూడ క్రైస్తవులు కాని మాల బాలురను చేర్చుకోరని కొంత కాలము క్రిందట విన్నప్పుడు నా కత్యాశ్చర్యము కలిగినది.

1911 నవంబరు 27 న పాఠశాలా గృహప్రవేశోత్సవము మహా వైభవ ముతో జరిగినది. కలకత్తా నగరమునుండి సిటీ కాలేజి అధ్యక్షులయిన

హేరంబచంద్ర మైత్రగారు వచ్చి గృహప్రవేశోత్సవము నడిపి ఉపన్యాసము చేసిరి. నాటి సాయంకాలము పట్టణములోని ప్రముఖులందరు వచ్చి ఆనందించిరి. నాకు తెలియకయే పిఠాపురపు రాజుగారావరకే విద్యావిచారణాధికారికి వ్రాసి, ఆయన వద్దనుండి హితకారిణీ పాఠశాల అన్న పేరు నా పేరునకు మార్చినట్లు వచ్చిన తంత్రీవార్తను, రాజావారి ఉత్తరమును ఆ సమయమునందు చదివిరి. మించినదానికి చేయునదిలేక ఊరకుండ వలసినవాడనైతిని. మార్చిన పేరు కాసు ఖర్చుచేయని నాదిగాక, సమస్త వ్యయములను భరించిన (రాజా) వారిదయి యుండిన నాకెంతో సంతోషముగా నుండియుండును. ఇప్పుడా పాఠశాలయందు 500 విద్యార్థులు చదువుచున్నారు. అది ఆస్తికోన్నత పాఠశాల అని పిలువబడుచున్నది. ఆస్తిక ప్రార్థనముతో పాఠశాల పని నారంభించుట తప్ప పాఠశాలలో నిప్పుడాస్తిక ప్రబోధమేమియు జరుగుచుండలేదు.

వితంతు శరణాలయములో చేరిన వారు సాధారణముగా వివాహాపేక్షతోనే వచ్చువారగుట చేత వారికి చదువు నందంత శ్రద్ధ యుండదు. వారిలో ఎవ్వరికైన విద్య చెప్పించి, వితంతు శరణాలయ కార్యముల యందాసక్తి గలవారినిగాను, సమర్థురాండ్రను గాను దిద్దవలెనని నేనెంతో ప్రయత్నించితిని. ఇట్లుండగా నా బాల్య సఖుడైన కనపర్తి యోగానందముగారి కొమారిత, సుందరమ్మ అను 16 ఏండ్ల ప్రాయము గల బాల వితంతువు 1907 న వితంతు శరణాలయమున చేరెను. ఆమె మాయింటనే ఉండ గోరినందున అట్లే ఉంచుకొని, నేనును నా భార్యయు పుత్రికా ప్రేమతో చూచుచుంటిమి. ఆమె విద్య యందాసక్తి కలదయి, వివాహమునైనను మానివేసి వితంతు శరణాలయమును చూచుట మొదలయిన పరోపకార కార్యములందే కాలము గడపెదనని బాల్యోత్సాహము చేత పలుకుచుండెను. స్వయముగా నేనే ఆమె కింగ్లీషు నేర్పుచూ, సంవత్సర కాలములో ఇంగ్లీషు నందు రెండవ ఫారమునకు తగియుండునట్లు చేసితిని.

శరణాలయములోనున్న వితంతువులకు ఒక్కొక్కరికి భోజనముల నిమిత్తమయి నెలకయిదేసి రూపాయల చొప్పున నిచ్చుచు, బట్టలు, పుస్తకములు మొదలయినవి వేరుగా నిచ్చుచు, వైద్య వ్యయములను మేమే భరించుచుంటిమి. వితంతు శరణాలయ నిర్వహణమునందు అనేక కష్టము

లున్నవి. వచ్చిన వితంతువులు నానా ప్రదేశముల వారయి, నానా గుణములు కలవారయి యుందురు. వారి పూర్వ వర్తన విషయములో ఏమియు తెలియదు. సాధారణముగా విద్యాగంధమెరుగని వారగుటచేత ఒండొరులతో తగవులాడుచుందురు. వచ్చిన మరునాడు మొదలుకొని పెండ్లి, పెండ్లియని తొందరపెట్టుదురు. తగవులలో తమ పక్షము మాటాడలేదని భోజనము చేయక అలిగి కూరుచుందురు.

హనుమాయమ్మ అను వితంతువు శరణాలయములో చేరెను. ఆమె కన్నులు జబ్బుగా నుండెను. మేమా సంవత్సరము 1908 బెంగుళూరి ప్రయాణము మానుకొని, ఆమెను వెంటబెట్టుకొని చెన్నపట్టణము పోయి, కంటివైద్యము చేయించుచు నుంటిమి. వైద్యుడామెను గాలిలోను, ఎండలోను బయట తిప్పవద్దని విధించెను. ఒకనాడామెను ఇంట దిగవిడిచి బయటకు బండిలో పోయితిమి. ఆ దినమున ఆమె ఏడ్చిన ఏడుపును, చేసిన అల్లరియు చెప్ప శక్యము కాదు. ఏడుపుచేత ఆమె కన్నులు వాచి మరల మొదటికి వచ్చెను. మేమేల ఆమెను తీసికొని వచ్చితిమా అని మాకెంతో విచారము కలిగెను. ఆమె కన్నులు బాగుచేయించి తిరిగివచ్చిన తరువాత, ఈమెయు మరి యిద్దరును కలిసి, ఒక దినమున వంటమాని, రొట్టె చేయుటకు ప్రయత్నింపగా, శరణాలయము పని చూచుచుండిన సుందరమ్మ అన్నమే వండుకొండని విధింపగా, వండుకోక తగువుపెట్టిరి. ఈ ముగ్గురే ఒకనాడు తమకు తక్షణము పెండ్లిచేయని యెడల లేచి పోయెదమని బెదరించిరి. నేను వీరిని వదల్చుకొనుటయే క్షేమకరమని తలచి, ఆమెకొక సంబంధమును గూర్చి కరగపురమునుండి (ఖర్గ్‌పూరు) దండపాణిగారు వ్రాసి యుండినందున, హనుమాయమ్మను పొగబండిలో పంపివేసితిని. తక్కిన వారిద్దరిని మరియిద్దరికిచ్చి వివాహముఁచేసి వదల్చుకొని పంపివేసితిని. వారు తొందరపడకుండిన పక్షమున వారికింత కంటె మంచి వరులు లభించియుందురు.

వివాహము చేసుకొన్న వారిలో ఒకరు వితంతు శరణాలయములోనికొక వితంతువును పంపిరి. ఆ వితంతువు గర్భిణి అయి యుండినట్లు అల్పకాలములోనే తెలియవచ్చినది. మేము చెన్నపట్టణము వెళ్లక మునుపు ఇట్టి వితంతువే మా యింటికి వచ్చెను. కడుపుతో నున్నట్టు తెలియరాగా మే మా వితంతువును మా యింటి నుండి పంపివేసితిమి. ఆమె తమ

యూరికి పోవక, గర్భపాతమునకయి మందు పుచ్చుకొని చచ్చిపోయెను. ఆ దుర్మరణ వార్త విని మాకెంతో దుఃఖము కలిగెను. అట్లే ఈ వితంతువును గూడ వెడలగొట్టిన నీమె గతి ఏమగునో అని మాకు తోచినది. ఇటువంటి వితంతువును శరణాలయములో నుంచుట నీతి కాదు. వెడలగొట్టుటకును మాకు మనసు గొలుపలేదు.

ఇట్టివారి నిమిత్తమయి పతిత యువతీ రక్షణ శాల (Rescue Home) ఒకటి స్థాపింప నిశ్చయించి, ఆమెను వేరొక చోట ఒక గదిలో నుంచి కాపాడితిమి. ఆమెకు నా భార్యయే పురుడు పోసెను. మగ శిశువు కలిగి చచ్చిపోయెను. అవరకు గుంటూరులో వితంతు వివాహము చేసికొని విధురుడైయున్న పురోహితున కామెనిచ్చి వివాహము చేసి పంపితిని.

తరువాత ఈ పతిత యువతీ రక్షణశాలకు ఒక కోమటి వితంతువు వచ్చెను. ఈమె కాకినాడలో తన పుట్టింటినుండి కొన్ని నగలెత్తుకొని ఒక శూద్రుని వెంట లేచిపోయినది. బంధువులు దండ విధాయకుని యొద్ద అభియోగము తేగా, ఆయన ఇద్దరిని దోషులుగా నిర్ణయించి, వానికి 6 నెలలును, ఈమెకు 4 నెలలును కారాగృహవాస దండనము విధించెను. ఆమె చెరసాలనుండి విడుదల అయివచ్చిన తరువాత ఆమె పినతండ్రి మొదలయిన వారు ఆమెను మా యింటికి తెచ్చి, నా భార్య కాళ్లమీద పడవేసిరి. ఇకముందు మంచి నడతగలిగి యుండెదనని చెప్పిన మీదట యీ వితంతువును పతిత యువతీ రక్షణ శాలలో చేర్చుకొంటిమి. ఈమె పేరు కనకరత్నము. కొన్ని మాసములు జరిగిన తరువాత కాకినాడ నుండి సలాది కృష్ణమూర్తి వచ్చి కనకరత్నమును వివాహము చేసికొనెదనని చెప్పెను. వివాహము చేసి వారినిద్దరిని పతిత యువతీ రక్షణశాలలోనే యుంచితిమి. పైన పేర్కొనబడిన యిరువురుకాక మరి నలుగురు ఈ పతిత యువతీ రక్షణశాలలో చేరిరి. వారిలో ఇంకొకరికి వివాహమైనది. తక్కినవారు బిడ్డలను కని, చెప్పియు, చెప్పకయు పారిపోవుచువచ్చిరి.

*   *   *   *

శ్రీ రాజమహేంద్రపుర విక్టోరియా హిందూ వితంతు శరణాలయము విధులు :

1. మనలో కొందరు స్త్రీలు కొంచెము విద్య రాగానే గర్వము కలవారయి, పనిపాటుచేయుట తమకు అగౌరవమని భావించి, సోమరు

లయి చెడుచున్నారు. ఈ వితంతు శరాణాలయము నందు ఇటువంటి దురభిప్రాయము లెంతమాత్రము ప్రోత్సాహపరుపబడవు. ఇందుచేరిన వారందరును పాటుపడుట అభ్యాసము చేసికొనవలెను. వంట చేయుట, తెచ్చిన పదార్థములను జాగ్రత్తచేయుట, వెచ్చముల లెక్కలుంచుట, చిల్లర పనులను చక్కబెటుట మొదలయినవి వంతుల వరసను చేయుటవలన గృహ కృత్యములను తీర్పను కూడా నేర్చుకొందురు. ఇందుండువారు ప్రతి దినమును ఎవరి బట్టలు వారు ఉతుకుకొని, ఎవరి పక్కలూ వారు వేసికొని తెల్లవారి ఎత్తివేయుచుండవలెను.

2. ఎవరికైన వ్యాధి వచ్చిన పక్షమున మందులిచ్చుటకు వైద్యుడేర్పరుప బడునుగాని, అందున్న వితంతువులే ఉపచారములను, పథ్యపానములను వంతుల వరసను చేయవలెను.

3. బీద బాల వితంతువులకు ధర్మార్థముగా అన్న వస్త్రాదులును, పుస్తకములు మొదలగునవియు నిచ్చి, విద్య చెప్పింపబడును. ఆరు నెలలకొక పర్యాయము రెండేసి బట్టలియ్యబడును.

4. ఎవరైనను ఇతర తరుణులతో తగువులాడుచున్నను, విధులు మీరి ప్రవర్తించుచున్నను, పాఠములను చదువక అశ్రద్ధ చేయుచున్నను శరణాలయమునుండి పంపివేయబడుదురు.

ములుకుట్ల అచ్యుతరామయ్యగారు దయాపూర్వకముగా కట్టించి యిచ్చిన క్రొత్త వితంతు శరణాలయమునందు గృహ ప్రవేశము 1908 నవంబరు 15 న జరిగినది.

1908 లో దొరతనమువారు నన్ను గోదావరి మండలమునకు వివాహ లేఖ్యారూఢకునిగా (Registrar of Marriages) నియమించిరి. నా ఎదుట జరుగవలసిన మొదటి వివాహము కామరాజు హనుమంతరావుగారిదయి యుండవలసినది. నేను పుత్రికా ప్రాయనుగా చూచుచున్న కనపర్తి సుందరమ్మ తాను కూడ బ్రాహ్మ సామాజికురాలయి, నాతో కలసి పనిచేయుటకును, బ్రాహ్మని వివాహము చేసికొనుటకును సమ్మతిపడెను. సుందరమ్మకును, హనుమంతరావుగారికిని వివాహము నిశ్చయింపబడెను. ఈ వివాహముతో కలిపి, పులవర్తి వేంకట సుబ్బారావు వివాహముకూడ చేయుట కేర్పాటుచేసితిని. అన్నియు సిద్ధమైన తరువాత హనుమంతరావుగారు, వివాహ దినమున స్త్రీ పురుషులందరును మాలవానితో గలసి భోజనము

చేయవలెనని పట్టుబట్టెను. అట్లు చేయుటకు నా భార్య మొదలయిన వారొప్పు కొనలేదు. స్త్రీలను వదలిపెట్టవలసినదనియు, మరియొక దినమున పంచ మునితో గలిసి మనమందరమును భోజనము చేయుదమనియు నేను బహు విధముల చెప్పితిని గాని నా మాట లాయన అంగీకరింపలేదు. అందుచేత సిద్ధమయిన వివాహమప్పటికి ఆగిపోవలసి వచ్చెను.

ఇట్టి స్థితిలో 1908 అక్టోబరు 18 న జరగవలసిన యీ వివాహము తప్పి పోయి, ఒక్క పులవర్తి వేంకట సుబ్బారావు వివాహము మాత్రమే జరిగి, పిఠాపురము రాజుగారు పంపిన ఉంగరము, గడియారము మొదలగు బహు మానములు అతనికే యియ్యబడినవి. హనుమంతరావుగారు దేశీయ స్వపరి పాలన పక్షావలంబుడయి, వితంతు శరణాలయములోని తమ ఉపాధ్యాయ పదము విడిచి, బృందావనపురమునకరిగి, అక్కడ పనిచేయ నారంభించిరి. తరువాత హనుమంతరావుగారు తన పూర్వపు పట్టుదలను విడిచి, రాజ్యాంగోద్యమ పరిశ్రమను విడిచి, సాంఘిక ధార్మికోద్యమముల యందే పనిచేయుచుండుట కొప్పుకొని, మరల రాజమహేంద్రవరము వచ్చిరి. ఈ యిరువురకు సుందరమ్మ, హనుమంతరావులకు 1909 జూలై 25 న వివాహము జరిగినది. వివాహానంతరమున సుందరమ్మ వితంతు శరణాలయ పర్యవేక్షకురాలుగాను, హనుమంతరావుగారు హితకారిణీ సమాజ సహాయ కార్యదర్శిగాను నియమింపబడి, ఉభయులునుగలిసి 25 రూపాయల వేతన మును బడయుచూ పనిచేయుచుండిరి.

1907 నందు ఒకనాటి రాత్రి మూర్ఛవచ్చి పడిపోయి, తేరిన తరువాత నేను దుర్బలుడనయి, రోగపీడితుడనయియే యుంటిని. ఆ సమయము నందక్కడికి పండిత శివనాథశాస్త్రిగారు వచ్చిరి. కలకత్తా చూడవలెనని యున్నదని, నేను నా భార్యను వెంటగొని శివనాథశాస్త్రిగారితో కలిసి ఏప్రిల్ 4 న కలకత్తాకు బైలుదేరి, తోవలో భువనేశ్వరము వద్ద నిలిచి, అచ్చట దేవాలయములను, సమీపములోనున్న బౌద్ధగుహా మండపములను, చూచి, కలకత్తా చేరి అక్కడ కొన్ని దినములు శివనాథశాస్త్రిగారి అతిథిగా నుంటిని.

నా పేరావరకే కలకత్తాలో విశేషముగా తెలిసి యుండుటచేత, సాధారణ బ్రహ్మసమాజము వారేగాక, ఆది బ్రహ్మ సమాజమువారును, నవ విధాన సమాజమువారును నన్ను గౌరవించి, నాయందాదరము

చూపిరి. నే నక్కడ వారము దినములుండి చూడవలసిన వానినెల్ల చూచి, మరల సురక్షితముగా రాజమహేంద్రవరము చేరితిని. ఈ యాత్ర నాకు కొంత మేలే చేసినది.

ఆ సంవత్సరము వేసవి కాలములో మొదటిసారి నేను బెంగుళూరు పోయితిని. మైసూరిలోని వార్తా పత్రికలన్నియు నన్నభినందించుచు వ్యాసములు వ్రాసెను. బెంగుళూరిలోని వర్ధమాన సమాజము (progressive union) వారు నాకు సత్కారము చేసి గౌరవించిరి. అక్కడ కొన్ని దినములుండి మైసూరునకు పోగా, మహారాణీ కాలేజిలో నాకు స్వాగత మిచ్చి ఆదరించిరి. శివసముద్రమునకు పోయి కావేరి నదీ పతనమును, దాని వలన విద్యుచ్ఛక్తి కలిగించు రీతిని చూచితిని. కోలారునకు పోయి బంగారు గనులు పనిచేయు రీతిని చూచితిని. చూడదగిన విశేషములనన్నిటిని చూచి మరల బెంగుళూరు చేరితిని. అక్కడి పౌరులు సభచేసి, నాలుగు భాషలలో నాకు స్వాగత పత్రికలను చదివిరి. జూన్ 15 న చదివిన ఇంగ్లీషు పత్రికలో :

"We citizens of Bangalore have pleasure . . to give expression to the sentiments of respect and admiration with which we have been inspired by your writings and your personal example.

"You have created and embellished modern Telugu Literature and your works are a living source of inspiration to a vast Telugu section of the population of India.

"Your labours in the cause of social reform entitle you to rank with those noble souls who are unflinchingly loyal to their sincere convictions and who dare to do where many are content to preach.

"The world is full of people who call others to work but there are very few indeed who, like you, set the example themselves, by silent, patient, self-sacrificing performance of duty.........."

నేను శీఘ్రకాలములోనే ఒక వితంతువునకు వివాహము చేయుటకయి బరంపురము వెళ్లితిని. అక్కడ పురజనులు 1907 జూలయి 7 న స్వాగత మిచ్చి పత్రిక చదివిరి. 1908 లో నేను వెళ్ళినప్పుడు బందరు పురజనులు స్వాగత మిచ్చి, అభినందన పత్రమిచ్చిరి. ఈ ప్రకారముగానే నేను బాపట్ల మొదలయిన స్థలములకు వెళ్ళినప్పుడు నాకు స్వాగతమిచ్చి,

పత్రికలు చదివిరి. దూషించి రాళ్ళు వేసెడి కాలముపోయి, ఇప్పుడు భూషించి పూలువేసెడి కాలము వచ్చినది. అయినను నాకా పూర్వకాలమే సంతోషముగా నుండెను. ప్రతిపక్షులు దూషించిన కొలదిని రోషమును, శౌర్యోత్సాహములును ఎక్కువ అయి, ఎక్కువ పట్టుదలతోను, శ్రద్ధతోను పని చేయగలిగితిని.

చెన్నపురి రాజధానీ పరిపాలకులయిన లాలీ దొరగారు 1909 లో రాజమహేంద్రవరము వచ్చినప్పుడు నాకు దర్శనమిచ్చి, నాతో చాలాసేపు అత్యంతాదరముతో మాట్లాడి, తాము వచ్చి మా వితంతు శరణాలయమును చూచెదమని సెలవిచ్చిరి. అక్కడికి దారిలేదని తప్పించుకోజూచితిని గాని, బండి రానియెడల తాము నడిచియే వచ్చెదమని సెలవిచ్చిరి. అందుపైని నేనింటికి వచ్చి, నడుమ ఆదివారమొకటి వచ్చినందున, తక్షణమే 40 మంది కూలివాండ్రను పెట్టి, రాత్రియు పగలును పనిచేయించి, సోమవారమునాడు ప్రాతఃకాలమున కొక విధముగా బండి వచ్చుటకు తగిన బాట వేయించితిని. వారా దినము ప్రాతఃకాలమున 7 గంటలకు విజయంచేసి, వితంతు శరణాలయమును చూసి సంతోషించి పోయిరి.

1908 ఏప్రిల్ 14 తేదీతో నాకు అరువది సంవత్సరములు నిండినవి. నా భార్య యొక్క ప్రేరణచేత నేను షష్ఠిపూర్త్యుత్సవము తలపెట్టి, మిత్రులు మొదలయిన వారి కాహ్వానములు పంపితిని. దూర ప్రదేశముల నుండి సహితము పలువురు మిత్రులును వితంతు వివాహములు చేసికొన్నవారును వచ్చి నన్ను గౌరవించిరి. నాటి యుత్సవము మిక్కిలి జయప్రదముగా జరిగెను.

1909 లో వేసవిలో నేను బెంగుళూరు వెళ్లవలెనని నా భార్యను, సుందరమ్మను, జానకమ్మను వెంటగొని, దారిలో చెన్నపట్టణములో సమర్థి రంగయ్యశెట్టిగారి ఆదరముచేత నిలిచితిని. ఈ రంగయ్య శెట్టిగారు నేను చెన్నపట్టణములో నుండిన కాలములో నేను కోరకయే వితంతు శరణాలయ పోషణార్థము నెలకు పదేసి రూపాయలు పంపుచు వచ్చిరి. తరువాత నేనాయన నొకసారి కలుసుకొన్నప్పుడు, నెలనెలకు పదేసి రూపాయలిచ్చుట కంటె శాశ్వత నిధిగా ఏమైన పెట్టుట ఉచితముగా నుండునని చెప్పితిని. ఆయన వేయి రూపాయలు హితకారిణీ సమాజము వారిపేర వ్రాయించి నా కోరికను చెల్లించిరి. నే నాయన నిట్లు చేయగోరి

నప్పుడు శీఘ్రకాలములోనే నా మిత్రునకు మృత్యువు తటస్థించుననుకోలేదు. కృష్ణామండలమునకు పోయి తిరిగి వచ్చునప్పుడు జూన్ 19 న సంభవించిన అయోమార్గ మహా విపత్తులో నా మిత్రునకకాలమరణము సంభవించెను.

రాజమహేంద్రవరములోని వితంతు శరణాలయాదుల కొరకు నాకు అప్పు అగుచుండెను. హితకారిణీ సామాజికుల చందాలు, చందాలు పోగు చేసెడి భృత్యుని జీతమునకే చాలీచాలనివిగా నుండెను. ఇంటి అద్దెలు మొదలయిన వానివలన వచ్చెడిది గాక మిగిలిన దంతయు నేనే భరించవలసిన వాడనయితిని. నేను హితకారిణీ సమాజమునకిచ్చిన రొక్కములో 3,500 నా యొద్ద నిలవయుండును. ఇప్పటికా రూపాయలన్నియు వ్యయమైనవి.

ఇప్పుడు సామాజికుల కందరికిని చందాలు పోగు చేయవలసిన వెట్టి పుట్టినది. అందుచేత వారు ధన సహాయ్యము నిమిత్తమయి ఇంగ్లీషున ఒక విన్నపము వ్రాసి ముద్రింపించి నా చేతికిచ్చిరి. ఇంకను దేశాటనముచేసి చందాలు పోగు చేయువారు కావలెను. సహాయ కార్యదర్శి అయిన హనుమంతరావుగారిని వెంటగొని, సకళత్రముగా నేను బొంబాయి పోయి చందాలు సమకూర్చ వలసినదని హితకారిణీ సమాజము వారు నిర్ధారణము చేసిరి.

మేము మరునాడు సికిందరాబాదు చేరి నాటికక్కడ నిలచిపోతిమి. అక్కడ డాక్టరు జి. నాయుడుగారు నేను పోవుచున్న పని తెలిసికొని, మొదటి చందా 15 రూపాయలు నాచేతి కిచ్చిరి. నేను వారి యింటికి పోయినప్పుడు కవయిత్రి అయిన సరోజినీ నాయుడు అస్వస్థురాలయి మంచము మీద పరుండియుండి, బిడ్డలను తనవద్దకు పిలిచి, "మీ తాతగారు వచ్చినారు, చూడుడు," అని నన్ను చూపెను. వారి వివాహమును నేను చెన్నపట్టణములో చేసి యుండుటచేత ఆమె నన్నట్లు పిలిచినది. సరోజినీ దేవిగారి తండ్రి తన కొమారిత వివాహమును మా యింటనే చేయవలసినదని నన్ను కోరిరి. కాని నేనట్లు చేయక సమాజ మందిరములో జరిపితిని.

సికిందరాబాదులో ఒక దినముండి, మరునాటి యుదయమున బైలుదేరి బొంబాయికి పోయితిమి. అక్కడ నా మిత్రులును, హైందవ సాంఘిక సంస్కార పత్రికాధిపతులును అయిన నటరాజయ్యరుగారు మమ్ము తమ యింటికి కొనిపోయిరి. చదువుకొన్న వారిలోను, సంస్కార పక్షము వారిలోను, ప్రార్థన సామాజికులలోను నా పేరక్కడ సహితము చక్కగా

తెలిసియున్నదగుటచేత అక్కడివారును నాకు స్వాగత మిచ్చి గౌరవించిరి. న్యాయమూర్తి చంద్రవార్కరుగారు నన్నాసభలో అభినందించిరి. నా శిష్యులయిన గంటి లక్ష్మీనరసింహముగారును, నా మిత్రులైన గణేశ నారాయణ చంద్రవార్కరుగారును నాకు విందులు చేసిరి.

నేను విందుల నిమిత్తము కాక చందాల నిమిత్తము పోయియుండిన వాడనగుటచేత మరికొందరు మిత్రులు భోజనములకు పిలిచినను పోవక, మిత్ర సాహాయ్యమున చందాలు పోగుచేయ నారంభించితిని. నే నక్కడ నున్న వారము దినములలోను 900 రూ. చందాలు వేయించితిని. ఈ విషయములో ఆంధ్రపత్రికాధిపతులైన కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారును, నటరాజయ్యరుగారును నాకు మిక్కిలి తోడుపడిరి. వారియెడల నేను మిగుల కృతజ్ఞుడనై యున్నాను. నేనక్కడ నుండగానే, ఆవరకు పూనా వితంతు శరణాలయములో నున్న ఇద్దరు వితంతువులను పూనానుండి రాజమహేంద్రవరము పంపివేసి నేనును నా భార్యయు పూనాలో నిలిచితిమి. మేమక్కడ నున్న రెండు రోజులును, పూనా వితంతు శరణాలయ సంస్థాపకులును నా మిత్రులును అయిన కర్వే పండితుని అతిథులమయియుండి ఒక దినము అక్కడి వితంతు శరణాలయములోనే యుండి, అక్కడ జరుగుచున్న పద్ధతులనన్నిటిని చూచితిమి.

నా మిత్రులైన కోలాచలము వెంకటరావుగారు నన్ను బళ్లారికి రావలసినదని కోరియుండినందున పూనా నుండి నేనును, నా భార్యయు బళ్లారికి పోయితిమి. వారక్కడ మమ్ము తమ యింటనే యుంచుకొని, ప్రయాణ వ్యయముల క్రింద 100 రూపాయలిచ్చి, హితకారిణీ సమాజమునకు మున్నిచ్చిన 3,000 రూపాయల భాగములనుగాక, సభాపతి యంత్రములలోని మరి రెండు వేల రూపాయల భాగములను (shares దయచేసిరి. తరువాత నేనును, నా భార్యయు వారిని వీడ్కొని గుంటకల్లు మీదుగా రాజమహేంద్రవరము చేరితిమి. తరువాత నేను కాకినాడకు పోయి అక్కడ 1,332 రూపాయల చందాలను సమకూర్చితిని. ఇట్లు సమకూర్పబడిన ధనముతో హితకారిణి సమాజము యొక్క ఋణము కొంత తీరినది.

1910 వేసవిలో మేము మరల బెంగుళూరుకు పోయితిమి. ఈ సారి మాతో న్యాపతి జానకమ్మను, కామిరాజుగడ్డ మంగమ్మను తీసికొని పోయితిమి. ఈసారి మేమక్కడ మా స్వగృహములోనే ప్రవేశించితిమి. మేము

పోవునప్పటికి నా మిత్రులు గృహమును కట్టించి, నివాసమునకర్హమగునట్లు చేసిరి. మాకు అక్కడ అధికారోగ్యము కలుగుచుండుటను బట్టి నా భార్య సంవత్సరములో ఆరు మాసములు ఆ యింటనుండి సుఖింపవలెనని నిశ్చయించుకొనెను. నేనును సమ్మతించితిని.

ఈసారి మా వెంటగొని వచ్చిన న్యాపతి జానకమ్మకు వివాహము చేసితిమి. ఇది బెంగుళూరులో జరిగిన మొదటి వితంతు వివాహము. వితంతు వివాహ శాసనము మైసూరు రాజ్యమునందు వ్యవహారములో లేదు. అందుచేత మేమీ వివాహము ఇంగ్లీషు రాజ్యమైన దండు పట్టులో చేయవలసిన వారమయితిమి. ఈ వివాహమక్కడ నూతనమయిన దగుటచేత బెంగుళూరులోని పెద్ద మనుష్యులు విశేషముగా వచ్చి, తాంబూలాది సత్కారములను గైకొని సంతోషించి పోయిరి.

మాతో వచ్చిన మంగమ్మ వితంతు శరణాలయములో నుండిన వారిలో నెల్ల నా భార్య కధిక ప్రియురాలు. ఆమెకును నా భార్య యందు మాతృస్నేహము. ఆమె వితంతు శరణాలయములోనే యుండినను, తరుచుగా మా యింటికిని వచ్చి నా భార్యకు సమస్తోపచారములను చేసి పోవుచుండెను. నా భార్య నాతో, "మన మంగమ్మకు వివాహము చేసి పంపివేయవలదు, పెండ్లి చేసి మన యొద్దనే యుంచుకొందము," అని పలుమారు చెప్పుచుండెను.

# 4. అసహాయ దశ-1910 మొదలు 1913 వరకు

1910 లో బెంగుళూరు నుండి వచ్చి రెండు మాసములైనను గడవక ముందే ఆకస్మికముగా ఘోర విపత్తు సంభవించి నన్నీలోకములో అసహాయుని చేసినది.

బెంగుళూరునుండి నా భార్య ఇక్కడికి రాజమహేంద్రవరము సంపూర్ణారోగ్యముతో వచ్చినది. తరువాతనైనను రోగ చిహ్నము లేవియు కనబడ లేదు. ఆగష్టు 11 ప్రాతఃకాలమునను, సాయంకాలమునను తానే స్వయముగా వంటచేసి పెట్టినది. రెండు దినముల క్రిందట మా ఆవు ఒకటి ఈనగా, గత దినమునందు వలెనే నాడును జున్నుచేసి నాకు కొంచెము పెట్టి, ఇతరులకు పెట్టి, తానింత తినెను. నేను భోజనముచేసి మేడమీదికి పోయిన తరువాత ఇంటి పనులన్నిటిని తీర్చుకొని, పశువులకు గడ్డి వేయించి, రాత్రి పది గంటలకు మేడమీదికి వచ్చి, వసారాలో నున్న మంచముమీద పరుండి నిద్రపోయెను. నా భార్య మేడపైకి వచ్చునప్పటికే నేను నిద్రపోయితిని.

తెల్లవారు జాము నా భార్య నాలుగు గంటలలో నిద్రలేచి, గంటసేపు నాతో మాటాడుచు కూరుచుండి, అయిదు గంటలకు ఈశ్వర ప్రార్థనము చేసి క్రిందికి దిగిపోవుట ఆచారము. నేనా రాత్రి మూడు గంటలు కాక ముందే లేచి క్రిందికి పోయితిని. నేను తలుపు తీసిన చప్పుడు వినబడగానే, "క్రిందికి పోవుచున్నారా? దీప మున్నదా? జాగ్రత్తగా చూచి పొండి," అని పలుకరించుట వాడుక అయినను నాడట్లు పలుకరించలేదు. నేను క్రిందికి వెళ్లి వచ్చి, నా భార్య మంచము వద్దకు పోయి మెల్లగా, "నిద్రపోవుచున్నావా?" అని అడిగితిని. బదులు పలుకకపోవుట చేత నేను పోయి నా మంచముమీద మేలుకొనియే పరుంటిని. గడియారము నాలుగు కొట్టినది. నేనప్పుడు నా మంచము దిగి నా భార్య మంచము వద్ద నిలుచుండి, "ఇంకను నిద్ర మెలకువ రాలేదా?" అని అడిగితిని. మారు పలుకలేదు. నిద్రాభంగము చేయుట కిష్టములేనివాడనయి లేపక, మడత కుర్చీమీద కూరుచుండి యుంటిని. గడియారము ఐదు గంటలు వేసెను. నా భార్య

అప్పటికిని లేచిరాలేదు. నేను పోయి పిలిచి, పలుకకపోగా మీద చేయి వేసి కదల్చితిని. దేహము చేతికి చల్లగా తగిలి లేవకపోగా నేమియు తోచక, ఎట్లో మేడదిగి డాక్టరును పిలుచుకొని వచ్చుటకయి వితంతు శరణాలయము వద్దనుండి పోవుచు, అందు కాపురమున్న దిలవర్తి సుబ్బారావును లేపి, "నాకు కాళ్లాడకున్నవి. నీవు పరుగెత్తుకొని పోయి, పొరుగు తోటలో నున్న డాక్టరును లేపు," అని పంపి వెనుకకు పోయితిని. నేను పోవునప్పటికి డాక్టరు లేచి యీవలకు వచ్చెను. నా భార్యకు మూర్ఛ వచ్చినది, తక్షణము రావలెనని కోరగా, అతడు మందుబుడ్లు మొదలయినవి తీసికొని నావెంట వచ్చెను.

అతడు నాతో మేడ ఎక్కి నా భార్యను పరీక్షించి, ప్రాణము పోయినదని మెల్లగా చెప్పెను. నేనామాట నమ్మక, చక్కగా పరీక్షింపవలసినదని చెప్పితిని. ప్రాణము పోయి మూడు నాలుగు గంటలయి యుండునని చెప్పి ఆయన లేచెను. ఆయన గుమ్మము కడ నిలువబడి నన్నోదార్చి, ధైర్యముగా నుండవలసినదని బోధించి మెట్లు దిగెను. నేను గోడకు చేరగిలబడి యుండగా, ఏదో వికార మారంభమయి కాళ్లు తడబడ దడపుట్టెను. తక్షణమే నేలపై కూలబడి కన్నులు మూసికొని, "ఓ యీశ్వరా! వృద్ధదశలో నాకిట్టి మహాపదను తెచ్చిపెట్టితివా?" అంటిని. అనునప్పటికి, "ఓయీ, దుఃఖపడకుము. ఇది మీ యుభయుల మేలుకొరకే జరిగిదని," అన్న మాటలు నాకు విస్పష్టముగా వినబడినవి. క్రిందినుండి ఎవరో నన్నూరడించుచున్నారని కన్నులు విప్పిచూచితిని. ఏప్రక్కను ఎవ్వరును కనబడలేదు. ఇదియంతయు నా భ్రమయే అయి ఉండవచ్చును గాని నాకు మాత్రము అది యీశ్వర వాక్యమని దృఢముగా తోచినది. అవరకు నాకున్న విచారమంతయు తక్షణములో అదృశ్యమయి, నా మనస్సు నిర్మలమయి, నిర్విచారమయ్యెను.

నేను లేచి నా భార్య వద్దకు పోయి పరీక్షించి చూడగా జీవకళ యేమియు తొలగక హాయిగా పరుండి నిద్రపోవుచున్నట్లే నా కంటికి కనబడెను. పక్క దుప్పటి చెరగక, తలలో పెట్టుకొన్న గులాబి పువ్వు వాడక, కట్టుకొన్న చీర నలగక ఉండుటను బట్టి నా భార్య ఇంచుకయిన ఆయాస పడలేదనియు, కొట్టుకొనలేదనియు, మూలుగలేదనియు, రాత్రి

ఒంటి గంటకో, రెండు గంటలకో నిద్రలోనే ప్రాణము పోయినదనియు స్పష్టమైనది.

నా భార్య మరణవార్త పట్టణములో తెలియగానే జనులు తీర్థ ప్రజగా మా తోటలోనికి రా దొడగిరి. వచ్చిన వారిలో కొందరు తమ కుటుంబము లోని వారెవ్వరో పోయినట్టు విలపింప జొచ్చిరి. ధైర్యము చెప్పి నన్నోదార్ప వచ్చిన వారు కొందరు నన్ను చూచి ఏడువసాగగానే నే వారి యేడుపు తుడుపవలసిన వాడనయితిని. నేను పైకెంత ధైర్యముగా నున్నను శోకాగ్ని దుర్భరమయినప్పుడెల్ల మేడమీదికి పోయి ఈశ్వరుని ప్రార్థించి దుఃఖానల మును కొంత శాంతపరచుకొనుచు వచ్చితిని.

నా భార్య యెడల గౌరవమును తెలుపుటకయి క్రైస్తవ పాఠశాలయు, హితకారిణీ పాఠశాలయు ఆ దినమున మూసివేయ బడినవి: ఒక ఇంగ్లీషు పక్ష పత్రిక తప్ప తక్కిన వార్తా పత్రికలన్నియు నా భార్య మృతి విషయమయిన అనుబంధములను ప్రకటించినవి. ఆ పత్రికల ముద్రా యంత్రము లన్నియు ఆ దినమున మూసివేయబడినవి. ప్రాడ్వివాకులు సహితము తమ సభను మూసివేసి, కొందరు న్యాయవాదులతో గూడ మా తోటకు వచ్చిరి. ఇట్లు పురజనులెల్లరును నా ఆపదకు వగచి, తమ సానుభూతి గనపరచినందుకు నే నెంతయు కృతజ్ఞుడను.

మూడు గంటలయిన తరువాత ప్రేతమును ఆనందాశ్రమమునకు గొని పోయి, ప్రార్థనములు జరిపిన పిమ్మట, శవమును తోటలోనే ఒక చివరకు దహనము చేసితిమి. ఈ మరణ వార్త నెవ్వరో తంత్రీ ముఖమున తెలుపుటచేత మరునాటినుండియు నాకు దుఃఖోపశమన (Condolence) తంత్రీ వార్తలును, లేఖలును రాదొడగెను.

నా భార్య పెంచి పెద్దవానిని చేసిన గోగులపాటి వీరేశలింగము శీఘ్రకాలములోనే వచ్చెను. అతని భార్యకిచ్చుటకయి నా భార్య యొక్క పెట్టెను తీసి, బనారసు చీరను తీయునప్పటికి ఎంత అపుకొన్నను ఆగక నా కన్నులనుండి నీరు కాలువలు కట్టెను. అతడును పెద్ద పెట్టున నేడ్చెను. బనారసు చీరనతని చేతికిచ్చి, తక్కిన చీరలలో ఒకటి పులవర్తి సుబ్బారావు భార్యకును, ఇంకొక వెలగపట్టు చీర నా భార్య మరదలికిని ఇచ్చి, మిగిలిన చీరలను, రవికలను వితంతు శరణాలయములోని వారి కందరికిని పంచిపెట్టితిని.

నా భార్య అస్థికలను సమాధి కట్టించెడి ఉద్దేశముతో కొన్నిటిని నేనొక పెట్టెలో జాగ్రత్త చేసి ఉంచి, వితంతు వివాహమును చేసికొన్నవారడుగగా తక్కినవానిని తీసికొని పోనిచ్చితిని. గోగులపాటి వీరేశలింగము తనకిమ్మని అడుగగా కొన్నిటి నతని కిచ్చితిని. మేము పెంచి పెద్దచేసిన వారిలో గోగులపాటి వీరేశలింగ మొకడు, పులవర్తి సుబ్బారావొకడు. వీరేశలింగము తన నాల్గవ మాసముననే మా యింటికి వచ్చి అదుపాజ్ఞలలో పెరిగినవాడు. నా భార్యను కన్నతల్లివలె చూచి ప్రేమించుచు, చెప్పినట్టు వినుచుండెడివాడు. అందుచేత నా భార్య వీరేశలింగమును పుత్రాధికముగా ప్రేమించుచు, తన మేనకోడలినిచ్చి వివాహము చేసి తన యొద్దనే యుంచుకొనవలెననియు, వృద్ధ దశలో తనకతడు ప్రాపుగా నుండుననియు తలచియుండెను. అతడు మైసూరులోని సంబంధమును కుదుర్చుకొనినప్పుడు సహితము, ప్రాయశ్చిత్తము చేయించుకొని తన్ను విడిచిపోవునని యెరుగదు. ఆ సంగతి తెలిసినప్పుడామె మనస్సునకు దుఃఖము కలిగి, కొన్ని వారములు మనస్స్వాస్థ్యము లేనిదయి యుండెను.

ఆనందాశ్రమమునకు సమీపమున తోటలో "రాజ్యలక్ష్మి నివాసము" అనునొక గృహమును కట్టించి, అందులో నా భార్య అస్థికలను నిక్షేపించితిని. ఈ పాలరాతి సమాధి కలకత్తాలో సుందరముగా చేయబడినది. నా భార్యకు పువ్వుల యందత్యంత ప్రీతి. అందుచేత సమాధి చుట్టును రాజ్యలక్ష్మి ప్రమదావనమను పేరుతో పుష్పవనము వేయబడినది. నా భార్య పేరుతో తోటలో ఒక నుయ్యి కూడ ధర్మార్థముగా త్రవ్వింపబడినది.

నా భార్య జీవిత చరిత్రమును ఇంచుక తెలుపుట యిచ్చుట అనుచితము కాదని భావించి ఇందు పొందుపరచుచున్నాను.

శ్రీమతి రాజ్యలక్ష్మి కాతేరు గ్రామమునందు అద్దంకి పట్టాభిరామయ్యగారికిని, కొండమాంబ గారికిని 1851 నవంబరులో జననమొందెను. 1910 ఆగస్టు 12 తెల్లవారుజామున పరమపదము నొందెను. మరణమునకీమెవయసు 58 సంవత్సరముల 8 మాసముల 25 దినములు. పట్టాభిరామయ్యగారి కీమె రెండవ కుమారిత. శైశవముననందే మాతృ మరణము నొందిన ఈమెను మేనమామయు, కాతేరు కరణమును అగు వెన్నేటి వెంకటరత్నముగారును, భార్యయు పెంచి పెద్దదానిని చేసిరి. పుట్టినింటి

వారీమెకు పెట్టిన పేరు బాపమ్మ. వారీమెను మరణమువరకును బాపాయి అని పిలుచుచుండెడివారు.

ఆ కాలమునందు స్త్రీ విద్య దూష్యముగా నుండినను, తామున్నది పల్లె అయినను, మేనమామ ఈమెను బడికి పంపి చదివించుచుండెను. ఈ మేనమామయే ఈమెను ఎనిమిదవ యేటను పంద్రెండేండ్ల ప్రాయముగల నాకిచ్చి వివాహము చేసెను. ఈమె నమక చమకములను నారాయణ మును నేర్చుకొని, పురుషులు ఇంటలేని దినములలో తానే దేవతార్చన చేయుచుండెను. పంద్రెండేండ్ల ప్రాయమున పునస్సంధానము చేసి యీ చిన్నదానిని మా యింటికి పంపివేసిరి. నా తల్లి పూర్ణమాంబ నా భార్య పేరు మార్చివేసి, రాజ్యలక్ష్మి అని తన తల్లి పేరు పెట్టి పిలువజొచ్చెను.

కాపురమునకు వచ్చినది మొదలుకొని అంతకంతకు మా యిరువురకును పరస్పరానురాగము ప్రబలి ఏకాభిప్రాయులము కాజొచ్చితిమి. ఆమె నా యెడల పరమ విశ్వాసము కలదై, మంచికయినను, చెడ్డకయినను నన్నే అనుసరించుచు, నావలె మారిపోయెను. నే నే సాహసకార్యమును తల పెట్టినను, నన్ను వెనుక తీశ్యక తోడునీడయై యుండి ప్రోత్సాహ వాక్య ములు పలుకుచు నన్ను ముందుకు నడిపించుచుండెను. నాది కొంత కోప స్వభావము, నా భార్యది శాంత స్వభావము. ఎప్పుడైన చిత్తోద్రేకము కలిగి, నేనెవ్వరిని లక్ష్యము చేయక, తొందరపడి మత్త గజమువలె సంచ రింప జూచినప్పుడు తానంకుశమయి నన్ను మరలించి, మరల స్వస్థచిత్తుని చేయుచుండెను. "షట్కర్మయుక్తా ఖలు ధర్మపత్నీ" అనునది ఇంచు మించుగా నా భార్యకు వర్తించుననియే నా నమ్మకము. నా విశ్వాసమున కొకవేళ నా కామె యెడల దృఢానురాగము కారణమయి యుండవచ్చును.

తన వారు నాకిచ్చి వివాహము చేసిన దోషము చేత నా మూలమున నా భార్య ఎన్నియో కష్టములకు లోబడవలసిన దయ్యెను. నా భార్య నవ్వు మొగముతో వానిని సహించుచుండెను. నేను వితంతు వివాహ ప్రయత్నము నారంభించి నప్పటినుండియు నా భార్యకు కష్టము లారంభమయినవి. నా బంధువులును, మిత్రులును, పురజనులును, పూర్వాచార పరాయణులును నన్ను మరలింప సర్వవిధముల ప్రయత్నించి చూచి, కడపటి యుపా యముగా నా భార్యను పట్టుకొనిరి. కాని కార్య సాఫల్యము కలుగలేదు. తన్ను పెంచి పెద్దదానిని చేసిన మేనమామయు, బంధువులును వచ్చి,

ఏదో ఘోర విపత్తు సంభవించినట్టుగా ఏడ్చుచు, నీ భర్త నీకార్యము నుండి మరలింపుమని దీనముగా వేడుకొనిరి. ఆమె ఆ దీనాలాపములకు సంచలింపక, "ఆయన పూనిన కార్యము మంచిదని నేనును నమ్ముచున్నాను. ఎన్ని కష్టములు వచ్చినను నే నాయనకు సాయపడెదను," అని దృఢముగా చెప్పెను.

అప్పుడందరును చేరి, "మమ్మందరను విడిచిపెట్టెదవా?" అని యేడ్వజొచ్చిరి. "నేను మిమ్మెప్పుడును విడువను. మీరే నన్ను విడిచి పెట్టెదరేమో!" అని ఆమె ప్రత్యుత్తరమిచ్చెను. నేను పూనితినన్న హేతువు చేతనే కాక అనాథ బాలికా కష్ట నివారణమునందామెకును ఆదర ముండెను. వివాహాపేక్షతో మా యింటికి వచ్చిన వితంతువులను నే నింట నుండినను లేకున్నను, లోపలికి గొనివచ్చి, పూర్వ పరిచితిగల దానివలె ప్రియవచనములు పలికి, ధైర్యము చెప్పి భయముడిపి ఆదరించుచుండెను. చదువురానివారి కక్షరాభ్యాసము చేసి, ప్రతిదినమును పలకమీద అక్షరములు వ్రాయించి, "మీరు వివాహములు చేసికొని భర్తల ఇండ్లకు పోవులోపల చదువు నేర్చుకొని, మీ కష్టసుఖముల నుత్తరముల మూలమున మాకు తెలుపుటకు శక్తురాండ్రు కావలెను," అని పురికొల్పి విద్యాబుద్ధులు చెప్పుచుండెను. వచ్చిన వారిలో నెవ్వరైన అజ్ఞానముచేతను, పూర్వ దురభ్యాసముల చేతను కొంచము కాని మార్గమున సంచరించినను వారి తప్పు పైకి తెలియనీయక, తల్లివలె రహస్యమున మందలించి వారిని నీతి మార్గమునకు త్రిప్పుచుండెను.

ఇంటికే వితంతువు వచ్చినను, నేను పాఠశాలకు పోయి యుండినప్పుడు సహితము, లోపల చేర్చుకొని ఆదరించి, నేనింటికి వచ్చి బట్టలు తీయుచుండగానే నవ్వు మొగముతో దాపునకు వచ్చి, "మీ కొక శుభవార్త చెప్పెద," నని లోపలికి గొనిపోయి నాకా చిన్నదానిని చూపుచుండెను. వివాహముల నిమిత్తమయి మా యింటికి వచ్చిన వితంతువులను పుత్రికా ప్రేమతో చూచి, వారికి విద్యాదానము చేసియు, మంచివారినిగా చేయుటకు పాటుపడుచు, వివాహానంతరమున వారితో ఉత్తర ప్రత్యుత్తరములు జరిపి, వారి యోగక్షేమములను విచారించుచు, అవశ్యమైనచో వారికి పురుళ్లు పోయుచు, వ్యాధి సమయములందుపచారములు చేసియు యిండ్లకు పంపుచు, వారి యెడల అత్యంత సానుభూతి కనబరుచుచుండెను.

దౌర్బల్యముచేతను, వంచక పురుషుల చేతను మానమును గోలుపోయి పతిత లైన అనాథ మానినుల యెడలను ఇట్టి ఆదరమునే నా భార్య చూపుచు వచ్చెను. అట్టివారి నిమిత్తమయి "పతిత యువతీ రక్షణశాల" నొకదానిని మా యింటి ఎదుటింటిలోనే స్థాపించి, తానే తద్విచారణమును పైనివేసికొని, వారిని పూర్వ దుర్వృత్తినుండి మరలించి బాగుచేయ ప్రయత్నించుచుండెను. నా భార్య జీవితకాలములో అట్టివారు 5 గురు రక్షింపబడిరి. వారిలో ముగ్గురికి వివాహములు చేయబడెను. తక్కిన వారిద్దరు బిడ్డలనుగని, శిశుహత్యా దోషమువలన విముక్తురాండ్రయి స్వగృహములకు చేరిరి.

కడపటి గర్భవతియయి వచ్చిన ఒక బ్రాహ్మణ వితంతువును నా భార్య ఇచ్చటె క్రైస్తవ ప్రసవ వైద్యశాలకు పంపెను. ఆ వితంతువు తాను గన్న ఆడబిడ్డను వైద్యశాలాధికారుల కిచ్చి లేచిపోవ ప్రయత్నించుచున్నదన్న వర్తమానము చెవిసోకగానే నా భార్య బండిచేసికొని వైద్యశాలకు పోయి మాతా శిశువులను మా యింటికి కొనివచ్చెను. తరువాత మాత తన శిశువును మా యింట దిగవిడిచి తన వృద్ధమాత వెంట స్వగ్రామమునకు పోయెను. ప్రేమావతి యని పేరుపెట్టి నా భార్య ఆ శిశువును తానే ప్రేమతో పెంచుచు, సమస్తోపచారములు చేయుచు వచ్చెను. ఆమె కింతలో ఆకస్మికముగా పరలోకప్రాప్తి కలుగగా, సంరక్షణము చేయువారు లేక, నేనా శిశువును వైద్యశాలాధికారులకే పెంచుకొనుట కిచ్చివేయవలసిన వాడనయితిని. ఆ శిశువిప్పుడు వారియొద్ద సుఖముగా పెరుగుచున్నది.

వేసవి కాలములో ఒకనాడు నేను పాఠశాలకు పోయి యుండినప్పుడు ఒక పంచముడు మా వీథిలోని యిసుకలో స్మృతి తప్పి పడిపోయెను. ఎండ వేడిమికి కాలుచున్న యిసుకలో ఒడలెరుగక పడిపోయిన ఆ మాలవాని దురవస్థకు జాలిచెంది నా భార్య వీథిలో నిలుచుండి, ఇరుగు పొరుగుల వారిని, దారిన పోవువారిని పిలిచి, వానిని నీడను మా అరుగుమీద పట్టుటకు తనకు తోడు పడమని ప్రార్థించెను. కాని వాడు మాలవాడగుటచేత శూద్రులు సహితము వానిని ముట్టుకొననొల్లక తమ దారిని పోవజొచ్చిరి. కొంతసేపు జరిగిన తరువాత కనపర్తి శ్రీరాములుగారు ఆ దారిన పోవుట తటస్థించెను. నా భార్య ఇతరులను చేసిన ప్రార్థననే ఆయనను చేసెను. అతడును, నా భార్యయు చెరియొక వైపునను పట్టి ఆ మాలవానిని మా అరుగుపై పెట్టిరి. నా భార్య లోపలికి పోయి స్నానము చేసివచ్చి, వాని

యొద్ద ఉండి, కావలసిన సాయము చేయుచుండెను. స్త్రీ పురుషులందరును సోదరీ సోదరతుల్యులనియు, పరోపకారమే పరమ ధర్మమనియు హృదయమునందు గల దృఢవిశ్వాసమే నా భార్యను పరోపకారమునందు పాటుపడునట్లు చేసినది.

ఆమె నిజమైన ఈశ్వర భక్తురాలు. ఆమెకు విగ్రహారాధనమందు విశ్వాసము చిరకాలము క్రిందనే పోయెను. ఆమె చుట్టుపట్ల నుండు స్త్రీలను మా యింట గుమికూర్చి, ఏకేశ్వరోపాసనమునకు పురికొల్పి స్త్రీ ప్రార్థన సమాజమును స్థాపించుటయు, పరిశుద్ధాస్తిక భావమును ప్రోత్సాహ పరచు కీర్తనలను రచియించి తమ సమాజమునందు ప్రతి వారమును పాడుచుండుటయు ఆమెకు కలిగిన ఏకేశ్వర విశ్వాసమును సహస్రముఖముల ఘోషించుచున్నవి. స్త్రీలకు ప్రత్యేక ప్రార్థన సమాజమును, ప్రత్యేక ప్రార్థనా మందిరమును ఈ పట్టణమునందు తప్ప చెన్నరాజధానిలో మరి ఎక్కడను లేవు. ఆమె ఈ ప్రార్థన సమాజ సందర్భమున ప్రతి సంవత్సరమును ఉత్సవము జరిపి, చందాల మూలమున కుంటివాండ్రు, గ్రుడ్డివాండ్రు వృద్ధులు మొదలయిన బీదల కన్నప్రదానము చేయుటలో ఎంతో పాటుపడుచుండెడిది.

మనుష్య మాత్రురాలగుటచేత నా భార్యయందును కొన్ని లోపములున్నను, గుణబాహుళ్యమును బట్టి ఆమెను స్త్రీ రత్నమని చెప్పవచ్చును. అట్టి స్త్రీ రత్నము మందభాగ్యుడనైన నాకు కడవరకును దక్కనందుకు ఖేదము నొందుచున్నాడను.

నా భార్య పోయిన మరునాటి నుండియు నాకు వంటచేసి పెట్టువారు, సంరక్షణము చేయువారు లేరు. నా కష్టమును చూచి జాలిపడి రాచర్ల రత్నమ్మ వితంతు వివాహము చేసికొన్న వారిలో రెండవది నా సంరక్షణము చేయబూని మా తోటలోనికి వచ్చెను. భర్త మరణము నొందగా ఈమె కొన్ని సంవత్సరములు మా యింటనే యుండి, నాకు వంట పెట్టులు చేయు రీతియు, నా సంరక్షణ క్రమమును చక్కగా తెలిసినదయి యుండెను. నా భార్య పోయిన దుఃఖములో కొంత సంతోషమును పొంది, ఈమె శరణాలయములోని వితంతువులను సహితము చూచుచుండునని నమ్మితిని. రత్నమ్మ నా యొద్దనుండి నాకు సంరక్షణము చేయుట చిరకాలము సాగినదికాదు. ఈమె తల్లి మంచము మీదినుండి లేవలేక పోగా, కాచిపోయు

వారు లేరని వర్తమానము రాగా విధిలేక వెళ్లవలసిన దయ్యెను. ఆమెను తల్లి మరల నా యొద్దకు రానియ్యలేదు. తోటలోనే వచ్చి ప్రత్యేకముగా కాపురముండవలసినదనియు, నీ కూతురే నీకు సంరక్షణము చేయుననియు తల్లిని నేను బహు విధముల ప్రార్థించితినిగాని కార్యము లేకపోయెను.

గత్యంతరము లేక నేను పులవర్తి సుబ్బారావు ఇంట చేరవలసిన వాడనయితిని. అక్కడనున్న కాలములో నా భోజనము నిమిత్తము నెలకు పదేసి రూపాయలు రొక్కముగా ఇచ్చుచుంటిని. కట్టెలు మా తోటలోనివే పంపుచుంటిని. పాలు పెరుగు మావే ఇచ్చుచుంటిని. తరచుగా కూరలు సహితము నేనే కొని తెచ్చుచుంటిని. ఒక్క కూర చేసి వేళకింత అన్నము పెట్టిన చాలును. నాకు అదియు సరిగా జరిగినదికాదు. పగలు పది గంటల లోపలనెప్పుడును వంట కాలేదు. అన్నము ముతక బియ్యముతో వండినదిగాను, ఒకనాడు పలుకు గలది గాను, ఒకనాడు చిముడునదిగాను ఉండుచు వచ్చెను. ఒకనాటి రాత్రి నాకు కూర చాలకపోయెను. ఇంక కొంచెము వేయమని నే నడుగగా సుబ్బారావు భార్య లేదనెను. సుబ్బారావిది ప్రక్కగదిలోనుంచి వినెను. తరువాత అతడు భోజనమునకు వచ్చినప్పుడు కూర వడ్డింపగా, అయన అడిగినప్పుడేల లేదన్నావని భార్యను కొట్టెను. స్త్రీ స్వయంగా శ్రద్ధయుండి చేయవలెను గాని పురుషుడు బలవంతపెట్టి ఎంత కాలము చేయింపగలడు?

ఒకనాడు నేను స్నానము చేయుటకు పోయినప్పుడు శరణాలయములోనుండిన దుర్గమ్మయు, మంగమ్మయు నాకు తల అంటెదమని బలవంత పెట్టిరి. వారి నిర్బంధమునకు లోబడి తల అంటించుకొని జుట్టంతయు అట్టగట్టినందున దువ్వెనకు సాధ్యముకాక పోయెను. నా భార్య పోయిన తరువాత నాలుగు నెలలకిదియే నా మొదటి అభ్యంగన స్నానము.

ఒకానొకప్పుడు వారిమీద కోపపడుచు వచ్చినను వితంతు శరణాలయము లోని వారు నన్ను తండ్రివలె చూచుకొని ప్రేమించుచు, నన్ను బాబయ్యగారని పిలుతురు. నేనును వారిని నా పుత్రికలవలె చూచి, వారికే విధమైన లోపమును కలుగకుండ సాధ్యమైనంత వరకు చూచుచుందును. అకస్మికముగా నా భార్య పోవుటచేత శరణాలయములోని వారు తమ తల్లి పోయినట్టుగా కొంత కాలము విచారగ్రస్తులయి యుండుచు వచ్చిరి. వారిలో

నా భార్యకు ప్రియతమురాలైయుండిన మంగమ్మ బెంగ పెట్టుకొని రోగ పడెను. మందులిప్పించినను చిరకాలమునకుగాని ఆమె స్వస్థపడినదికాదు.

నాకుపచారములు చేయగలవారిని సంపాదించుకొనుట అత్యావశ్యక మనియు, సుబ్బారావింటనుండుట సముచితము కాదనియు భావించి, వితంతు శరణాలయములోని వారెవ్వరైన వివాహము చేసికొని యావజ్జీవము నా వద్దనుండి సంరక్షణము చేసెడు పక్షమున వారికి వేయి రూపాయల నిచ్చెదనని చెప్పితిని. అప్పుడు దుర్గమ్మయు, మంగమ్మయు, వెంకట సుబ్బమ్మయు నా సంరక్షణము చేసెదమని ముందుకు వచ్చిరి. వీరు మువ్వురును ధనము నిమిత్తము కాక, నా యందలి ఆదరముచేతను, నా అసహాయ స్థితికి జాలిచేతను నా సంరక్షణకు పూనుకొనదలచిరి.

ఇట్లుండగా వయసున పెద్దవాడుగాక, మంచి స్థితి యందున్న విధుర డొకడు నియోగి వితంతువును వివాహము చేసికొనెదనని బరంపురము నుండి నాతో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుచుండెను. శరణాలయమున మంగమ్మ ఒక్కతెయే నియోగి వితంతువు. ఆమెను గూర్చి వ్రాయగా అత డామెను వివాహమాడుట కంగీకరించెను. ఈ సంగతి మంగమ్మకు తెలుపగా, తాను నా సంరక్షణము మాని వెళ్లిపోవలసివచ్చునని ఆమె నిరాకరించెను. దీనినిబట్టి ఆమె మాటలుబూటకమైనవి కావని నమ్మి ఆమె సంరక్షణలో ఉండవలెనని నిశ్చయించుకొంటిని.

1911 లో నేను బెంగుళూరు పోవుటకు నెలదినముల ముందు తెన్నేటి వేంకట దీక్షితులుగారు, ఆచంటలో తన మిత్రుడొకడు పాఠశాలలో వ్యాయామ బోధకుడుగా నున్నాడనియు, వితంతు వివాహము నభిలషించు చున్నాడనియు చెప్పెను. ఆ పనియే ఇక్కడ దొరకిన అతడిక్కడ నుండునా అని అడిగితిని. సంతోషపూర్వకముగా ఉండునని అతడు ఉత్తర మిచ్చెను. మంగమ్మ సంగతి దీక్షితులుగారికి చెప్పి, ఆమెను వివాహము చేసికొని నా యొద్దనే ఉండెడు పక్షమున నేనాతనికి పని ఇప్పించి, ఇల్లు కట్టించి ఇచ్చి, భార్యకు 300 రూపాయల నగలును, 200 రొక్కమును ఇచ్చెదనని చెప్పితిని. ఆయన తన మిత్రుని ఇక్కడకు పిలిపించిరి. అతని పేరు పోతరాజు సూర్యప్రకాశరావు. నేను వారి నొకరినొకరికి చూపి, వారంగీకరించిన మీదట వివాహ నిశ్చయము చేసి, నేను బెంగుళూరి నుండి తిరిగి రాగానే వివాహము చేసెదనని చెప్పితిని. నేను బెంగళూరికి మూడు

దినములకు పోవుదుననగా మంగమ్మ నాకు వంటచేసి పెట్టుట కారంభించెను.

1911 మార్చి 27 న నేను బెంగుళూరికి మంగమ్మతో కలిసిపోయి స్వగృహమున ప్రవేశించితిని. మా యిల్లు సమస్త సౌఖ్యములు కలదియే యైనను నాకక్కడ నుండుటకు మనసు గొలుపలేదు. ఎక్కడ చూచినను గతసంవత్సరము నేనును, నా భార్యయు విహరించిన విహారములును, సంభాషణములును స్మరణకు వచ్చి నా భార్య అప్పుడే మృతి నొందినట్లు బాధ కలిగెను. ఆ గృహమునందుండుట నాకు నరకము నందున్నట్లుగా కనపడినందున దానిని విక్రయించుటకు నిశ్చయించితిని. అందుచేత వెంటనే ఇంటి నమ్మివేసి రాజమహేంద్రవరము చేరితిని. మంగమ్మ వివాహము అక్టోబరు 8 న జరిగెను. నేను కొన్న రెండు బనారసు చీరలలో ఒకదానిని వివాహ సమయమున ధరించుటకయి మంగమ్మకిచ్చి దాని జత చీరను సుబ్బారావు భార్య కిచ్చితిని. వితంతు శరణాలయములోని వారందరికిని రవికల గుడ్డలు కొనితెచ్చి ఇచ్చితిని.

నేను బెంగుళూరికి వెళ్లియున్న కాలములో సుబ్బారావు చూపిన కఠినత్వమునకయి తగవులాడి వితంతు శరణాలయములోని వారందరును లేచి పోయెదమని నాకు సంఘ విజ్ఞాపనమును పంపిరి. వారి మనసులు కరగునట్లుగా నేనొక పెద్ద ఉత్తరము వ్రాసితిని. వారు శాంత చిత్తులయి తమ ఉద్యమమును మానుకొనిరి. మంగమ్మ వివాహమైన తరువాత వితంతు శరణాలయ కార్యములను చూచుటకై ఆమెకు నెలకారు రూపాయలును తోడపని చూచుటకయి ఆమె భర్తకు నెలకారు రూపాయలును, జీతము లేర్పరచి సమాజమువారు నిర్ధారణము చేసిరి. పాఠశాలోపసంఘమువారు సూర్య ప్రకాశరావుగారికి సహాయ వ్యాయామ శిక్షకోద్యమమును పండ్రెండు రూపాయల జీతము మీద నిచ్చిరి. నాకు స్థిరముగా అన్నపానాదులు జరిపి సంరక్షణము చేయువారేర్పడి వారితోడ నేను వాసము చేయనారంభించితిని.

1911 డిసెంబరు కడపటను నాకు జ్వరము తగిలి అంతకంతకు హెచ్చ జొచ్చినది. 1912 జనవరి 3 న మధ్యాహ్నమున రెబ్బా ప్రగడ బాపయ్య గారును, జయంతి గంగన్నగారును, కుందూరి వేంకటరత్నముగారును వచ్చి నా వద్ద కూరుచుండి యుండిరి. ఇంతలో లోపలివారు కాఫీ తెచ్చి

యియ్యగా కొంచెము త్రాగి, అత్యల్ప కాలములోనే స్పృహ తప్పి వెనుక కొరగిలితిని. నా పెదవులు నల్లబడినవట, శ్వాస మాడలేదట, నాడి కనబడ లేదట. అక్కడనున్న వారందరును నా ప్రాణములు పోయినవనియే భావించి తొందరపడ జొచ్చిరి. ఇట్టి స్థితిలో పావుగంట సేపుండి, ఈశ్వ రానుగ్రహముచేత తేరుకొని కన్నులు విప్పి చూచితిని. నా అవయవములు నాకు స్వాధీనము కాకుండెను. ఇతరుల సాయములేక ఒక ప్రక్క నుండి ఇంకొక ప్రక్కకు ఒత్తిగిల లేక పోయితిని. జనవరి 24 తేదీ వరకును మంగమ్మయు, భర్తయు మేడ మీద నా గదిలోనే పరుండుచు వచ్చిరి. 15 దినముల పైని గాని నేను మేడపైని నడయాడ లేక పోతిని. ఫిబ్రవరి 14 నాటికి కొంత బలము వచ్చి తిరుగుచు, కొంత పని చేయగలుగుదునేమో అనుకొన్నాను.

బెంగుళూరు వెళ్లుటకు ముందు మిత్ర బృందమును సమావేశపరచి, నాకు రోగ శాంతి చేసినందుకు దేవునకు కృతజ్ఞతా పూర్వక వందనములు సమర్పించితిని. వితంతు శరణాలయములోని వారును పట్టణములోని వారును ఈ ప్రార్థన సమయమందును, అంతకు ముందు వ్యాధి దశ యందును వచ్చి చూచి నన్నాదరించి పోయినను, పదుమూడేండ్లు నా చేత పోషింపబడి విద్యా బుద్ధులు వడిసిన పులవర్తి సుబ్బారావు భార్య మాత్రము మా తోటలోనే యుండియు ఒక్కసారి వచ్చి నన్ను చూచిన పాపమున పోయినది కాదు ; చూచి రమ్మని సుబ్బారావైనను పంపినవాడు కాడు. కృతజ్ఞత అనగా ఇట్లుగదా యుండవలెను ?

నా భార్య మృతి నొందిన సంవత్సరము లోపలనే నే నామెకు సమాధిని కట్టించితిని. దేశిరాజు పెదబాపయ్యగారు నా భార్య కంటె రెండు సంవత్సర ములు ముందుగానే మృతుడయ్యెను. అప్పుడొక సంఘముచేరి ఆయన పేరు శాశ్వత పరచుటకు నిర్ధారణములు చేసి చందాలు సమకూర్చిరి. అంతేకాని క్రియ శూన్య మయ్యెను. మనము ఎవ్వరైన ఒక్కరు పూనుకొని చేసిన నే పని జరుగునుగాని సమాజమునకు విడిచిపెట్టిన ఏమియు జరుగదు. అందరును కలిసి సంఘీభవించి కార్యము నడుపు సద్గుణమును మనవారింకను నేర్చుకొనవలసి యున్నది. నాలుగేండ్లు గడచినను పెద బాపయ్యకు సమాధి అయినను కట్టించు ప్రయత్నము లేకపోవుట చేత నేను పూనుకొని, 1912 అంతమున సమాధికి కావలసిన ఇంటిని మా

తోటలోనే కట్టించి సమాధి నిర్మాణ నిమిత్తమయి కలకత్తాకు ఉత్తరువు చేసితిని. అది వచ్చియున్నది. శీఘ్రకాలములోనే బాపయ్యగారి అస్థిక లందుంచబడి ప్రతిష్ఠింపబడును.

హితకారిణీ సమాజమున్నను, వితంతు శరణాలయము మొదలగువాని క్రింద అయ్యెడు వ్యయములలో విశేష భాగము నేనే పెట్టుబడి పెట్టవలసిన వాడనగుచున్నాను. సమాజ పక్షమున నేను వ్యయపెట్టినది ఆరువేల రూపాయలకు మించిపోయినది. సమాజమువారి కది తీర్చు మార్గము లేక పోగా, సమాజ వ్యయములకయి మాస మాసమును నూరేసి రూపాయలు నేనే పెట్టవలసిన వాడనగుచున్నాను. ధనాగమనమునకు నాకు రెండు మార్గము లుండినవి - ఒకటి మద్విరచిత పుస్తక విక్రయము: రెండవది సర్వకళాశాలా పరీక్షకత్వము. అశక్తత వలన నేను క్రొత్త పుస్తకములను చేయలేనివాడ నగుటచేతను, బుద్ధిమంతులయిన పిన్నవారు పలువురు బైలుదేరి వివిధ విషయములలో క్రొత్త క్రొత్త పుస్తకములను రచియించి ప్రకటించు చుండుటచేతను నా పుస్తకముల అమ్మక మిప్పుడు తగ్గిపోయినది.

1887 నుండి అవిచ్ఛిన్నముగా 25 ఏండ్లు నేను సర్వకళాశాలా పరీక్ష కుడనుగా నుండి దానివలన దాదాపుగా 20 వేల రూపాయల నార్జించి అంతయు పరార్థముగానే ఉపయోగించి, నా భార్య మరణానంతరము 1911 నుండి పరీక్షకత్వము నా కక్కరలేదని మానివేసినందున నాకా ఆదాయ మసలేపోయినది. నా ధనాగమము మట్టుపడినందున వితంతు శరణాలయాదులకు తెచ్చుటయే అతిభారముగా నున్నది. నా ముక్కున ఊపిరి యుండగా నేనీ వితంతు శరణాలయాదులను విడిచి పోగొటజాలను. నావయఃకాలమంతయు దేశాభివృద్ధి ప్రయత్నములోనే గడిపి, అసహాయు డనయి, అశక్తుడనయి, బీదపడియున్న నా సాయమునకు వచ్చి అస్మద్దేశీ యులు వితంతు శరణాలయాదిక సంరక్షణ భారమును వహింతురని నమ్ముచున్నాను. స్వోదర భరణార్థమయి నే నితరుల వేడను. దానికి చాలిన అల్పవిత్తమును దేవుడు నా కుపకార వేతనము రూపమున అనుగ్ర హించియున్నాడు.

# విజ్ఞాపనము

అస్మద్దేశీయులైన ఆంధ్రమహాజనులారా! రాజమహేంద్రపుర వాస్తవ్యులగు భ్రాతృవరులారా!

నా కడపటిదైన చిన్న విన్నపమును ఒకదానిని మీకు చేయుచున్నాను. ఆంధ్రదేశాభివృద్ధికై ఇప్పుడు పనిచేయుచున్న సమర్థతములలో పరిగణింపబడదగిన వాడను కాకపోయినను, పాటుబడ నారంభించిన వారిలో నేనొక్కడనని చెప్పుకొనుట, కేవల ప్రగల్భోక్తిగా ఎన్నబడదని తలచెదను. నేనెప్పుడును ధనవంతుడనుగాను: బలవంతుడనుగాను: అధికారవంతుడనుగాను: అధిక విద్యావంతుడనుగాను: మహా కార్య విజయ నిర్వహణములకు కావలసిన దానిలో దేనిని గలవాడను కాకపోయినను దేశాభిమానమొక్కటి మాత్రము కొంచెము కలవాడనగుటచేత, తత్ప్రేరణమున శక్యాశక్య విచారము చేయక, దేశ సంస్కరణోద్యమములో నడుగుపెట్ట సాహసించితిని. ఆ కార్యము నెంతవరకు నిర్వహింపగలిగితినో చెప్పలేనుగాని, దాని నిమిత్తమయి నాకుండిన అల్ప ధనమును, యౌవనమును, బలమును, విద్యను, బుద్ధిని ధారపోసి, మీ ఆదరమునకు పాత్రుడను కాగలిగితినని మాత్రము చెప్పగలను. మనదేశస్థులితరులును నన్ను గొప్పచేయుచు వచ్చుటచే తెలుగు దేశములో రాజమహేంద్రవరము సంస్కారములకు జన్మభూమి యని పేరుపడినది. ఇంతవరకు ప్రాణముతో నిలువబెట్టిన యీ సంస్కార వల్లీమతల్లిని కొనలు సాగించి సఫలము చేయవలసిన భారమిప్పుడు మీరు వహించవలసిన అవసరము తటస్థించినది. ఈ భారమును సంతోషపూర్వకముగా పైని వేసుకొని, రాజమహేంద్రవరమునకిం వరకు కలిగిన కీర్తికంటె ఎక్కువ కీర్తిని తెత్తురని మిమ్ము మీ వృద్ధ సోదరుడనైన నేను వినయపూర్వకముగా వేడుచున్నాను.

ఈ కీర్తి తెలుగు దేశమంతటిదిగాని రాజమహేంద్రవరము నొక్కదానిదే కాదు. నేనరవదేశమునందునను, కన్నడదేశమునందును సంచారము చేసినప్పుడక్కడివారు సంఘ సంస్కారాది విషయములలో తమ దేశముంకంటె తెలుగు దేశ మెక్కువ అభివృద్ధి పొందినదని చెప్పుకొనుచుండగా

నేను పలుమారులు విని, ఆంధ్రదేశము యొక్క అభ్యున్నతికానందించి గర్వ పడుచు వచ్చినాడను. ఓ ఆంధ్ర మహాజనులారా! అనంత సత్ఫలిత సంధాయకమైన సాంఘిక సంస్కారవల్లరీ పోషణ భారమును వహించుడు. మీరాభారమును పూర్ణముగా భరింపుడని ఆంధ్రమాత తన ప్రియ పుత్రులను వేవిధముల వేడుచున్నది........

దేశాభివృద్ధికి సంస్కారమన్ని విషయములలోను సమానముగా నుండ వలయునుగాని, ఒక్క విషయములో మాత్రమే నడచుచుండుట చాలదు. ఏకవిషయాభివృద్ధి ఎప్పుడును నిజమైన అభివృద్ధి కాజాలదు. శరీర మందలి సమస్తాంగములును పరస్పరానుకూలముగా నెదుగక, ఒక కడుపో, కాలో ఎక్కువగా నెదిగినప్పుడు దానిని రోగ చిహ్నముగా ఎట్లు భావింతుమో, అట్లే ధార్మిక సాంఘికాభివృద్ధి ప్రయత్నమునుపేక్షించి, రాజ్యాంగ స్వాతంత్ర్యాభి వృద్ధిని గూర్చియే ఉద్యమించుటయు సంపూర్ణ సుఖసాధకము కాజాలదవి భావింపవలయును. రాజ్యాంగ స్వాతంత్ర్యములను సంపూర్ణముగా పొందగలవారమయినను కుటిల కులాచార భూతమునకు దాసులమయి, కడుపున పుట్టిన బిడ్డల స్వాతంత్ర్యములనైన ఇయ్య జాలక, ఆ అనాధ బాలలు వైధవ్య దుఃఖముల పాలయి బాధపడుచుండగా చూచుచు మనమేమి సుఖమనుభవింపగలుగుదుము? ఇంట సుఖదాయకములైన సత్కులాచార స్వాతంత్ర్యములను సంపూర్ణముగా పొందగల వారమయినను, బయట ధనప్రాణములకు రక్షణము చేయని క్రూర నిరంకుశ ప్రభుత్వమునకు నిరంతర దాస్యము చేయవలసిన యెడల ఏమి సుఖమనుభవింపగలుగుదుము? ఇంటను, బయటను గూడ హేయదాస్యము నుండి విముక్తులమయి, ఉభయ స్వాతంత్ర్యములను పొందగలిగినప్పుడు గదా మనము నిష్కళంక సౌఖ్యము నొందగలుగుదుము? కాబట్టి నిజమైన దేశ క్షేమమును ఉపేక్షించిన పక్షమున సమస్త స్వాతంత్ర్యముల నిమిత్తమును, సమస్త అభివృద్ధుల నిమిత్తమును సమానముగా కృషిచేయుడు.

ఇప్పుడు మన ఆంధ్రదేశము మేలుకొని, చురుకుదనమును బూని దేశాభివృద్ధికరములైన నానా క్షేత్రములయందు మహోత్సాహముతో కృషి చేయుచున్నందుకు నేనెంతయు సంతోషమొందుచున్నాను. ఇటువంటి స్థితి మన మాతృభూమికి కలుగవలెనని నేను 30, 40 సంవత్సరముల క్రిందట అభిలషించితిని. అప్పుడా కోరిక దివ్యస్వప్న సదృశ్యముగా కనబడినది. అప్పుడు

రాజమహేంద్రవరమువంటి పట్టణములలో సహితము యువజనులు సభలు చేయుటయే సామాన్యజనులు దృష్టికి తప్పిదముగా నుండెను. ఇప్పుడు చిన్న పల్లెలయందు సహితము సభలు జరుగుచు, వివిధ విషయములు వితర్కింపబడి, జనసామాన్యముచే మెప్పొందుచున్నవి. అప్పుడు స్త్రీ విద్య బహుజనులచే దూషింపబడుచుండెను. ఇప్పుడెల్లయెడల బాలికా పాఠశాల లేర్పడి, స్త్రీ విద్య అభివృద్ధి నొంది, సభలు, ప్రసంగములు, పుస్తకములు చేయగల స్త్రీలచే నొప్పి భూషింపబడుచున్నది. అప్పుడు దేశ భాషలు పురుషులు చదువుటకు సహితము తగిన పుస్తకములు లేకుండినవి: ఇప్పుడు పురుషులకుపయుక్తములైనవి మాత్రమే కాక, స్త్రీలు చదువదగిన పుస్తకములు కూడ దినదినాభివృద్ధి నొందుచున్నవి. అప్పుడు విద్యాభిరుచిగల ధనవంతులకే పుస్తక సంపాదనము బహు వ్యయ ప్రయాస లభ్యమగుచుండెను. ఇప్పుడూరూర పఠన మందిరములు ప్రబలి, బీదలకును పుస్తక సంపాదనము అల్పవ్యయ సాధ్యమగుచున్నది. అప్పుడాంధ్ర వార్తాపత్రికలంతగా లేకయు, ఉండిన ఒకటి రెండును చదువువారు లేకయు ఉండెను. ఇప్పుడు దేశభాషావృత్తాంత పత్రికల సంఖ్య అధికమయి, వేలకొలది చదువరులు గలవయి, కొన్ని పట్టపగటి సూర్యునివలె ప్రకాశించుచున్నవి. అప్పుడు ధూమనౌకమీద విద్యాగమము కొరకు చెన్నపురికి వెళ్లిన వారికే ప్రాయశ్చిత్తములు విధింపబడుచుండెను. ఇప్పుడు విద్యా, వాణిజ్య, శిల్ప శాస్త్రార్థము ఖండాంతరములకు పోయి వచ్చినవారికిని ప్రాయశ్చిత్తము లక్కరలేక పోవుచున్నవి. ఇటువంటివి అనేకములు చెప్పవచ్చును. అయినను సాంఘిక సంస్కారాదుల యందు మనవారికి మాటలలో గల శూరత్వము కార్యములలో నింకను నేనభిలషించినంతగా కనబడుచుండ లేదు. ఉద్యమములలో మాట లెక్కువగాను, కార్యములు తక్కువగాను కావలసినవి కొన్ని: మాటలు తక్కువగానూ, కార్యము లెక్కువగాను కావలసినవి కొన్ని. రాజ్యాంగ సంస్కార ప్రయత్నము మొదటి తరగతిలోనిది: సాంఘిక సంస్కార ప్రయత్నము రెండవ తరగతి లోనిది. ఈ రెంటిలో సంఘ సంస్కారము మన చేతిలో నున్నది. రాజ్యాంగ సంస్కారము దొరతనమువారి చేతిలో నున్నది. మన సంఘ స్థితి బాగుపడినగాని ప్రభుత్వమువారను గ్రహించెడు రాజ్యాంగ స్వాతంత్ర్య ఫలములను మనము నిర్విచారముగా అనుభవింపజాలము. ఈ సత్యమును దృఢముగా మనస్సు

నందుంచుకొని, సంఘ సంస్కారోద్యమమునందు కూడ సమాన శ్రద్ధ వహించి పనిచేయుడు. ఈ పనిలో ఎక్కువ కష్టములున్నవనుటకు సందేహము లేదు. ఉన్ననేమి? ఎక్కువ ఫలముల ననుభవింపగోరువారు ఎక్కువ కష్టములు పడవలెను.

ఒక రే విషయమున నైనను పనిచేసి పేరు పొందుచున్నప్పుడు ఈర్ష్యాళువులైనవారు కొందరు వారిపైని లేని దోషముల నారోపించుచు, వారి పేరుకు భంగము కలిగింప పాటుపడుదురు. మరి కొందరు వారి కీర్తికి మాలిన్యము కలిగించి, వారి నడగ ద్రొక్కుట చేతనే తాము పైకి రావలెనని ప్రయత్నము చేయుదురు. ఈ ఇరుతెగలవారి వలని ఉపద్రవము సంఘసంస్కార నాయకులకెట్లో అట్లే రాజకీయ నాయకులకును గలదు. ఈ దేశ సేవాపరులు దేశమునకు చేసిన ఉపకారమునకై దూరస్థలములయందు సహితము సభలు చేసి మహా జనులు అభినందన పత్రికలను చదువుచుండగా, అసూయాపరులు స్వస్థలములో యుక్తా యుక్త వివేక శూన్యులైన బుద్ధి హీనులని పత్రికలలో తెగడుచుందురు. ఈ దోషైక దృక్కులు జనులకు చేసెడిది ఉపకార లేశమైనను కానబడదు. లౌక్యాధికార ధూర్వహులనేకులు తమ కన్నుల యెదుట లంచములు పుచ్చుకొనుచుండ ఒక్క మాటయైనను పలుకుటకీ విలేఖకులకు నోరు రాదు. వ్రాయుటకు కలము సాగదు. రేయింబగళ్లు కష్టపడి న్యాయముగా పని చేయు వారిని దూషించుటకే వీరికి పెద్ద నోరు వచ్చును. ఒక్క దురాచారమును మాన్పుటకైనను వీరి కెప్పుడును బుద్ధి పుట్టదు : మాన్పుటకయి ప్రయత్నించెడి వారిని నిందించుటలో వీరి కెక్కడలేని బుద్ధులు నుదయించును.

మన దేశాభివృద్ధి కిప్పుడు పని కావలెను గాని, అది లేని పొడిమాటలు కావలసియుండలేదు. మన ఆంధ్ర దేశము నందు సాంఘిక, ధార్మిక విషయములలో పని చేయుటకయి ఏర్పడియున్న సమాజములలో హితకారిణీ సమాజము ముఖ్యమైనదని చెప్పవచ్చును. దాని భరణమునకయి నా కున్న అర్థము నిచ్చితిని గాని అది దాని వ్యయములలో అర్థమునకయిన చాలదు. ధనాభావము చేత హితకారిణీ సమాజము నూతనారంభమునకు పూనలేక పోవుటయే గాక, ఉన్న వితంతు శరణాలయాదులను నిర్వహించుటకు త్రొక్కట పడుచున్నది. మీ దేశ సేవ

యందు కాలము పుచ్చి దయనీయుడనయి యున్న నేను చేతులు జోడించి వినయపూర్వకముగా మీకు నా కడపటి ప్రార్థనను చెల్లించి హితకారిణీ సమాజములో సామాజికులుగా చేరి దాని నుద్ధరించి నిరంతరాయముగా నెగడునట్లు చేయుడు. ఈశ్వరుడు మీకు నిరంతర శ్రేయస్సును కలిగించునుగాక ! ఓ భక్త వరదా ! ఓ దీన రక్షకా ! దీనుడనైన నేను ఆంధ్ర దేశమును సంతతాభివృద్ధి నొందుచుండుదానినిగా చేయ ప్రార్థించుచున్నాను. నా ప్రార్థనను సఫలము చేయుదువు గాక !

ఇట్లు విన్నవించు విధేయ సేవకుడు,

కందుకూరి వీరేశలింగము.